కవితిలక గ్రంథమాల ద్వితీయ కుసుమము.

# అభిజ్ఞాన శాకుంతలము

మేరీరాణీ కళాశాలాంధ్రోపన్యాసకురాలగు
శ్రీమతి విద్వత్కవితిలక
కాంచనపల్లి కనకాంబగారిచే రచింపఁబడినది.
ప్రకాశకుల పీఠికతోఁ గూడినది.

రెండవ కూర్పు ౧౦౦౦ ప్రతులు

బెజవాడ
శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము
వారిచే బ్రచురింపఁబడినది



ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్సున ముద్రితము

1941.

తపాలా ఖర్చులు ప్రత్యేకము] [వెల రు 1—4—0

శ్రీ భాస్కరాయ నమః

# అభిజ్ఞానశాకుంతలము



## శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారి ఆంధ్రానువాదము



## ప్రకాశకుల సింహావలోకనము

### కావ్యప్రయోజనము

భరతఖండమున వేదశాస్త్ర పురాణేతిహాస కావ్య రూపమునఁ బలు తెఱఁగుల విజ్ఞానము విలసిల్లుచున్నది. శాస్త్రములు వేదాంగములు. శాస్త్రసహితమైన వేదము, ధర్మాచరణమునకును, పరంపరగా సర్వధర్మములఁ బరిత్యజించి హరి గురు శరణమున సాధింపఁదగిన వేదాంత సిద్ధికిని దోడుపడుచున్నది.

వేదశాస్త్రముల ప్రచారము కాలక్రమమున విరళమైన కొలఁది సాహిత్యమునకుఁ బ్రాధాన్యము కలిగెను. ప్రభుసమ్మితమైన వేదమందుఁ బ్రతిపాదింపఁబడిన సద్ధర్మములే కాంతాసమ్మితముగాఁ గావ్యములయందు మనోహరముగాఁ జిత్రింపఁబడినవి. ఆదికవులు వాల్మీకి వ్యాసాదులు రచియించినవి, యితిహాసము లనఁ బడునవియు బురాణము లనబడునవియును గావ్యములే యనఁదగియున్నవి.

తరువాత వారు చిన్న చిన్న కథ లష్టాదశ వర్ణనలతోఁ జాతుర్యముగాఁ గావ్యములుగా రచించిరి. ఈ కావ్యములు పద్యములు, గద్యములు నుభయాత్మకము లయిన చంపువులుగా విభజింపఁబడి యున్నవి.

వేదశాస్త్రగతాభిప్రాయములనే కావ్యములు బోధించినను, సాహిత్యమును గొంత చిన్నచూపు చూచు నజ్ఞులకుఁ దెలివి గలిగించుటకై జగన్నాథపండితరాయ లిట్లు తనయాశయమును గంఠోక్తిగాఁ బ్రకటించియున్నాఁడు.

గీ. "వ్యాసుఁడగుఁ గాక గౌతముఁడగునుగాక,
యలపతంజలి యగుగాక యెలమి నెవ్వఁ
డెఱుఁగకుండును సాహిత్య మెట్టిదేని
వాఁ డనర్హుండు కొన నాదు వందనంబు".

గీ. కావ్య తత్త్వంబు 'వేఱిది' కాంచఁగల్గు
వార లారయ నెందఱో లేరు భువిని
నెందు నెవ్వండు కలఁడు మరంద మందు
గలుగు మర్మ మెఱుఁగ మధుకరుఁడుగాక.

ఆంధ్రభామినీ విలాసము, అవధానీయము.

అనియును బండితరాజ జగన్నాథరాయలు ప్రబోధించెను.

## దృశ్య కావ్యములు

మనసు నాకర్షించుటలో శ్రవ్య కావ్యముల కన్న దృశ్య కావ్యములు సమర్థంబులు. మంచి యెట్లో చెట్టకూడ దృశ్య కావ్యముల మూలమునఁ బ్రజలలో వ్యాపించును గాన దృశ్య కావ్యములయందుఁ బ్రదర్శింపబడు విషయములపట్ల విధినిషేధంబులు బలవత్తరములై యేర్పడినవి.

గీ. పాలము కేకలు చంపులు పోరితములు, తానములు బూపములు బలాత్కారమంబ
రగ్రహముఁ జుంబనాదులు రతుల గతులు, తగదుఁ రంగాలఁ జూపఁ బ్రత్యక్షముగను.

నాటకంబులకుఁ గావ్యములతోఁబాటు, త్రివర్గము ( ధర్మార్థ కామములు ) సాధ్యము. ఆ త్రివర్గము క్రమముగా మోక్షమునకు సాధనము.

కావ్యమునకుఁ దాత్కాలికమగు నానందమే ప్రయోజనముగా నుండవలెను. కావ్యములు నీతిని ధర్మమును బోధింపరాదనియు నట్లు బోధించునవి, యుత్తమ కావ్యములు కావనియుఁ గొందఱిమతము. శ్రవణకాలమున బ్రహ్మానందసదృశమగు నానందమును గలుగఁజేయుటయే కాక, సద్ధర్మములను గాంతాసమ్మితముగా నుపదేశించుట యుత్తమ కావ్య ధర్మమని శిష్టులమతము. ధర్మబోధ విషయమున వేదశాస్త్రముల మార్గము జ్వరితునకుఁ జేదుకషాయము వంటిది. సేవించుటకుఁ గష్టముగా నుండినను, రోగమును శమింపఁజేయఁ గలుగును. కావ్యనాటకాదుల మార్గము రోగి కమృతప్రాయ మగు ద్రాక్షాసవసేవనము వంటిది.

కావున సహృదయు లుపదేశమునకై వేదమార్గముకంటె నాటకాదులనే కాంక్షింతురు.

## నాటక లక్షణములు

నాటకమున కౌచితి ప్రాణము. ఔచితిగల నాటకములు వరముల నిచ్చు దేవతలవంటివి. ఔచితి లేని నాటకంబు లశుభసంపాదకంబు లగు భూతములవంటివి. నాటకములయందు వేషభాషాక్రియ లా యా పాత్రముల కుచితమై యుండుట రసోత్పత్తికిఁ గారణమగును. వేషభాషాక్రియలు తారుమారగుట యనుచితమగుటయే కాక రసభంగకారణము.

వస్తువు, నేత, రసము మారుటంజేసి, నాటకములందు భేదము లేర్పడును.

వస్తువు ప్రఖ్యాత మనియు, మిశ్రమనియు, నుత్పాద్యమనియు, మూడు విధములు.

కాళిదాసకృతనాటకములందు శాకుంతలము ప్రఖ్యాతము - మాళవికాగ్నిమిత్రము కల్పితము లేక యుత్పాద్యము - విక్రమోర్వశీయము మిశ్రము - శ్రవ్యప్రబంధములయందు నిట్టి భేదము గలదు.

ఉ॥ "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిబుట్టు రత్నము లపారిత సత్కవి కల్పనావిభా
షావహ పూర్వ వృత్తములు సానలుదీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్"

(వసుచరిత్రము)

భట్టుమూర్తి కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లనియెను. స్వచ్ఛందానుసారులైన కవులు ధర్మపరిత్యాగముచేసి, భగవత్ప్రసక్తి విడిచి యర్థకామంబులుద్వేజకంబులుగాఁ బ్రతిపాదింతురను భయముచే కల్పనాకథలకు కృత్రిమత్వ మాపాదింపఁబడియె.

కథ కేవలకల్పితమయ్యు ద్రివర్గసాధక మగు రసవత్ప్రబంధ మగునేని యుత్తమత్వము నొల్లొప్పును. దీని కుదాహరణములు - కళాపూర్ణోదయము, కాదంబరి మొదలగునవి - కాదంబరి యసత్కావ్య మనువారి మతము మంచిది కాదు. వస్తునిర్దేశరూప మంగళ మం దాచరింపఁబడుటచేత ధర్మార్థ కామ మోక్షరూప చతుర్విధ పురుషార్థములు రసవంతములుగ నందుఁ బ్రతిపాదించుటచే నయ్యది యుత్తమ కావ్యమే యని శిష్టమతము.

"ఆద్యసత్కథలు వావిరి బుట్టు రత్నములు' శ్రవ్యప్రబంధములు పుట్టినట్లే యుండి ప్రఖ్యాతములైనవి. నాటకమందలి ప్రఖ్యాతవస్తు వట్లుకాక రసోచితముగా మార్పుచెందుచుండును. "రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబుఁ బరిహరించియు, మాతృకానుసారంబున' ననువాదంబు చేసిన శ్రీనాథ కవిసార్వభౌముండే మూలమునందలి యనౌచిత్యంబులఁ దొలగించి యుండ దృశ్యప్రబంధములఁ జెప్పు మహాకవి యౌచిత్యమే ప్రాణముగాఁగల నాటకమున, మాతృకలలోఁగల యనౌచిత్యంబులఁ బరిహరించి, నీరసభాగముల నిరసించి. రసము పోషించి రంగమున కనుకూలముగా నలంకరించకుండునా?

కాళిదాసకవిచంద్రుఁడు సకలకళాపరిపూర్ణుఁడగుటచే నాతని చేతఁబడిన శాకుంతల మత్యంతమనోహరంబయ్యె. శాకంబు పాకవిశేషంబున రుచికరంబగుఁ గదా?

మ. అవియే వస్తువు లొక్కపాకమున రుచ్యంబౌ నవే వండ వా
చవిగా నొక్కరిచేత వాక్కులవి విశ్వశ్రేయమౌ కావ్యమౌ
గవికూర్పన్ గుకవుల్ పొనర్చెదరు దుష్కావ్యంబుల వ్యాసనే
కవిచేతంబడి యెట్టిలోహములు చొక్కంబైన బంగారమౌ.

"కనకాంబాకృత తోమాలియ"

1 భారతకథలో దుష్యంతుఁడు పురోహితద్వితీయుఁడై కణ్వాశ్రమమునకుఁ బోయి "ఎవరిచ్చట" యని యెలుగెత్తి పిలువగా శకుంతల తానేవచ్చి యాతిథ్యమిచ్చినట్లున్నది.

2. "ఇట్టి రూపగుణములుగల నీవు నా మనము నపహరించితివి. ఓ చిన్నదానా! నీవెవ్వరవో వినఁగోరుచున్నా" నని రాజడిగినట్లును, శకుంతలయు విశ్వామిత్రమేనకాశృంగారసముపేత మగు తన పూర్వచరిత్రను తానే చెప్పికొన్నట్లు నున్నది.

ఇతిహాసోచితమైన కథ యెట్లుండిన నేమి? అందు విషయమే ప్రధానము. కాళిదాసమహాకవి నాటకమందో యంతయు రమణీయమే.

రథవేగము ప్రశాంత మగు నాశ్రమారణ్యప్రదేశములు, బ్రహ్మచారుల నిరాడంబరజీవనము, వారి భూతదయ, తాపసులయెడ రాజులగౌరవము నవ్యాజమనోహర మగు శకుంతలాసఖీజనుల యుపవనవిహారము కన్నులకుఁగట్టినట్లు చిత్రింపఁబడినది.

ఇంక నాయికానాయకుల సమావేశసంఘటనమో యసమానము. సర్వాంగసౌందర్య ప్రదర్శనానుకూలము లగు జలాహరణ వృక్షసేచన వ్యాపారములను రాజు పరోక్షముగాఁ జూచుచుండుటయు మధుకరుఁడు ఝుంకార మొనర్చుచు శకుంతలను బైకొని నానావిధ శృంగారచేష్టల ననుకరించు లీలల నొనర్చుచుండ "మధుకర! తత్త్వమారయుట మా పనియయ్యెఁ గృతార్థుఁడీవెకా" (చూ॥ పుట 10) యని రాజుచేత ననిపించుటయు, గాళిదాస మహాకవియొక్క వ్యంగ్యనైపుణ్యము, రచనా కౌశల్యము ప్రకటించుచున్నవి. మహారసికజనైకవేద్యములు.

రోలంబబాధనుండి తన్ను రక్షింపుమని చెలికత్తెల నడుగఁగా "రక్షించుటకు మే మెవ్వరము? దుష్యంతుని రమ్మనుము. తపోవనములు రాజరక్షితవ్యములుకదా." అని చెలికత్తెలచేత ననిపించి యా సందర్భమున దుష్యంతునకు నాయికాసమావేశము సంఘటింపఁజేసిన కవి శిల్పనైపుణ్యము కొనియాడఁదగినది. అనంతరము రాజకన్యా సమావేశమున సంభాషణము కడుంగడు శ్రావ్యము. శకుంతలాపూర్వచరిత్రమును సంగ్రహముగాఁ జెలికత్తెచేత నారంభింపఁజేసి సగములో సిగ్గుపడిన దాని మాటలతో రాజున కర్థమైనట్లు సూచించినాఁడు. "జీవితమ్ వ్యంగ్యవైభవమ్."

కాళిదాసుని కౌశలముఁజూపు మఱికొన్ని విషయములు దిక్ప్రదర్శనముగా నిరూపింపఁబడుచున్నవి.

I దుర్వాసశాపము. శ్రవ్యకావ్యము శ్రోతల కనుకూలముగా సమర్థులగు వ్యాఖ్యాతలు సమర్థింతురు గానఁ బ్రమాద ముండదు. దృశ్యకావ్యములు ప్రత్యక్షములు, వ్యాఖ్యకవకాశములు లేనివియు నగుటచే నాయకులయం దెట్టిలోపములున్న నవి యనధికారులగు ప్రేక్షకు లనుకరింతురని మహాకవులు నాయకులయందు దోషములవలెఁ గనపడునవికూడ లేకుండ సవరింతురు.

దుర్వాసశాపమే లేనిచో దుష్యంతుడు గాంధర్వవిధినిఁ బెండ్లియాడిన మహాసాధ్వీమణిని వంచించిన మహాశఠుఁడై పోవలసివచ్చును. మఱపునకు వేఱుకారణము చెప్పుటకంటె శాపమును గల్పించుట యుచితము.

ఇక శాపకారణము - ఎంతటి మోహమును, ప్రేమము నున్నను, సర్వనిరోధమగు కామము సహింపఁదగినది కాదు.

ఏ సంసారంపు తగులంబు లేని కణ్వుఁడు, కన్నతల్లిచేఁ బరిత్యజింపఁబడిన నిసుఁగును కేవలానుగ్రహముచేఁ దెచ్చి పెంచి, యామెకై ముదుసలియగు గౌతమిని, బాలికలగు ననసూయాప్రియంవదలను గూర్చుకొని యంతగా లాలించి, తన దుర్దైవమును శాంతింపఁజేయుటకు సోమతీర్థమునకుఁ బోయియుండెఁ గదా!

అట్టి నిర్వ్యాజకరుణామూర్తి యాజ్ఞయైన యతిథిసత్కారము చెల్లింపకయున్న కామినీమణి శాపమునకుఁ దగినది కాదా? యని కాళిదాసుని హృదయము.

ఉంగర మభిజ్ఞానము. ఈ యానవాలు దొరికినపుడు, ప్రియురాలు స్మరణకు వచ్చి దుష్యంతు డుత్తమనాయకున కుచితమైన తీవ్ర విరహవేదన పాలైనాఁడు. రసావేశమును దత్ప్రతియోగి రసాంతరప్రవేశమున నుపశమింపఁ జేయవచ్చు నను న్యాయమును మహాకవి సత్యముగా నుపయోగించుకొనెను.

కామోన్మాదముననే కాక ధర్మప్రజాసంపత్తి కలుగఁబోవు తటి గర్భవతి యగు ధర్మపత్నినిఁ బరిత్యజించితినే యను దుఃఖముతో మూర్ఛిల్లిన రాజునకు వీరావేశము కల్పించుట కదృశ్యుఁడై మాతలి, విదూషకుని మేఘప్రతిచ్ఛంద ప్రాసాదముపై కెత్తుకొని పోవుటయు వాఁడు మొత్తుకొనుటయు దానితోఁ గ్రోధావిష్టుఁడై రాజు శరమెత్తుటయుఁ దరువాత నింద్రసందేశము వినిపించుటయు నెంతయు సహృదయహృదయంగమములు.

ఇట్లే భారతకథకంటె వేఱైన పట్ల కవిచంద్రుని కౌశలమును బాఠకు లారయఁ గలరు.

## దుష్యంతుఁడు

ఈ నాటకమునకుఁ గథానాయకుఁడు ధీరోదాత్తుఁడు, నిండు జవ్వనమున నున్నవాఁడు, మృగయాసక్తుఁడు, ధర్మపోషకుఁడు, ఇంద్రునంత వానికి సాయము చేయఁ

జాలిన పరాక్రమము కలవాఁడు. 'చతుర గంభీరాకృతిఁ గలిగి నేర్పుగను బ్రియము గను మాటలాడుచు మహారాజువలె గనుపడు నీతఁ డెవండో' యని ప్రియంవద యుచ్చరువడుటకుఁ దగిన యాకృతియు ప్రజ్ఞయుఁ గలవాఁడు. భూకాంతులు భోగలాలసు లయ్యు ధర్మసహితులు.

"పూజ్యమైన నామనంబు వలచె నిఁక సంశయంబేల నీమె రాజన్య యోగ్య" యని తన హృదయదార్ఢ్యమందును వివేచన మందును దాను విశ్వాసము కలవాఁడై నను నాయికావృత్తాంతము సమగ్రముగా నెఱుంగువఱకు హృదయమును జిక్కబట్టుకొని యుండెనే కాని కామవివశుండు కాలేదు. నిజస్వరూప మెఱిఁగిన తరువాత నాతని మాటలచే స్వతంత్రులైన రాజులుఁగూడ ధర్మపరతంత్రులై వేలాతిక్రమణంబున కెంత భయపడఁ దగియున్నదో యీక్రిందియాతని మాటలవలనఁ దేటపడగలదు.

"అగ్ని యని దేని శంకించి తదియయౌర
తాకఁదగినది యయ్యె సద్రత్న మిద్ది".

చరిత్ర మనుకూలించెగాని లేకున్న శకుంతల "స్పృశింపదగని యగ్ని" యని దుష్యంతుని యభిప్రాయము.

తాపసులు వచ్చి చంపఁదగదీ యాశ్రమమృగ మన్నంతనే మృగయావ్యసనమును మాని శస్త్రముల నుపసంహరించుకొన్న మహారాజునకుఁ గల సాధుగౌరవ మెంతని చెప్పవచ్చును. అతని వంశ మట్టిది.

"ఆర్తరక్షణమునకె మీ యస్త్రమధిప
పాపరహితుల నొప్పించు పనికిఁగాదు".

"అదిరా! పురువంశంబున, నుదయించిన నీకు నెంతయుఁ యుక్తంబొ నిది"

ద్వితీయాంకమునఁ దన విరహబాధ నటుంచి యజ్ఞవిఘ్నకారు లగు రాక్షసులను సంహరించుచుంటచే దుష్యంతునకుఁ గల యంతరింద్రియ నిగ్రహము తేటపడును. "ఇటఁ దపస్విజనుల యాజ్ఞ, అటు గురుజనుల యాజ్ఞ రెండును దాటగూడనివియే" అనుటలో నాతనికిఁ గల మాతృభక్తి విదితము.

'పరకళత్రము పరికింపఁ దగదని' శకుంతలను బరిహరించుట నట్టి వాడెంత మహానుభావుఁడని ప్రతీహారిముఖమునఁ గవియే రాజును మెచ్చుకొన్నాఁడు.

"ఏమి ప్రభువుగారి ధర్మదృష్టి! సుఖముగ లభ్యపడిన యిట్టి రూపవతినిఁ జూచి యెవ్వఁడు విచారించును" అని. ప్రజాపరిపాలన మందు నేమరఁడు. అలసుడై పరుండక యలసినపుడుమాత్రము కొంచెము విశ్రమించి తక్కినవేళలఁ బ్రజల నరసికొను వాడు దుష్యంతుఁడు. ఈ యర్థము.

"కరిఘటలను నడపికరిరాజు పగలెండ"

యను పద్యమున నున్నది—

రాజ్యము భోగము కొఱకుఁగాదు, ప్రజాపాలనకొఱకని దుష్యంతుఁడెఱుఁగును. అందలి కష్టము నెఱింగియే విధి బుద్ధిచేత సహించువాఁడు, చూచువారికి గొప్పగాఁ గానుపించినను రాజ్యభారము మోచువానికి మాత్రము కష్టమేయని రాజిట్లు నుడివెను.

"రాజ్య మది యుత్సుకత్వమాత్రంబుఁ బాపు"

59 పుట.

తాపసులసన్నిధికిఁ దానుబోయి సేమ మరయుటఁ దనకు సంతస మొసంగును. గాని వారు కొఱతపడ తనతో మనవిచేసికొనుటకు వచ్చి వాకిట నిలువఁబడుట రాజు సహింపడు. తాపసులు వచ్చినారని వినఁగానే తన యశ్రద్ధచేతఁ గాని, విచారణలేమిచే గాని, పాపముచేఁ గాని యాశ్రమవాసుల కేమిలోపము జరిగెనోయని భయపడువాఁడు.

"లతలన్ బూతలు నిల్చిపోయెనొ కదా నాచేయు దోసంబులన్"

అనియనుకొనును—

విరహవేదనాతుర మనుభవించుచుండియు నిదురలేమిఁ "మేము సభాభవనమునకు రాజాలము, రాచకార్యములు మీరే విచారింపుఁ"డని పరిచారికచే మంత్రికిఁ గబురుపంపు మహారాజు ధర్మదృష్టి కొనియాడ దగినది. పుత్రహీనుఁడగు ధనికుఁడు చనిపోయినాడు. అతనిధనమున కేమి సెలవనఁగానే భాగ్యవంతుఁడగుటచే బహు భార్యలుందురు, అందే సాధ్వియైన గర్భవతిగా నున్నదేమో కనుఁగొను మనుమాట వరాల మూట.

పాపవిషయమునఁదక్క ప్రజల కన్నియెడలఁ దానే బాంధవుఁడనని చాటింపుమనుట యెంతగొప్పమాట. "దుర్బలానాం బలం రాజా" యన్నమాట దుష్యంతుని పట్ల నిజము – దుష్యంతుఁడు దేవపితృదేవభక్తికలవాఁడు.

దుష్యంతుని శృంగారము పవిత్రమైన దగుటచేఁ బ్రథమ సమావేశము కణ్వాశ్రమమందును, ద్వితీయసమావేశము మారీచాశ్రమ మందును జరిగినవి.

దుష్టమృగసంహారము తపోవిఘ్నసంహారమైన పిదపఁ బ్రథమ సమావేశమును దేవేంద్రునికి సహాయుఁడై రాక్షససంహారము చేసిన పిదపఁ బ్రియురాలితో ద్వితీయ సమావేశము జరిగెను.

ఇట్లే మనము తలఁచినకొలఁది నాయకగుణము లనంతములుగాఁ దోఁచును.

## శ కుం త ల

అంతఃపుర దుర్లభమయిన తనువు "కాంతారాశ్రమమందున్న శకుంతలకుఁ గలు

గుటయే దుష్యంతుని దృష్టి కచ్చెరువుగొలిపినది." అవ్యాజ మనోహర మగు నీ కాయ
మును గాశ్యపుఁడు కఠినమైనపనులకు నియోగించుచున్నాఁడనిపించి ఈమె వయసున కీ
వల్కలము తగదనిపించి, "వల్కలములనైన నీకలికిఁ గాంచువిశేషమనోహరత్వమే"
యనిపించి కమనీయంబగు నవయౌవన మనిపించి నాయికామణి తన సౌందర్యాతిశయ
ముచే మహారాజును ముగ్ధు నొనరించునట్లు చేసెను.

తానును మహారాజును జూచినంతనే "క్వచిదేవ తారామైత్రీ" యను మాటకు
దార్కాణముగా శకుంతల మోహావిష్టురాలై, "హృదయమా! తత్తరపడకుము.
నీవడుగఁదలచిన దననూయయే యడుగుచున్నది" అని యనుకొన్నది. తన హృదయ
మందుఁ బొటమరించిన శృంగారాంకురమును గుఱుతించి, శకుంతల మహారాజును
జూచినప్పటినుండియుఁ దపోవనవిరుద్ధ మగు భావమునకు లోనైతినని యనుకొన్నది.
శృంగార లజ్జచేతను, సాభిప్రాయ వీక్షణములచేతను దన వివాహమునుగూర్చి మహా
రాజునకు విన్నవించు సఖీవచనమును దిరస్కరించి, తా నక్కడనుండి వెళ్ళెదనని
పోఁబోవుటచేతను, ప్రియంవద యసంబద్ధప్రలాపములను గూర్చి పూజ్యురాలైన గౌత
మికిఁ జెప్పెద ననుటచేతను దన యనురాగాంకురము తీఁగ సాగించెను.

కలసి మాటలాడగా నను పద్యమున నామె భావప్రకటనమును దుష్యంతుఁడు
వర్ణించినాఁడు.

ప్రకృతి సుందరి యగు శకుంతలకు వృక్షములు, లతలు, లేళ్ళు, కోకిలలు, నెచ్చె
లులు. తన సౌకుమార్యమును గమనింపక తండ్రి యాజ్ఞ నప్రధాన మొనర్చి తనకు
వానియందుఁ గల సోదరస్నేహముచేతనే చెట్లకుఁ దాను నీళ్ళు పోయుచున్నది.
నూత్నయౌవనమునఁ గల శృంగారభావములను గృహములయందున్న బాలికలు
బొమ్మల పెండ్లిండ్లఁ దీర్చికొందురు. ఆశ్రమకన్యలు మామిడి మొక్కలకు మల్లెతీగ
లకు మనువులు కుదిర్చి వేడుక చేసికొనుచున్నారు.

"తొలుతఁ మీరు గ్రహింప కెవ్వరిత" అను పద్యమున శకుంతల కీయాశ్రమ
లతలపైనున్న సజీవస్నేహమును గాశ్యపుడు వెల్లడించెను. వనంబున నున్న
బంధు వృక్షంబులు కోకిలారావంబున శకుంతల యత్తింటికిఁ బోవుట కనుజ్ఞ యిడు
చున్నవనుట దాపసుల బాంధవ్యము, స్థావర జంగమములయందుఁ బశుపక్షిలతల
యందును, మానవుల యందును, సమంబని నిరూపించుచున్నది. ఇది కవి యతిశయోక్తి
మాత్రంబు కాదు. సాత్వికుల యౌదార్యం బిట్టిదియ. "ఉదారచరితానాంతు వసు
ధైవ కుటుంబకమ్" అను న్యాయమును మహాకవి శాకుంతలమునఁ జక్కఁగ మనోహర
ముగ జిత్రించినాఁడు.

శకుంతల సఖులను గౌగిలించుకొన్నది, వారు నొసంగబడ వలసిన వారలే"
యను తండ్రిమాటకుఁ గట్టుపడినదే కాని లేకున్న వారిని శకుంతల తనతో దోడుకొని
పోవ నుత్సహించియే యున్నది. తండ్రిగారైన కాశ్యపులు తపస్సుచే మున్నె కృశిం
చినవారు తనకై చింత నొందుట కా సాధ్వీమణి యోర్వజాలదాయె.

శకుంతల భావ మతి గంభీరము. అనురూపమయిన సఖీజను లామె పెదవి కదల్పక యుండ మహారాజుతోఁ దామే కార్యానుకూలసంభాషణము నడిపి, సాత్త్విక భావములను బట్టి శకుంతల శృంగారభావమును తెలిసికొనెను దుష్యంతుఁడు, కనుగొనిరే కాని యామె పలుకులలోఁ దన భావమును దేటపఱచలేదు.

"తద్వినయవారితుం డగు దర్పకుండు,
బయలుపడలేదు డాగినవాఁడు కాఁడు"

నాయికా నాయకుల మనోభావముల గుఱించి నాయకుని ప్రేమమును స్థిర పఱచుటకై "మా చెలి ప్రాణముల నిలువఁబెట్ట నర్హుండ"వని చెలికత్తె చెప్పఁగా శకుంతల "సఖీ! అంతఃపురజనవిరహముచే వేగుచున్న యీరాజర్షి నేల ప్రతిబంధించెదవు?" అని వారించినది. ఈ వాక్యమందలి గాంభీర్యము వర్ణనాతీతము, ఆ యౌచితి సందర్భశుద్ధి కాళిదాసునిదో శకుంతలదో! కవియైన పాఠకులు ధన్యులు, శకుంతలయైన దుష్యంతుఁడు ధన్యుఁడు.

తిరస్కృతయై సభలోఁ దనగౌరవము నిల్పఁబెట్టుకొనవలసిన పట్టున శకుంతల యిట్లులనియె. "పూరువంశమందలి నమ్మకమున...... నీరాజుచేతఁ బడి యిప్పుడు స్వచ్ఛందచారిణిగాఁ జేయబడితిని" అని మోమున వస్త్రము గప్పికొని రోదన మొనర్చినది.

మారీచాశ్రమమందు విరహావస్థ ననుభవించు తఱి "చేలయుగ్మంబు మిగుల మాసినదికట్టి" యేక వేణి దాల్చి దైవానుకూల్యంబునకై నిరీక్షించు శకుంతల యచటికి వచ్చిన దుష్యంతునిఁ జూచి బాలకుఁడు, "అమ్మా! ఈతఁ డెవఁడని" యడుగఁగా రాజు తన్నెట్లు చూచునో యను శంకతో

"బిడ్డా! నీయదృష్టము నడుగు"మన్నది. కృతాపరాధుఁడైన మహారాజు తనకుఁ బాదములకు నమస్కరింపఁగా 'ఆ దినములందు నాపుణ్యమునకుఁ బ్రతిబంధక మగు నాపురాకృతకర్మము పంటకు వచ్చియుండును. కాకున్న దయాళుఁడయ్యు నార్యపుత్రుఁడు నాయెడల నట్లేల విరసముగఁ బ్రవర్తించును" అని ఖిన్నుఁడైన రాజు నూరడించెను.

నాయక గుణములవలెనే నాయికాగుణములు తెలుపవలసినకొలఁది తేలుచునే యుండును. ఇతిదిక్కుగాఁ జూపినవానితో సహృదయులు పాత్రల శీలమును సమగ్రముగా విచారించి యానందింతురుగాక.

## నాటకలక్షణములు - ఆంధ్రశాకుంతలమునుండి లక్ష్యములు

నాటకము : కవిత్వము సంస్కృత భాషయందు అత్యున్నతదశఁ జెందినది: అందు కావ్యములు ప్రధానముగ దృశ్యము అని, శ్రవ్యములని రెండు విధములు. దృశ్య మనగా ప్రదర్శనయోగ్యమయినది. కంటితో, చూచుటకుగూడ నర్హమైనది, శ్రవ్యము

వినుటకు మాత్రము, లేదా చదువుటకు మాత్రము వీలైనది. నాటకము లన్నియు దృశ్యకావ్యములు. దృశ్యకావ్యము లన్నింటికి సంస్కృతమున "రూపక"మని సాధారణనామము. ఈ రూపకము లన్నియు, రసము ప్రధానముగా గలవి. ఇవి పది తెరగులు. 1 నాటకము. 2. ప్రకరణము, 3 భాణము, 4. ప్రహసనము, 5. డిమము, 6. వ్యాయోగము, 7. సమవాకారము, 8.వీథి, 9.అంకము, 10.ఈహామృగము. ఇవి గాక "ఉపరూపకములు" అను పేర బరగు దృశ్యకావ్యములు పదునెనిమిది తెరగులు గలవు. వానిలో ముఖ్యమైనవి నాటిక, త్రోటకము, సట్టకము అను పేరులు గలవి. నాటికలందు పేరెన్నిక గన్నది రత్నావళి, త్రోటకములందు విక్రమోర్వశీయము, సట్టకములందు కర్పూరమంజరి. వీనికిని నాటకమునకు, ప్రధానలక్షణములందు భేద మేమియు లేదు.

ప్రతి నాటకమునందును ముఖ్యమైన విషయములు మూడు. 1 వస్తువు అనగా నాటకముయొక్క కథ, 2. నేత, కథానాయకుడు, 3. రసము. ఈ మూడును ప్రతి నాటకమునకు ప్రాణప్రాయమైనవి. వీనినిగురించి యించుకంత విపులముగ విమర్శింతము.

వస్తువు : వస్తువు రెండు విధములు, 1. ఆధికారికము అనఁగాఁ బ్రధానము 2. ప్రాసంగికము. ఆధికారిక వస్తువు నాటకమునందలి ప్రధానపాత్రము లందఱికిని సంబంధించినదై ప్రారంభమునుండి చివరవరకు వ్యాపించియుండునది. ప్రాసంగిక వస్తువు కథానాయకునకు, నాయికకు సంబంధించినదై ప్రధానవస్తువును పోషించునదై యుండును. ప్రాసంగిక వస్తువు తిరిగి రెండు విధములు. 1. పతాకము, 2. ప్రకరి. రామాయణమున సీతారాముల కథ ఆధికారిక వస్తువు. సుగ్రీవుని కథ, విభీషణుని కథ ప్రాసంగికము. పతాక మనఁగా జెండా. జెండావలె రాఁబోవు కథను సూచించునది పతాకస్థానమని చెప్పఁబడును. పతాకవస్తువు ప్రధానకథకు పోషకముగాగాని, ప్రతిబంధకముగా గాని యుండి యొక్కొకతఱి నాటకము తుదివరకును వ్యాపించియుండును. రామాయణ కథలో సుగ్రీవాదుల వృత్తాంతము చాలవరకు వ్యాపించియుండును. ప్రకరి యప్రధానమైనకథ. దీనితో నాయికా నాయకులకు ఎట్టి సంబంధముండదు. నాటకమందు చాల కొద్ది భాగము మాత్ర మిది వ్యాపించియుండును.

నాటక వస్తువు తిరిగి 3 విధములుగా విభాగింపఁబడినది. 1. ప్రఖ్యాతము, 2. ఉత్పాద్యము, 3. మిశ్రము. భారత రామాయణాది ప్రసిద్ధకథలు ప్రఖ్యాతములు. స్వకపోల కల్పిత కథ ఉత్పాద్యము. ఈ రెంటితో గూడినది మిశ్రము. నాటకములు ప్రఖ్యాత కథలు. ప్రకరణములు కల్పిత కథలు.

నాటకకథను విస్తరించునవి మూడు. 1. బీజము. 2. బిందువు. 3. కార్యము. బీజము బీజమువంటిది. తొలుతఁ జిన్నదయ్యుఁ గ్రమముగ ననేక ప్రకారంబుల విత్తువలె విస్తరించి కార్యసాధకం బగునట్టి హేతువిశేషము బీజము. బిందువనగా ఒక కథాంశము సమాప్తము గానుండగా కథవిడచిపోకుండునట్లు అనంతరకార్యము సంఘ-

టింపఁ గారణమగునది. కార్యము నాటకముయొక్క యాశయము. ఏది నెరవేరిన నాటకముయొక్క కథ పరిసమాప్త మగునో అది. 1 పతాకము, 2 ప్రకరి, 3 బీజము, 4 బిందువు, 5 కార్యము. ఈ అయిదింటికి అర్థప్రకృతులని పేరు. ఈ యైదును నాటక ప్రయోజనసిద్ధిహేతువులు. వీటి మేళవింపు ప్రధానకథలో ప్రయోగింపవలసి యున్నది.

నాటక కథ కైదవస్థలు : 1 ఆరంభము. 2 యత్నము. 3 ప్రాప్త్యాశ. 4 నియతాప్తి. 5 ఫలాగమము. 1 ఆరంభము : ఔత్సుక్యమాత్రము అనగా నేను సంపాదించెదనని పూనుకొనుట యారంభము. 2 యత్నము. అనగా ఫలము సంభవింపనపుడు చేయు తీవ్రమగు నుపాయయోజనాదికము. 3 ప్రాప్త్యాశ యనఁగా ఉపాయము నపాయము కలుగునేమో యని నిశ్చయము లేకుండుట. 4 నియతాప్తి. అపాయము, ఫలలాభము తప్పక కలుగునని నిశ్చయించుకొనుట. 5 సమగ్రఫలసంపత్తి ఫలాగమము.

ఈ యైదవస్థల నొకదానితో నొకటి గూర్చునవి సంధులనఁబడును. పైనఁ జెప్పిన యర్థప్రకృతులవలెనే యీ సంధులు ఐదు తెఱఁగులు. 1 ముఖసంధి, 2 ప్రతిముఖసంధి, 3 గర్భసంధి, 4 అవమర్శసంధి, 5 నిర్వహణసంధి. ఈ చివరదానిని ఉపసంహృతి లేక ఉపసంహార మనికూడ చెప్పుదురు. ఇక ప్రయోజనముతో కూడి కథాంశములకు వేరొక ప్రయోజనముతోడి సంబంధము సంధి యనఁబడును.

ముఖసంధి : యనగా బీజారంభ సమన్వయము. అనగా అర్థప్రకృతి యగు బీజమును అవస్థయగు నారంభంబును గలిగియుండుటయే ముఖసంధి. ఇది బహువిధ ప్రయోజనంబగు రసమునకు హేతువగును.

ప్రతిముఖసంధి : బిందు ప్రయత్న సమాగమము. ప్రతిముఖ సంధియందు బీజ మంకురించి, కోరిన ప్రయోజనమునకు యత్నము ప్రారంభమగును.

గర్భసంధి : యందు కోరిన ఫలము గలుగుటయో కలుగకుండుటయో అనగా బీజమునకు మొదల నంతరాయము పిదప లాభము, మరల నపాయము, తిరిగి యుపాయము నను కారణములచే నిశ్చయింపఁబడని ఫలప్రాప్తి కలదియై గర్భసంధి యేర్పడుచున్నది. ఈ గర్భసంధియందు అంతరాయము లున్నను ప్రధానకథకు బలము కలుగుచుండును.

అవమర్శ సంధి : దీనియందు కథాబీజము బాగుగ నభివృద్ధిచెందియు ఏదైన యంతరాయమువలన ఫల మాలస్యమగును. ఈయాలస్యమునకు క్రోధముగాని, వ్యసనముగాని, విలోభముగాని కారణము కావచ్చును. ఈ అవమర్శసంధియందు నియతప్రాప్తి, పర్యాలోచనయుండును. ఎట్లన శకుంతలనాటకమున దుర్వాసశ్శాపము వలన రాజు శకుంతలను మఱచిపోవుట, అందుచే ఫలప్రాప్తి ఆలస్య మగుట– అవమర్శసంధి.

నిర్వహణము : అర్థప్రకృతులలో చెప్పఁబడిన కార్యము ఫలయోగావస్థతోఁ గూడుట నిర్వహణసంధి. ఎట్లనఁగా వేణీసంహారములో "మహారాజా! వృద్ధి నొందుచుంటివి. భీమసేనుఁడు దుశ్శాసనుని నెత్తురు శరీర మెల్లెడలఁ బూసికొని వచ్చు

చుండెను" అని కంచుకి చెప్పుటచే, ద్రౌపదీ కేశసంయమనము మొదలగు ముఖసంధ్యా దుల కొక్కచో ప్రయోజనము నిర్వహింపఁబడినది.

ఈ ముఖసంధి మొదలగు నైదుసంధులకు సంధ్యంగములు గలవు. ఈ సంధ్యంగము లన్నియు మొత్త మరువది నాలుగు. 1 చెప్పఁదలచిన దానిని చెప్పుట. 2 ప్రకటింపఁదలఁచిన దానిని ప్రకటించుట. 3 దాచఁదగిన దానిని దాచుట 4 సంతోషానురాగములను గలిగించుట. 5 కథాచమత్కారమును గలిగించుట. 6 ఇతివృత్తమును విస్తరింపఁజేయుట అను నీయారును పైన జెప్పిన 64 సంధ్యంగములకు ప్రయోజనములు.

నాటకకథ 1 సూచ్యమనియు, 2 దృశ్యశ్రవ్యమనియు రెండు విధములు. సూచ్యము 5 రీతులచే నెరవేర్పఁబడును. 1 విష్కంభము. 2 చూళిక 3 అంకాస్యము 4 అంకావతారము 5 ప్రవేశకము.

**విష్కంభము :** "వృత్త వర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః, సంక్షేపార్థస్తు విష్కంభః" సంక్షేపార్థము విష్కంభము. ప్రదర్శించుటకు యోగ్యముకాని కథాంశముకాని, మిక్కిలి రసవంతము కానట్టిగాని, గడచినదియు రాఁబోవునదియు నగు కథాంశమును తెల్పునదియై మధ్యమ పాత్రప్రయుక్తంబై యర్థసంగ్రహం బగునది విష్కంభము. శుద్ధవిష్కంభము సంకీర్ణవిష్కంభము నని విష్కంభము రెండు విధములు. ఒకనిచే గాని యిద్దరిచే గాని మధ్యమ పాత్రములచే నాచరింపఁబడునది శుద్ధమనియు, మధ్యమాధమపాత్రములచే ఒక్కమారుగాఁ దెల్పఁబడునది సంకీర్ణమనియుఁ జెప్పబడును.

చూళిక : నేపథ్యపాత్రసూచితము చూళిక. తెరలో నున్న పాత్రములచే సూచింపబడిన యర్థము చూళిక యనఁబడును.

**అంకాస్యము :** అంకాంతపాత్రమగు నుత్తరాంకసూచక మంకాస్యము.. ఏదైన నొకయంకంబు తుద నొక పాత్రము ప్రవేశించి, యాయంకములోని కథ సమాప్తము కానుండగాఁ దరువాతి యంకముయొక్క కథాముఖంబును సూచించుట యంకాస్య మనఁబడును.

అంకావతారము : అంకాస్యమునకును అంకావతారమునకును వాస్తవముగా భేదము లేదని కొందఱ యభిప్రాయము. శకుంతల 5 వ అంకము చివర ఉంగరము పోవుట సూచింపఁబడి, 6 వ అంకము అది దొరకిన కథతో ప్రారంభమగుచున్నది. ఇది అంకావతారము. ప్రవేశవిష్కంభాదులతోఁబని లేకయే యొక యంకంబు తుది ప్రవేశించిన యొక పాత్రచే పూర్వాంక కథతో విడిపోకుండ ఉత్తరాంకకథ సూచింపఁబడుట అంకావతార మనఁబడును.

**ప్రవేశకము:** విష్కంభమువలెనే అగతానాగత కథాంశముల జ్ఞాపకంబై యొకనిచేఁగాని యిద్దరిచేఁగాని నీచపాత్రలచేఁ బ్రయోగింపబడునది ప్రవేశక మన

బడును. ఇది ప్రథమాంకమున నుండగూడదు. ప్రవేశకమునందు భాష ప్రాకృతము
కాని సౌరసేని కాని యుండును. శుద్ధవిష్కంభమందు సంస్కృతము.

పూర్వోక్త విధముగా విష్కంభాదులచే సూచింపఁదగినది సూచ్యము. మిగిలి
నది అనగా అంకములచేఁ బ్రదర్శింపదగినది దృశ్యము. నాట్యధర్మము నపేక్షించిన
కథాంశము మూడు విధములు. 1. శ్రావ్యము, 2. అశ్రావ్యము, 3. నియతశ్రావ్యము.
శ్రావ్యము ప్రకాశము, ఎల్లరు వినఁదగినది. అశ్రావ్యము స్వగతము, ఎవ్వరును వినఁదగనిది.
నియతశ్రావ్యము రెండు విధములు. 1. జనాంతికము, 2. అపవారితము. బొటన
వ్రేలు వంచి చూపుడువ్రేలు మొదట గూర్చి యుంగరపువ్రేలు వంచి కడమవ్రేళ్ళను
జాచిపట్టిన యభినయహస్తము త్రిపతాకహస్తమనబడును. ఈ త్రిపతాక హస్తముచే
నొకని మరుగుపరచి యితరునితో మాటలాడుట జనాంతిక మనఁబడును. అనఁగా
నెవఁడు వినదగఁడో వానివైపు త్రిపతాకహస్తము పెట్టి మరొకనితో మాటలాడుట
యని భావము.

అపవారితము : అన్యుల కడ్డముగా తిరిగి యొక్కనితో రహస్య మాలో
చించుట అపవారితము.

ఆకాశభాషితము : ఆకాశమువంక చెవిపెట్టి యెవ్వరును చెప్పనిదానిని
విన్న ట్లభినయించి చెప్పుట ఆకాశభాషితము.

## ప్రస్తావన

ప్రతినాటకమును ప్రస్తావనతో ప్రారంభమగును. ప్రస్తావనయందు సూత్ర
ధారుడు నాంది పఠించును. సూత్ర మనగా సబీజంబగు నాట్యానుష్ఠానము. దానిని
ప్రవర్తింపఁజేయువాఁడు సూత్రధారుఁడు. పూర్వరంగ మనఁగా నాట్యశాల. దాని
యందు నిర్విఘ్నముగా నాట్యప్రదర్శనము జరుగుటకై నాటకాదియందుఁ జేయఁదగిన
కృత్యవిశేషము పూర్వరంగ మనఁబడును. నాటకమున పూర్వరంగమున కిరువదిరెం
డంగములు గలవు. వీనిలో ముఖ్యముగా విఘ్నశాంతికై చేయఁదగినది నాంది యనఁ
బడును. ఇది యెనిమిదిగాని, పండ్రెండుగాని, పదునెనిమిదిగాని యిరువది రెండుగాని
పదంబులతోఁగూడి యర్థముచేఁగాని శబ్దముచేఁగాని కొంచెముగా కావ్యార్థమును
సూచించునదిగా నుండవలెను. ఇట్టి నాందీరూపమగు పూర్వరంగము నాచరించి
సూత్రధారుఁడు వెడలినపిదప ఆకారగుణంబుల వానినిఁ బోలిన యింకొక నటుఁ
డానామముతోనే రంగభూమి ప్రవేశించి కావ్యార్థసూచనము చేయవలెను.
దీనింబట్టి సూత్రధారు లిద్దరనియు నందొకఁడు పూర్వరంగప్రవర్తకుఁ డనియు,
నటుఁడు లేక స్థాపకుఁడు అను పేరు గలిగి రెండవ సూత్రధారుడు ప్రస్తావనా
ప్రవర్తకుఁ డనియు, నెరుంగునది అని దశరూపకమునఁ జెప్పఁబడినది. సూత్రధారుఁడు
బ్రాహ్మణుఁడే యైనచో నిద్దరు సూత్రధారులు రావలసిన యవసరము లేదనియు,
బ్రాహ్మణుఁడు కానిచో ఆశీర్వచనరూపమగు నాందిని బ్రాహ్మణుఁడు పఠించిపోఁగా

బ్రాహ్మణేతరసూత్రధారుఁడు తరువాత ప్రవేశించి మిగతా ప్రస్తావన నడుపుననియు కొందరి మతముగాఁ గనిపించుచున్నది. ఇద్దరు సూత్రధారు లున్నపు డొకఁడు పూర్వ రంగమను పేర బరగు నాందీప్రవర్తకుఁడు. రెండవవాఁడు ప్రస్తావనాప్రవర్తకుఁడు. ఇతఁడు కావ్యార్థసూచకము లగు చక్కని పద్యములచే రంగభూమిని రంజింపఁజేసిన పిదప వస్తువు మున్నగువానిని సూచింపవలెను.

ప్రరోచనమనఁగా ప్రస్తుతార్థ ప్రశంసచే నాసక్తి గలిగించి చూపర నభిముఖులనుగా నొనరించు ప్రరోచనమందు గవియొక్కయు పరిషత్తుయొక్కయు స్తోత్రము చేయఁబడును. శకుంతలయందు "దేవీ! ఈసభ పండితులతో నిండియున్నది. తొల్లి దేవభాషయందు కాళిదాస మహాకవిచే రచియింపఁబడి నూతనముగ విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబచే నాంధ్రీకరింపఁబడిన "యభిజ్ఞాన శాకుంతలం" బను నాటకమును బ్రదర్శించి మన మిపుడు వీరిని సంతోషపెట్టఁదగును." అనుట ప్రరోచనము.

ప్రస్తావనాంగములు : 1 కథోద్ఘాతము 2 ప్రవృత్తకము 3 ప్రయోగాతిశయము. ఇందేదైన నొకటి యుండఁదగును. సూత్రధారుని పలుకులందుఁ జూపఁబడెడు నాటకకథకు బోలినవాక్యమునుగాని, దానియర్థమునుగాని గైకొని పాత్ర మరుదెంచుట కథోద్ఘాతమగును. వేణీసంహారములో "కురురాజ సుతులు స్వస్థు లగుదురు గాక" అను సూత్రధారవాక్యార్థమును గ్రహించి భీముఁడు ప్రవేశించుట ఇందులకుదాహరణము.

ప్రవృత్తకము : సూత్రధారుఁ డొనరించు ఋతువర్ణనముచే సూచింపఁబడిన వాపుపాత్ర ప్రవేశము ప్రవృత్తక మనబడును. ఇందులకు రామచరితములో "నిర్మలమైన చంద్రహాసమును బొంది యుగ్రమైన గాఢతమస్సుగల దశాస్యుని రాముఁడు నశింపఁజేసినట్లు వర్షా కాలము నణంచి బిందుజీవమును బోషించు శరత్సమయము వచ్చినది" అను శరత్కాలవర్ణనముచే సూచింపఁబడిన రామపాత్ర ప్రవేశము ప్రవృత్తకమునకుదాహరణము.

ప్రయోగాతిశయము : "ఈ," "ఇది," "ఇతఁడు" అని సూత్రధారునిచే నిర్దేశింపఁబడిన పాత్రప్రవేశము ప్రయోగాతిశయము. "ఈ భూపాలుఁడు దుష్యంతుఁడు కడు, వైశమ చను లేడిచేతవలెనే లలనా!" అనువాక్యమున శకుంతల నాటకమున దుష్యంతపాత్రప్రవేశ ముదాహరణము.

ప్రస్తావన ముగిసిన పిమ్మట నాటకము ప్రదర్శించుట ప్రారంభింపవలెను. నాటక వస్తువును అంకములు రంగములుగా విభాగము చేయవలయును. నాటకమునందు 5 మొదలు 10 అంకములవరకు నుండవచ్చును. నాయకుడు ధీరోదాత్తుఁడై యుండవలయును. ప్రధానరసము శృంగారముగాని, వీరముగాని, కరుణగాని అయి యుండవలెను. తక్కిన రసములు ప్రధానరసమున కంగములై యుండును. ప్రధాన రసమును భంగము చేయునది గాని, నాయకుని కుచితము కానిదిగాని యెద్దియు నాటక

మునఁ బ్రవేశింపఁ జేయఁగూడదు. అవసరమునుబట్టి విష్కంభముతో ప్రారంభింపవచ్చును. అంకముచివర పాత్ర లందరు నిష్క్రమింతురు. ప్రయాణము, వధ, యుద్ధము, రంగము మీద ప్రదర్శింపఁగూడదు. ఈ నియమమువల్లనే సంస్కృతమున విషాదాంత నాటకములు లేవు. నాటకము ఆశీర్వచనముతో ప్రారంభించినట్లుగానే ఆశీర్వచనముతో ముగింపవలయును. నాటకము చివర ఆశీర్వచనమును భరతవాక్య మందురు. భరతవాక్యమును ప్రధానపాత్ర చదువును. ఇందు లోకకల్యాణము కలుగుటకై వాని యాశయము వెలిబుచ్చును.

కథానాయకుఁడు, తక్కిన యుత్తమపాత్రలు సంస్కృతముతో మాట్లాడుదురు. స్త్రీలు, ఇతర చిల్లరపాత్రలు ప్రాకృతము మున్నగు భాషలలో మాటలాడుట సంస్కృత నాటకములందలి మర్యాద. నాటకమునకు పైన వివరించిన లక్షణములే తక్కిన రూపకములకును వర్తించును. తక్కిన రూపకములలో ప్రకరణము, త్రోటకము ముఖ్యములు. ప్రకరణములోని కథ కల్పితము. వాస్తవమగు సాంఘిక జీవనమునకు సంబంధించినదై యుండవలయును. కథానాయకుఁడు గౌరవమైన కుటుంబమునకుఁ జెందినవాఁడై యుండవలయును. నాయకుఁడు ధీరప్రశాంతుఁడుగా నుండవలెను. మంత్రిగాని, బ్రాహ్మణుఁడుగాని, వైశ్యుఁడుగాని నాయకులుగా నుండఁదగుదురు. కథానాయికగా నుత్తమవంశమందుఁ బుట్టిన కన్యగాని, వేశ్యగాని యుండవచ్చును. ప్రధాన రసము శృంగారముగా నుండవలెను. జూదగాండ్రు మొదలగు నీచపాత్ర లుండవలెను. పదియంకము లుండవలెను. ప్రకరణములకు ప్రసిద్ధమగు నుదాహరణములు మృచ్ఛకటికము, మాలతీమాధవము.

త్రోటకమందు 5, 7, 8, 9 అంకము లుండవచ్చును. అందులోని పాత్రలు ప్రతియంకమునందు వత్తురు. ప్రధానరసము శృంగారము. తక్కిన లక్షణములు నాటకమున కున్నవే.

## అభిజ్ఞానశాకుంతలరచన.

శాకుంతలము దశవిధ రూపకములలోను, నాటకమను పేరఁ బరగునది. నాటకవస్తువునందలి ప్రధానాంశములు పురాణగాథనుండి తీసికొనఁబడినవి. ఈయొక్క నాటకమందే కాళిదాసుని నిరుపమాన ప్రతిభ కవితానైపుణ్యము చూపఁబడినది. నాటకకర్తగాను, కవిగాను, కాళిదాసునకుఁ గల యౌన్నత్యము చూడవలెనన్న శాకుంతలము చూచినఁ జాలును. ఇతర నాటకములు కావ్యములు చూడ నవసరములేదు. శాకుంతలమునందు కాళిదాసుని శైలియందుగల అందము లెల్లను గానందగును. క్లిష్టాన్వయములుగాని వెట్టి అతిశయోక్తులుగాని కానరావు. కాళిదాసుని ఉపమలు నిరుపమానములు. శాకుంతలమును ప్రథమమున సర్ విలియం జోన్సు అను నాయన ఆంగ్లభాషలోనికి పరివర్తనముచేసి ఐరోపాఖండవాసులకు పరిచయము కలుగఁజేసెను. అటుపిమ్మట ఐరోపాఖండభాష లన్నిటిలోనికి భాషాంతరీకరణ మొనర్పఁబడినది.

కాళిదాసుని నాటకములు మూడు. 1 విక్రమోర్వశీయము, 2 మాళవికాగ్ని మిత్రము. 3 శాకుంతలము. నాటక రచనయందు శాకుంతలమునకుఁ దక్కిన రెంటితో పోలిక లున్నను, చాల విషయములందు శాకుంతలము తక్కిన రెంటికన్న వైశేష్యము గలిగియున్నది. ప్రాచీన కాలమునందలి సాంఘికజీవన మీనాటకమున యథాస్థితిలో వర్ణింపఁబడినది. సవతుల కయ్యములు, నాయికా నాయకుల సమావేశముల కంత రాయము కల్గుచుండుట మున్నగు విషయములు, కథ రక్తికట్టుటకు ఇతర శృంగార నాటకములందుఁ గానఁబడును. ఇం దట్టి వేమియును లేవు. మరియు నీనాటకమున విదూషకునకు ప్రాముఖ్యము లేదు.

శకుంతల నాటకమునందు నాటకలక్షణము లంత సూక్ష్మముగా పాటింపఁబడ లేదు. భరతుఁడు మున్నగు ప్రాచీన లాక్షణికులచే సూచింపఁబడిన ప్రధానలక్షణములు మాత్రము పాటింపఁబడినవి. తరువాత కాలమున విస్తారముగా, అతిసూక్ష్మముగా నిర్వచింపఁబడిన నాటకలక్షణములు, కాళిదాసుని కాలమునాటికి లేక పోవచ్చును. రత్నావళి, వేణీసంహారనాటకములందు చూపఁబడు నాటకసూక్ష్మాంగములు శాకుం తలమందుఁ గానరావు.

తక్కిన యన్ని నాటకములందువలెనే మొదట "నాంది" చివర "భరత వాక్యము"ను ఇందుగలవు. ప్రస్తావన ముగియగానే ధీరోదాత్తనాయకుఁడైన దుష్యం తుఁడు నాటకారంభ మొనర్చును. "ముఖసంధి" ఇచ్చట ప్రారంభమై ద్వితీయాంక మున రాజు వేటకుఁ బోవుప్రయత్నమును మానుకొని విదూషకునితోఁగూడ శకుంతలను గూర్చి మాటలాడుటకు "ఇట్లిద్దరు బోయి కూర్చుండుముఱు" (పుట 22) అనుచోట పూర్తియైనది. ఈ ముఖసంధియందు నాయికా నాయకులకు సమావేశమై యన్యోన్య గాఢానురాగోత్పత్తి కలుగును. వివాహపూర్వకముగా వారి కలయిక నాటకమునకుఁ బరమోద్దేశము. దానిని నిర్వహించుటకే నాటక మంతయు నడుపబడినది.

...... ............ఏవం విధగుణ సం
పదగల్గిన సుతునిఁ జక్రవర్తినిఁ గనుమా. (పుట 5)

అని వైఖానసుఁ డాశీర్వదించినపుడు బీజము వేయుటకు క్షేత్రము సిద్ధము చేయఁ బడినది. అటుపిమ్మట నా వైఖానసుఁడే "కూతురగు శకుంతల నాశ్రమమున నతిథి సత్కారమునకై నియమించి యామెయొక్క ప్రతికూల దైవము నుపశమింపఁ జేయు టకు వా రిప్పుడే సోమతీర్థమున కేగిరి" (పు. 5) అన్నప్పుడు బీజము నాటఁబడినది.

ప్రతిముఖసంధి : ముఖసంధి ముగియగానే రాజు "మాఢవ్యా! నేత్ర సాఫల్యముఁ గాంచకపోతివి. ఏలయనఁ జూడఁదగినదానినిఁ జూడకపోతివి" (పు.22) అని చెప్పుటతో ప్రారంభమగును. ఈ ప్రతిముఖసంధి మూడవ యంకముతో ముగి యును. ఇందులో బిందువు కాననగును. వేటకుఁ బోవలయునను నాలోచనము, యజ్ఞ సంరక్షణమునకై యరణ్యమున నుండవలయునా లేక తల్లిగారి యాహ్వానము ప్రకారము రాజధాని కేగవలయునా యను సంశయము చేతను కొన్ని యంతరాయ

ములు కల్గియు నాటక మప్రతిహతముగా నడచును. ప్రతిముఖసంధికి దశ రూపకమున నిట్లు లక్షణము చెప్పఁబడినది. "బీజ ప్రకాశనం యత్ర దృశ్యాదృశ్యతయా భవేత్". బిందు లక్షణమును భరతుఁ డిట్లు చెప్పినాఁడు. "ప్రయోజనానాం విచ్ఛేదే యదవిచ్ఛేదకారణం, యావత్సమాప్తిం బంధస్య స బిందు రితి సంజ్ఞితః" ఇచట బిందుక్షేప మెట్లు చేయఁబడినదనిన, వేటవృత్తాంతముచేత విచ్ఛేదము కలుగఁగా "మాధవ్యా! నేత్రసాఫల్యము గాంచకపోతివి"........."నేను మాత్ర మాశ్రమమున కంతయు నలంకారమైన శకుంతలను గూర్చి చెప్పుచున్నాను" మొదలగు వాక్యములు బిందువులు. ఇచటనే "యత్న" మను నవస్థగూడ కలదు. ఎట్లన "సఖుఁడా! కొందరు తపస్వులు నన్ను గుర్తించినారు. ఏ నెపముమీద నీ యాశ్రమమున మనము నిలువవచ్చునో నీవు కొంత యాలోచింపుము." (పు. 24) ఏ నెపముతో నాశ్రమమునందుండి శకుంతలయొక్క పరచయము గలిగించు కొనుటకు వీలగునా యని రాజు విదూషకునితో నాలోచించుట యత్నము.

గర్భసంధి : నాల్గవయంకము పూర్తిగాను, పంచమాంకమున గౌతమి, "బిడ్డా! ముహూర్తకాలము సిగ్గుపడకుము. నీ మేలిముసుగు నిపుడు తొలగించెదను. అపుడు నీ భర్త నిన్ను గుర్తించును" అని శకుంతలతోఁ బలికి ఆమె మేలిముసుగును తీయుటవఱకు గర్భసంధి. (గర్భసంధి లక్షణ మిదివఱకే తెలుపఁబడినది) దీనియందు దూర్వాస శాపమువలన శకుంతలా దుష్యంతులసంయోగమునకు భంగము కలిగియు,

మ॥ ఖ్యాతిన్ సత్కులసూతియౌ పతికి నిల్లాలై సదా సల్పుచో
నీటన్ తద్విధ పౌరకృత్యముల నెంతే నాకులీభూతవై
పూతున్ బుత్రునిఁ బ్రాచి యర్కునటులన్ ముద్దార వే గాంచి నీ
చేతంబందున నన్ను బాయువగపున్ జింతింపఁబో వమ్మరో. (పు. 54.)

అని కణ్వుఁడు చేసిన యాశీర్వచనమువలన తిరిగి ఇష్టప్రాప్తి కలుగునని ఆశ కలుగుచున్నది.

## అవమర్శసంధి

శకుంతల మేలిముసుగు తీసినది మొదలు నైదవ యంకమున మిగిలిన భాగమున్ను, ఆరవయంకము పూర్తిగానున్నూ, అవమర్శసంధి. "యత్ర ప్రలోభన క్రోధ వ్యసనాద్యై ర్విమృశ్యతే, బీజాదే ర్గర్భనిర్భిన్నః సోఽవమర్శ ఇతీరితే" ఇచట దూర్వాసశాపముచే మఱుపుతగిలిన దుష్యంతుఁ డిట్లు విమర్శించుచున్నాఁడు.

మ॥ అనవద్యద్యుతి నిట్లు తోఁచినది ఈ అబ్జాక్షిరూపంబు దీ
నిని నేఁ దొల్లి పరిగ్రహించుటది సందేహించుటన్ మంచు ప్రొ
ద్దులలో నంటుట మల్లెఁ దేటియటులే తోడ్తోడ భోగింపఁజా
లను వీడన్ మది నిశ్చయింపగను జాలన్ బాపురే! దైవమా! (పు. 64)

ఇట్లు ఫలప్రాప్తి కలుగకపోవునేమోయని నిరాశ కలుగుచుండగా ఇంద్రుని యాహ్వానము గొని మాతలి వచ్చుటవలన తిరిగి కార్యసిద్ధిని సూచించుచున్నది.

నిర్వహణసంధి : సప్తమాంకమంతయు నిర్వహణసంధి. ఇందు శకుంతల దుష్యంతుఁడు వారి కుమారుఁడు భరతుఁడు సమావేశ మగుదురు.

## నాంది

సకల కవికులతిలకుండు మహాకవి కాళిదాసుఁడు. ఇతడు శాకుంతల నాటకంబు రచించె. గ్రంథాదియందు నిర్విఘ్నపరిసమాప్తికొఱకు మంగళాచరణము సేయుట సంప్రదాయము. అందు నాటకమందు మంగళము నాందిరూపముగా నుండవలయు. ఆ నాంది ఆశీర్వాదము, నమస్కారము, వస్తునిర్దేశమని మూడు విధముల నుండు. అభిజ్ఞానశాకుంతలమందు దాశీరూప నాంది - ఈ నాటకమును కవితిలక - కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు తెనిగించుచు "యాసృష్టిః" అను శ్లోకమును "ఆదిమ సృష్టి స్రష్టకది" యను పద్యముగా రచించిరి.

1. ఆదిమసృష్టి స్రష్టకది:—తొలుత జలమును బుట్టించె నలువ యన్న శ్రుతిని బట్టి మొదటిసృష్టి జలము.

2. హవ్యము నెద్ది వహించు:—ఏ మూర్తి హోమముచేయబడిన పురోడాశాదికము వహించునో అనుటచే తేజోమయమయిన శరీరము చెప్పబడినది. "అమరవరులెల్ల రరయంగ నగ్నిముఖులు" అని వేదమం దున్నది.

3. హోత్రియనా నేది:—యాగము చేయు సోమయాజి స్వరూప మిందు వర్ణింపబడినది.

4. ఒనర్చుకాలమును నేకవ:—ఏ జంట అనగా సూర్యచంద్రులు కాలము నొనర్చునో అహోరాత్రులు ప్రతిపదాది తిథిరూప కాలవిభాగము సూర్యచంద్రగతులచే నెఱుంగదగుననుట.

5. విశ్వ.........లక్షణమునౌ నెది:—శ్రుతి=దీనిచేత వినబడును గాన నిది శ్రుతి యందురు. అనగా శ్రవణేంద్రియము - దానియొక్క యాదరణముకల అర్థము శబ్దము-అశబ్దము లక్షణము గుణముగాగలది ఆకాశము "ఆకసము శబ్దగుణక మౌనంద్రు బుధులు" అని కణాదమతము. పంచమహాభూతములకు గుణములు. ఆకాశమునకు శబ్దము, వాయువునకు స్పర్శము, అగ్నికి రూపము, జలమునకు రసము, పృథివికి గంధము గుణమని యెఱుంగునది.

6. భూతములెల్ల గల్గు నెందు- ఎందు భూతములు గల్గునో అనగా పృథివీ మూర్తిని చెప్పినట్లయినది. భూతములెల్ల-చరాచరరూపమయిన సర్వపదార్థములు పృథివి యందే కలుగుననుట.

7. ఏది సజీవు లట్టు లెనయించును ప్రాణుల - ప్రాణము కలిగిన యన్నిటికి జీవము పోయునదేదియో అనుటచే వాయురూపము చెప్పబడినది.

8. లోకానుగ్రహార్థ మందఱుఁ జూడదగినవి ప్రత్యక్షముగాఁ గానవచ్చు, సుమూర్తులను దాల్చునట్టి దొర (ఈశుఁడు) సమర్థుఁడు మిమ్ము ను సామాజికులను రక్షించుగాక.

కావ్యార్థసూచనము.

“నాందిఁ గావ్యార్థంబుల, గొందఱు సూచింతురు.”

నాందియందుఁ గొందఱు కావ్యార్థసూచనంబు నిరూపింతురని పెద్దలమాట.

ఇందు:

1. ఆదిమసృష్టి యనుటచే దుష్యంతుఁడు భరతవంశమునను మొదటివాఁడని సూచింపబడినది.

2. హవ్యము నెద్ది వహించు ననుటచే దుష్యంతుఁడు తపోవనములు రక్షించి వందులకు రాజులు తాపసుల తపస్సునం దారవభాగము గ్రహించువా రనుటచే దుష్యంతుని యందు రాజర్షిత్వము సూచింపఁబడినది.

3. హోత్రి - హోమముచే యజ్ఞములు మహాదానము లాతఁడు చేయుట సూచింపఁబడినది.

4. ఒనర్చు కాలమును నే కవ:—వర్షములచే సస్యమును గలిగించి ప్రజలను రక్షించునట్టి యోగ్యమగు కాలమునకు కర్త రాజగుటను సూచించును. “కాలము రాజునకు కారణమా, రాజే కాలమునకుఁ గారణమా” యని సందేహపడవలదు. “రాజే కాలమునకుఁ గారణము” అని భారతమందు ప్రతిపాదింపబడినది.

5. శ్రుత్యా... నెది:—వేద ప్రతిపాదితమైన లక్షణములు కలిగియుంటయు శాస్త్రీయమైన రాజత్వము సూచింపఁబడును. - విశ్వమదెల్ల నిండి యనుటచే సకలజన శ్రోత్రేంద్రియములకుఁ నమ్మహారాజు గుణగణములే విషయములగుట సూచించును.

6. భూతములెల్ల గల్గునెందు:—అందఱును వారివారి మార్గములయందు నిల్పుట చేత తండ్రివలె లోకమును గలిగించి పాలించువాఁడని సూచింపుచున్నది. “ప్రజలకు వినయము నేర్పి వారిని రక్షించి భరించుటచేత రాజే నిక్కముగా తండ్రి యగుచున్నాఁడు. తలిదండ్రులు కేవలము జన్మమునకు మాత్రము కారణ మగుచున్నారని రఘువంశమందుఁ జెప్పఁబడినది.

7. ఏది సజీవులు:—ఎల్లరు కోరిన విచ్చుటచేత వారి యుత్సాహమును ప్రాణమును నిలువబెట్టుట తోఁచుచున్నది.

8. ఆ సుమూర్తుల దాల్చు:—అనుటచే కంటికి ప్రత్యక్షముగా గానవచ్చు మూర్తులని యర్థము. “సుమూర్తిఁ దాల్చు” చక్రని యాకృతికల యంగుళీయమును జూచినంతనే శకుంతలాస్మరణమును సూచింపుచున్నది. ఈశశబ్దముచే సర్వైశ్వర్య సం

పన్నెండగు రాజు సూచింపఁబడుచున్నాడు. ఎనిమిదిమూర్తులనుటచే రాజు దిక్పాలకుల యంశముతోఁ బుట్టుట సూచింపఁబడును.

## శ కుం త లా ప క్ష ము

“సృష్టిస్స్రష్టు” యనుటచే సృష్టికిఁ బ్రతిసృష్టిచేయు విశ్వామిత్ర సంతానమనుటయు, ఆదిమ సృష్టి యనుటచే సకల కామినీజనము నందుకంటె నీమెయందు రూపలావణ్యాద్యతిశయము లుంటయు, “యువతిషు విషయే సృష్టిరాద్యేవధాతుః” సూచింపంబడు. “హావ్యము వహించు - హోత్రియనుటచే దుష్యంత నిహిత గర్భధారణమును సూచించు హవ్యము విధిగా హోమము జేయఁబడునదిగాన, గాంధర్వ వివాహము శాస్త్రీయమనియు సూచింపఁబడియె. హోత్రీ - యజ్ఞపత్నీత్వము సూచితము. “ఏకవ” యనుటచే ననసూయా ప్రియంవదలు సూచింపఁబడిరి.” వీ రుభయులవలన, దుష్యంత శకుంతలా సమావేశమునకుఁ గాలము నిర్ణయింపఁబడినదనుట.

## నాం ది

నాంది ద్వివిధము:—1 క్రియారూపము, 2 వాగ్రూపము. నంది యన మహేశ్వరుని సన్నిధియందుండు వృషభము- ఆ నాంది రంగరూపమును బొందును. పూర్వ రంగమునం దీ శివుఁ డెల్లప్పుడు సన్నిహితుండై యుండు. అందుచేఁ బూర్వ రంగము నుద్దేశించి పూజింతురు. ఈ పూజారూపమైనది క్రియారూప నాంది యనఁబడును.

ద్వితీయము:—మంగళమో, ఆశీర్వచనమో చేయు శ్లోకరూపమైనది. ఇది బహువిధంబులు. అష్టపద - ఎనిమిది పదములుఁగలది. ద్వాదశపద - పన్నెండు పదములుగలది. అష్టాదశపద - పదునెనిమిది పదములు గలది. ద్వావింశతిపద - ఇరువదిరెండు పదములు కలది. ఆకాంక్ష, యోగ్యత గల పదసముదాయమే వాక్యమను నిర్ణయమును బట్టి ఈనాంది పద్యమునం దెనిమిది వాక్యములు గలవు. ఆ కారణంబున నిది యష్టపద నాంది యనఁదగును. నాందీభేదంబులు దశరూపకాది గ్రంథంబులనుండి యెఱుంగనగు. దేనియందు కవులు, కావ్యములు నటులు పారిషదులు (సభ్యులు) నానందింతురో యద్దానిని నాందియందురు - ఈ నాందిపద్యమునందు సాభిప్రాయవిశేషణములు వాడుటంజేసి పరికరాలంకారంబు. కవియొక్క సర్వాత్మకమైన శివభక్తి వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. అందుచే నిది యుత్తమకావ్య మయ్యె. దైవగురునృపాచార్య విషయమైనది భక్తి. ప్రకృతపద్యమున దైవభక్తి ప్రకటితమయ్యె. కాంతావిషయ మగునది రతి యని చెప్పబడును. ఇందు బుద్ధికుశలత కొలది పరికించిన ననేకాలంకారములు గుణములు మొదలగునవి గానవచ్చును.

## ప్ర స్తా వ న

ప్రబంధార్థ మిందుఁబ్రస్తుతింపఁబడును గాన నిది ప్రస్తావన:—

సూత్రధారలక్షణము : కవియొక్క గుణములు కథావస్తుగుణములు చక్కగ గుర్తించి ప్రదర్శింపఁగలవాఁడు. రంగమును బాత్రల సిద్ధము చేయుటలోఁ బ్రౌఢుఁడు. సర్వప్రయోగకుశలుఁడు. మంచిరేఖ గలవాఁడు. విజితేంద్రియుఁడు, ప్రాజ్ఞుఁడు, తాలలయాభిజ్ఞుఁడు, మంచికులమువాఁడు. మాత్సర్యములేనివాఁడు. స్వయముగా నర్తకుఁడు, పాత్రనిర్ణయాదులయందు పాయముకలవాఁడు, నానాదేశనృత్తభేదము లెఱింగినవాఁడు.

అభినయము : నాటకము నాశ్రయించియున్న విభావానుభావాదులను జక్కగా వెలువరించుచు నిరంతరము సరసులయందు రసజ్ఞానమును బుట్టింపుచు నుండఁజాలిన నటునియందుగల జ్ఞానమే యభినయమనఁబడును. సూత్రధారులిద్దరు. నాంది పఠించు వాఁడొకఁడు, ప్రస్తావన నడుపువాఁడొకఁడు. తెరవంకఁ జూచి అనగా నాతెఱ మఱుగున నున్న నేపథ్యమువంకఁ జూచిఁ యని యర్థము. కుశీలవులు నటించు రంగస్థలము కంటె వ్యతిరిక్తమయినది. యవనిక (తెఱ) మఱుఁగుననున్నది. రంగులు పూసికొని వేసములు వేసికొను నటు లుండఁ దగినదానికి నేపథ్యమని పేరు.

రంగస్థలము : సభాపతి, సభ, సభ్యులు గాయకులు వాదకులు నటీనటులు నన్యోన్యానురంజనముచే నెందు మోదింతురో యది రంగమనఁబడును.

దేవీ : నటీ సూత్రధారు లార్యపదవాచ్యులు. అనగా పూజ్యమగు పదములతోఁ బిలువఁదగిన వారు గావున సంస్కృతమున ఆర్యే యన్న పదమునకు దేవీ యని యనువదింపఁబడినది.

అలంకరణమైనచో : గ్రీష్మకాలోచితమైన తెల్లచీరలు, తెల్లమల్లెపూవుల దండలు ముత్యాలు విశేషముగాఁ గూర్చఁబడిన యాభరణములు కాలోచితముగా, ధరించుటయైనచో నని యర్థము.

ఆర్యపుత్రా! ఇదె వచ్చితి : నీచపాత్రలకు సంస్కృతనాటకముల యందు ప్రాకృతము వాడుదురు. ప్రకృతి సంస్కృతము. ఆ ప్రకృతినుండి వచ్చినది గావున "ప్రాకృతము". ఆ ప్రాకృతము మూడువిధములు.

1 సహజము, 2 లక్షితము, 3 శ్లిష్టము,

సహజము ద్వివిధము, సంస్కృతసమము, దేశ్యము.

లక్షితము రెండు విధములు - మహారాష్ట్రము సౌరసేనియని.

శ్లిష్టము - పైశాచము - మాగధము అని రెండువిధములు.

అపభ్రంశంబును గొన్నియెడలఁ బ్రయోగింతురు - అది ఉత్తమము - మధ్యమము - కనిష్ఠ మని మూడువిధములు. ఇందు తేటతెనుంగుమాత్రము నీచపాత్రలకు వాడఁబడినది.

**ఈ సభ పండితులతో :** సభ యనగా పరిషత్తు - నాలుగు వేదముల ధర్మములు సమగ్రముగా నెఱిఁగినవారు సభ్యులని నిర్వచనము. సంగీత శాస్త్రకుశలులు, రసికులు, గుణగ్రహణ పారీణులు, నృత్యభేదము లెఱింగినవారు, మధ్యస్థులు, రాగద్వేషవినిర్ముక్తులు. ఇట్టి పండితులే మహాకవుల నాటకములు వినఁదగినవారు. శక్తియే మహాకవుల కవిత్వమునకుఁ గారణము. వృక్షమునకు బీజమట్లు కవిత్వమునకు శక్తి ప్రథమ కారణము.

కవియగువాఁడు మానవాది ధర్మశాస్త్రములు కౌటిలీయకాద్యర్థ శాస్త్రములు వాత్స్యాయనాది కామశాస్త్రములు, సాంఖ్యాదిమోక్ష శాస్త్రంబులు అభ్యసింపవలయును. భరత శాస్త్రము అశ్వగజాది శాస్త్రంబు, లితిహాస పురాణాదులు రాజవంశ చరిత్రంబులు నేర్వఁదగినవి.

**తొల్లి :** ఈ యభిజ్ఞాన శాకుంతల నాటకము తొల్లి దేవభాషయందు నిర్మింపఁబడినది. మూలమందు 'కాళిదాస గ్రథితవస్తునా నవేన నాటకేన' యని వ్రాయఁబడియున్నది. మహాకవియయ్యు వినయముగా బిరుదములు నుపపదంబులు లేక పేరు మాత్రము చెప్పుకొనుటచే కవి యుదాత్తుఁడు. కవిభేదములు. 1. ఉదాత్తుఁడు, 2. ఉద్ధతుఁడు, 3. ప్రౌఢుఁడు, 4. వినీతుడు. లోపల గూఢమైన యభిమానముకలవాఁడు "ఉదాత్తుఁడు". తన పేరే జగత్ప్రసిద్ధము, దాని కుపపదము లేలయని యాతని గూఢాభిమానము.

**కాళిదాస మహాకవిచే :** అనువాదకర్త్రి మహాకవియని విశేషణము మూలములో లేని యుపపదము చేర్చుట పూజార్థము. నిక్కముగా కాళిదాసుడు మహాకవి యగుట మహామహు లంగీకరించినారు.

**కాళిదాస మహాకవి గొప్పదనము :** మీమాంసాశాస్త్ర ప్రవర్తకులగు భట్టపాదు లిట్లు వర్ణించిరి. "కాళిదాసాదులు కవులు, మమబోట్లు కవులయినచోఁ బర్వతమునందుఁ బరమాణువునందు బదార్థత్వము ప్రతిష్ఠింప బడినట్లు కదా" అనగాఁ గాళిదాసునకు నితరకవులకుఁ బర్వతమునకుఁ బరమాణువునకుఁ గల భేదమున్నదనుట.

శ్రీమతి కవితిలక కవితావిశారద

కాంచనపల్లి కనకాంబగారి యనువాదమున

# వి శే ష ము లు

## శైలికి ధారాశుద్ధికి నుదాహరణంబులు



## అనువాదము సంగ్రహించుట కుదాహరణములు.



## శ్లేషలు మూలమునకు వన్నె తెచ్చినవి.



హరి=ఇంద్రుడు, సూర్యుఁడు, రాజు=దుష్యంతుడు చంద్రుడు.

శ్లోకచతుష్టయము.



ఇవి మూలముతో సరిచూచి చదువఁ దగినవి. అనితరసాధారణమైన విశేషము లిందుఁ గానవచ్చును.

అందు "మమ్మ తపోధనాఢ్యుల" యను పద్యమందు "దీని న్యాయమ్మ సపత్నులట్లగన" న్యాయమ్మ యనుట ప్రశ్నగా గ్రహింపదగును, అనగా నందఱకంటె నెక్కువ మక్కువగాఁ జూడఁదగు ననుట రెండవపక్షము. "న్యాయమ్మ" న్యాయమేయను నర్థమున నవధారణ. అనగా సవతులతోఁబాటుగానైనఁ జూచుట న్యాయమేకదా! యనుట. దిక్ప్రదర్శనముగాఁ జూపఁబడిన యంశములను బట్టి యితరంబు లూహ్యంబులు.

## ప్రాకృతశ్లేష యాంధ్రమున నిరూపింపఁబడినది.

పుట 102

మూలమందు శకుంతలా వణ్ణం పెక్ఖ — శకుంతల వర్ణము చూడుము. విరహావ్రతమునఁ గృశించి పాలిపోయినదనుట. శకుంతముయొక్క లావణ్యము మెఱుపుఁ జూడుమనుట రంగువేసిన యాటనెమలియొక్క తళతళ చూడుమనుట.

అనువాదమునందు:— శకుంత లక్షణము చూడుము. శకుంతముయొక్క లక్షణము పొంకము చూడుము. శకుంతల క్షణము చూడుము. శకుంతలను క్షణము ఒక నిమిషము చూడుమనియు పతిసమాగమంబున శకుంతలయొక్క క్షణము = ఉత్సవము ఉల్లాసము చూడుమనియు శకుంత లక్షణము అను పదము కవయిత్రికిఁ గుదురుట విశేషము.

శ్రీమతి కవితిలక కవితా విశారద కాంచనపల్లి కనకాంబగారి శాకుంతల యిటీవల వ్రాయఁబడిన దగుటచేఁ దొలుత వ్రాసిన పెద్దల కష్టసుఖముల గ్రహించి వీలువెంట సరళముగా వ్రాయుట కవకాశ మామెకుఁ గలిగినది. పాఠకులు నుపాధ్యాయులు సవిమర్శముగాఁ జదివి యిందలి సారస్య మనుభవింతురు.

ఇట్లు,

త్రిలింగ మహావిద్యాపీఠ పరిషత్తు,

ప్రకాశకులు.



శ్రీమతి విద్వాన్ కవితిలక, కవితావిశారద

కాంచనపల్లి కనకాంబా విరచి తాంధ్రాభిజ్ఞాన శాకుంతల

# ప్ర శం స

(విమర్శకాగ్రేసర నాగపూడి కుప్పుస్వామిపండిత విరచితము)

---

చెన్నపురి విశ్వవిద్యాలయ పరీక్షయందు త్తీర్ణులైన వారిచే విద్వాన్ బిరుదమునంది యిపుడు మేరీమహారాజ్ఞి గారి స్త్రీ కళాశాలలో (Queen Mary's College) నాంధ్రపండితురాలుగా నుండు శ్రీమతి కాంచనపల్లి కనకాంబ యను నాతిమిన్న గీర్వాణశాకుంతల నాటకమును నాంధ్రమున ననువదించి దానికిఁ బీఠికను వ్రాసియీయ నన్నభ్యర్థింప నేను వల్లె యని యీ చిన్ని యుపోద్ఘాతమును సంతసమున వ్రాయుచున్నాఁడ.

"పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా అద్యాపి తత్తుల్య కవే రభావా దనామికా సార్థవతీ బభూవ" అని పండిత ప్రకాండులచే సర్వకాలములయందును, సకలదేశములందును బొగడంబడు కవిలోక చూడామణి యగు కాళిదాసుని కవితాసారస్యంబును వర్ణింపం దరమే. అమ్మహాకవీశ్వరుఁడు రచించిన గ్రంథములు రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము ననునవి కావ్యములు. మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, శాకుంతలము ననునవి నాటకములు. 'నాటకాంతం సాహిత్య'మ్మని పెద్దలు నుడువు వడువునం గావ్యములకంటెను నాటకములు ప్రౌఢతరంబులై యొప్పారు. కాని నేటికాలమున నిది విపరీతమై సాహిత్యము నాటకాది యైనది. దీనిం గూర్చి విస్తరించి యుపన్యసించుట కిది యదనుగాదు.

ప్రాచీన కాలమునుండి శూద్రకుఁడు, భాసుఁడు, కాళిదాసుఁడు భవభూతి, శ్రీహర్షుఁడు మున్నగు మహాకవీశ్వరులు సంస్కృతభాష యందు నాటకములను వ్రాసి ప్రకటించుచు వచ్చిరి. అట్టి నాటకములను విద్వాంసులు గొప్పగాఁ గొనియాడుచు వచ్చిరి. దృశ్యప్రబంధములగునట్టి నాటకము లందందు రసికులచేఁ బ్రదర్శింపఁ బడుటచేఁ బామరులును వానిలోని ముఖ్యాంశములను గ్రహించి యానందించుచుండిరి. కాని యేలకో మన తొల్లింటి యాంధ్రకవులు నాటకములను విరచింపక విడిచిపెట్టిరి. నాటకములు దేశభాషలలో వ్రాయఁబడినచో వాని యందలి చమత్కారములను, రసములను నెల్లవారును సులభముగా నెఱింగి సంతసింతు రనుట తెల్లము. అట్లగుటచే నీ కాలంబున నాంధ్రకవులు నాటకములను వ్రాయఁబూని తొలుత సంస్కృత భాషయందలి యుత్తమనాటకముల నాంధ్రీకరించి ప్రకటించిరి.

"కావ్యేషు నాటకం శ్రేష్ఠం, నాటకేషు శకుంతలా" అను నభియుక్తోక్తి చొప్పున సంస్కృతనాటకములలో నెల్లను నభిజ్ఞాన శాకుంతల మగ్రగణ్య మని మన దేశపు జనులేకాక యింగ్లండు, జర్మని, ఫ్రాన్సు మొదలగు దేశములందలి పండితవర్యులును నంగీకరించి యీ నాటకమును దమ తమ దేశభాషలలోఁ బరివర్తనముఁ గావించి యున్నారు.

అట్టి యుత్తమోత్తమ మగు నీ శాకుంతల నాటకము నాంధ్రదేశపు జను లానందించుటకై యింతకు ముందు వీరేశలింగకవి ప్రభృతులు తెలుఁగు భాషయందుఁ బరివర్తనము చేసి ప్రకటించి యున్నారు. అటులుండ వెండియు ని య్యతివ మఱల దానిని వ్రాయ నేల యని కొంద ఱడుగుదు రేమో? అట్లడిగిన వారికి రామాయణమును నెందఱు కవులు తెలుఁగు బాసను వ్రాసి యున్నా రనియు, నీ శాకుంతల నాటకమునే తొలుదొల్త నొకరు తెలుఁగున వ్రాయఁగా దానినే పిదప నేల పలువు రాంధ్రీకరించి రనియుఁ బ్రశ్నించుటయే దత్ప్రోత్తర మని యేతత్కవయిత్రి వచియింప నోపు.

కథాసంవిధానమునను రచనాసౌకుమార్యమునను రసపోష ణమునను భావావిష్కరణమునను నసదృశం బగు శాకుంతల నాటకమును మూలమునందలి మెఱుంగులు తుఱంగలించున ట్లితరభాషల యందు వ్రాయుట సులభము కాదు. అయిన నీ కవయిత్రి తన యాంధ్రీకరణమును మూలానుసారిగాను, సమంజసముగాను నిర్వహించె నని చెప్పఁదగి యున్నది.

ఇందలి భాష నిర్దుష్టముగాను, శైలి యింపుగాను నలరారుచుఁ జదువ నింపుఁ గొలిపెడు. ఇతరాంధ్రీకరణములను దీనిని బోల్చి తారతమ్య నిరూపణ మొనరించుట యనుచితము.

ఇందలి భాషాంతరీకరణవిధానము తేటపడుటకై కొన్ని పద్యములు నిచ్చట నుదాహరించెద.

“సుభగసలిలావగాహాః, పాటలసంసర్గసురభివనవాతాః,
ప్రచ్ఛాయసులభనిద్రా, దివసాః పరిణామరమణీయాః”

అను మూలము నందలి గ్రీష్మర్తు వర్ణన శ్లోకమును గనకమ్మ, యందలి పదములను గొన్నింటిఁ గైకొని

“సుభగ సలిలావగాహ సంశోభనములు
పాటలాసంగ సురభిళ వనపవనము
లాతత చ్ఛాయ సులభ నిద్రాగమములు
వాసరము లివె పరిణామ భాసురములు”

అను రమ్యమగు తేటగీతిగా వ్రాసెను.

“సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం
మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా వల్కలే నాపి తన్వీ
కి మివహి మధురాణాం మండనం నాకృతీనామ్.

చ. జలజము రమ్యమే యగును శైవల సంగతమయ్యు నెంతయుఁ
మలినమ యయ్యుఁ జందురునకు మచ్చ మఱింతగ లక్ష్మిఁగూర్చు వ
ల్కలముల నైన నీ కలికి గాంచు విశేష మనోహరత్వమే
యిల పయి సుందరాకృతుల కెద్ది యలంకృతిఁ బోలదో కదా.

అను చక్కని పద్యమును కవయిత్రి వ్రాసెను.

'శక్య మరవిందసురభిః కణవాహీ మాలినీతరంగాణా,
మంగై రనంగతప్తై రవిరళ మాలింగితుం పవనః.

అను శ్లోకమునకు గ్రంథకర్త్రి—

'మాలినీతరంగమాలికాకణవాహి,
పద్మసౌరభయుత పవను, డొప్పుఁ
గరము కౌఁగలింపఁ గామసంతప్తాంగ
కములకెపుడు ప్రీతికరముగాఁగ.

అనియు,

"యా త్యేకతో స్తశిఖరం పతి రోషధీనా
మావిష్కృతో రుణపురస్సర ఏకతో ర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు."

అను శ్లోకమునకు—

"చనియెడు నోషధీశుఁ డొక చాయను దా నపరాద్రి మీఁదికిఁ
దినకరుఁ డొక్కప్రక్క నరుదేరు ననూరుపురస్సరుండునై
యనయము రెండు తేజములకౌ యుగపద్వ్యసనోదయమ్ములన్
జన ముపదిష్ట మౌనటు నిజమ్ముగ నాత్మదశాంతరమ్ములన్.

అనియును మంజులాంధ్ర పద్యములను గావించెను.

నాలుగవ యంకములోని యుత్తమ శ్లోక చతుష్టయములో నొక్కటి యగు—

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

అను శ్లోకము—

"తొలుతన్ మీరు గ్రహింప కెవ్వరితె తాఁ దోయంబులన్ గ్రోలదో
తలిరే స్త్రీ ప్రియభూష యయ్యును భవత్స్నేహంబునన్ గోయదో
యలరుల్ పుట్టఁగఁ దొల్త మీ కెవతె కానానంద మా యీ శకుం
తల ప్రాణేశ్వరు నింటి కేగెడు ననుజ్ఞన్ మీరలిం డెల్లరున్;

అని యింపార నాంధ్రీకరించెను—

ఇందుఁ బద్యములేకాక సంభాషణములందుఁ బ్రసక్తములైన గద్యములును లలితంపుఁ బలుకులఁ దెలుఁగు సేయఁబడియున్నవి. దుష్యంతమహారాజు కణ్వాశ్రమమునఁ దొలుత శకుంతలను దత్సఖులను జూచి వారితో సంభాషణ సేయు ప్రకరణమును, శకుంతల తన భర్త పాలి కరుగుటకై యాశ్రమమునుండి పయనము సేయు నప్పటి వృత్తాంతములు మున్నగునవియుఁ దేట మాటలతో వ్రాయఁబడియున్నవి.

ఆంధ్రవాణి యిక్కాలంబునఁ బెక్కు కారణములచే లక్షణ విహీనమై యుపచయదశం బొరయుచుండ నార్యసమ్మతంబుగ నద్దేవికిఁ గైసేత సేయువారలు ప్రశంసనీయులుగారె. అందును నారీమణు లట్లు కావించిన వారు కరంబు పొగడ్తకుఁ దగినవారు కదా. కావున శాకుంతల నాటకము నాంధ్రీకరించి ప్రకటించిన యీ కవయిత్రి

యుద్యమము స్తవనీయ మని చెప్పవలయునే ? ప్రదర్శనార్హ మగు నీ యాంధ్రాభిజ్ఞాన శాకుంతల నాటకము నాంధ్రలోక మాదరించుఁ గాక.

ఇంకను విస్తరించి వ్రాయుట యనవసర మను తలంపున నీ నాటక రత్నము నాంధ్రీకరించిన కనకమ్మ కభిమతార్థసిద్ధిం బరమేశ్వరుం డనుగ్రహించుఁగాక యని కోరుచు దీనిని విరమించెద.

తిరుపతి,
27—4—1929.

నాగపూడి కుప్పుస్వామయ్య.





మన్నారాయణచర
ణౌమమత్తారహితహృదయనళినవసంత
రామ! శరణంప్రపద్యే
భూమానందప్రదౌవిభూసుమహాంత!

శ్రీ రామాయనమః.

# అభిజ్ఞాన శాకుంతలము.

నాంది

ఉ. ఆదిమసృష్టి స్రష్ట కెది హవ్యము నెద్ది వహించు హోత్రియా
నేది యొనర్చుఁ గాలమును నేకవ విశ్వమదెల్ల నిండి శ్రు ♦
త్యాదరణార్థలక్షణము నా నెది * భూతము లెల్లఁ గల్గు నెం
దేది సజీవు లట్టు లెనయించును బ్రాణము నా సుమూర్తు లి
ట్లే దొర దాల్చు నెస్మదిటి నీశుఁ డతం డొగి మిమ్ముఁ బ్రోచుతన్.

పస్తావన.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు— (తెఱవంకఁ జూచి) దేవీ! అలంకరణమైనచోఁ
గొంచె మిటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఇదే వచ్చితిని.

సూత్ర— దేవీ! ఈ సభ పండితులతో నిండియున్నది. తొల్లి దేవభాష
యందుఁ గాళిదాసమహాకవిచే రచియింపఁబడి నూతనముగ విద్వ
త్కవితిలక కాంచనపల్లి కనకాంబచే నాంధ్రీకరింపఁబడిన 'యభి
జ్ఞానశాకుంతలం'బను నాటకమును బ్రదర్శించి మన మిపుడు వీరిని
సంతోషపెట్టఁ దగును. కావునఁ బాత్రల నందఱ నతిజాగరూక
తతో నాయత్త పఱుపుము.

నటి— ప్రయోగకౌశలము గల్గుటంజేసి దేవర కే లోపము నుండదు.

సూత్ర— దేవీ! యాథార్థ్యము వచింతు.

క. ఉత్తమ మని యెంచనుగద
విత్తము లలరక ప్రయోగవిజ్ఞానంబున్
జిత్తము తనుఁ దా నమ్మట
యుత్తమశిక్షితుల కేని యుత్తది సుమ్మా.

---

♦ శ్రుతియొక్క ఆదరణము కొఱకైన అర్థము = శ్రుత్యా...ర్థము అనఁగా శబ్దము, ఆ శబ్దము లక్షణముగాఁగలది శ్రు........లక్షణము, అనఁగా ఆకాశము, శబ్దగుణక మాకాశమ్ (శబ్దము గుణముగాఁగలది.)

* బీజములు.

నటి—ఆర్యపుత్రా! అది నిజము. అనంతరకరణీయము దేవర సెలవిత్తురు గాక.

సూత్ర—ఈ సభవారి వీనులకు విందొదవింపఁగలుగుట కన్న వేఱొకటే మున్నది. కాన, మొన్న మొన్ననే వచ్చినదియు, భోగములకు యోగ్యమైనదియు నగు నీ గ్రీష్మఋతువును గూర్చియే గానము చేయుము. ఇప్పుడు

గీ. సుభగసలిలావగాహ సంశోభనములు
పాటలాసంగ సురభిళవనపవనము
లాతతచ్ఛాయ సులభనిద్రాగమములు
వాసరము లివె పరిణామభాసురములు.

నటి—చిత్తము (అని పాడుచున్నది.)

క. దరముగ నళులానినయవి
వరకోమల కేసరాగ్రభాగోచ్ఛయముల్
కరుణాయుత లగు తరుణులు
శిరీషములఁ జెవులఁదాల్చి చెలఁగుదు రెలమిన్.

సూత్ర—దేవీ! చక్కఁగఁ బాడితివి. సభవారి మనోవృత్తులు రాగనిబద్ధంబు లగుట నంతటను రంగము చిత్తరువుంబోలి యున్నది. అట్లగుట నిపుడే నాటకమును బ్రదర్శించి యీ సభ నలరింతము.

నటి—ప్రసిద్ధమైన యభిజ్ఞాన శాకుంతల మను నపూర్వనాటకముఁ బ్రదర్శింపవలయు నని తొలుతనే దేవర యాజ్ఞాపించితిరిగదా!

సూత్ర—దేవీ! చక్కఁగ జ్ఞప్తి చేసితివి. దాని నే నిప్పుడు మఱచితినిగదా ఏలయన:

క. నీ లలితగీతరాగము
చే లాగంబడినవాఁడ సిద్ధంబీ భూ
పాలుఁడు దుష్యంతుఁడు కడు
వైళము చను లేడి చేత వలెనే లలనా! (అని నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

* రాగము చేతవలెనే లేడిచేత లాగంబడినవాఁడ; హృతః అని ప్రథమ పురుషయైన దుష్యంతునకు నుత్తమపురుషయైన సూత్రధారునకు నన్వయించును గనుక లాగఁ

# అభిజ్ఞానశాకుంతలము.

## ప్రథమాంకము

రంగము — కణ్వాశ్రమారణ్యము.

(అంతట విల్లు నమ్ములఁ గైకొని రథారూఢుండై జింకను దఱుముచు దుష్యంతమహారాజును, సూతుఁడును బ్రవేశించుచున్నారు.)

సూతుఁడు—(రాజును, మృగమును జూచి) ఆయుష్మంతుఁడా!

గీ. కృష్ణసారమ్మునందును నెక్కువెట్టు
విల్లుగల్గిన నీ యందు వీక్షణంబు
నిల్పు నాకుఁ గన్నట్లయ్యె నిక్కము హరి
ణంబు వెన్నాడు సాక్షాత్ పినాకపాణి.

రాజు—సూతుఁడా! మన మీ సారంగముచేఁ జాలదూర మాకర్షింపఁ బడితిమి. అది మఱియు నిప్పుడును.

మ. వెనువెంటం బడు తేరు సారె గనుచుఁ వీక్షింపఁగా సొంపుఁగాఁ
దన గ్రీవంబును ద్రిప్పి బాణపతనత్రాసంబునన్ బృష్ఠ మె
య్యున ముస్సేనున దూర్చి డస్సి వివృతాస్యం బౌటచే సామి మే
సిన దర్భాంకురముల్ పథంబునఁ బడన్ శీఘ్రప్లుతిన్ నేల నం
టినదా! యన్నటు లుండి మింటఁజనుఁ గంటే సూత! సారంగమున్.

(సవిస్మయముగ) ఏ మిది! వెంబడించుచున్నను నా కిది ప్రయత్నమునఁ గాని కానరాకున్నది.

సూతు—ఆయుష్మంతుఁడా! మిట్టపల్లములు గల భూమి యని పగ్గముల బిగపట్టితిని గాన రథవేగము తగ్గి మృగము దవ్వైనది. ఇప్పుడు సమప్రదేశమందున్న నీ కిది యసాధ్యము కాదు.

రాజు—అట్లయినఁ బగ్గముల సడలింపుము.

సూతు — దేవరచిత్తప్రకారమే. (రథవేగము నిరూపించి) ఆయుష్మంతుఁడా ! చూడుము చూడుము.

మ. సడలన్ *వాగెలు పూర్వకాయములు లెస్సన్ జాఁచి కంపంబు లే
కడరన్ జామరశీర్షముల్, చెవులు స్థైర్యం బొప్ప నిక్కన్ ఖురం
బులఁ బై కేగెడు ధూళి కేని కడవం బోరాక యీ రథ్యముల్
పడిఁ బాఱుంగద లేడివేగమును నోర్వన్ లేనియ ట్లెంతయున్.

రాజు — సత్యము. ఈ గుఱ్ఱములు సూర్యునిగుఱ్ఱముల మించి పఱుగిడుచున్నవి. అది యుక్తమేగదా !

ఉ. ఇంచుకగాఁగఁ దోఁచునది యింతటిలో విపులంబుగాఁగఁ గా
న్పించు, సగానఁ జీలు నది నిండుగఁదాపిన యట్లు పుట్టులో
నెంచఁగ వక్రమైన యది యెంతయుఁ జక్కఁగఁ బ్రక్కదూరమం
దంచు నొకండు నాకు క్షణ మైనను లేదుకదా రథత్వరన్.

రాజు — సూతుఁడా ! ఇదె దీనిం గూల్చుచున్నాను చూడుము. (అని వింట బాణమును సంధించుట నభినయించుచున్నాఁడు.)

(నేపథ్యమున)

ఓహో రాజా! ఆశ్రమమృగ మిది. చంపఁదగదు. చంపఁదగదు.

సూతు — (ఆలించి, యటుచూచి) ఆయుష్మంతుఁడా! నీకును, నీ బాణపాతదూరమున నున్న హరిణమునకును నడుమఁ దాపసులు వచ్చియున్నారు.

రాజు — (ససంభ్రమముగ) అట్లయిన గుఱ్ఱముల నాఁగుము.

సూతు — చిత్తము. (అని రథమును నిలుపుచున్నాఁడు).

(అంతట వైఖానసుఁడు మరి యిరువురితోఁ బ్రవేశించుచున్నాఁడు)

వైఖానసుఁడు — (హస్తమును బైకెత్తి) రాజా! ఆశ్రమమృగ మిది చంపఁదగదు. చంపఁదగదు.

గీ. తగదు తగ దహో యీ యమ్ము తగుల నిట్టి
మెత్త నగు లేడిమేనఁ బూగుత్తి నగ్ని
వలె నిశితపాతపవిసారము లగు నీశ
రంబు లేడ మృగచలజీవంబు లేడ.

గీ. అట్టగుట లెస్స సంధించినట్టి నీదు
సాయకంబును వే యుపసంహరింపు
మార్తరక్షణమునకె మీ యస్త్ర మధిప!
పాపరహితుల నొప్పించుపనికిఁ గాదు.

రాజు—ఇదిగో! యుపసంహరించితిని.(అని చెప్పినట్లు చేయుచున్నాఁడు.)

వైఖా—పురువంశ ప్రదీపకుండ వగు నీ కిది తగినది.

క. అదిరా! పురువంశంబున
నుదయించిన నీకు నెంతయు\ యుక్తంబౌ
నిది ఏవంవిధగుణసం
పద గల్గిన సుతునిఁ జక్రవర్తినిఁ గనుమా.
(తక్కిన యిరువురు చేతు లెత్తి)
తప్పక చక్రవర్తి యగు సుతునిఁ గాంచెదవుగాత.

రాజు—(ప్రణమిల్లి) బ్రాహ్మణాశీర్వాదమును బరిగ్రహించినాఁడను.

వైఖా—రాజా! సమిధలఁ దెచ్చుటకు మేము బయలుదేరితిమి. కుల
పతి యగు కణ్వుని యాశ్రమ మల్లదె మాలినీతీరమునఁ గనఁ
బడుచున్నది. కార్యాంతరభంగము కానియెడల నాశ్రమమును
బ్రవేశించి యతిథి సత్కారమును గ్రహింపఁదగును. మఱియు,

క. ప్రతిహతవిఘ్నంబులు ర
మ్యతరము లగు మునులక్రియల నటఁ గని కనె దే
గతి గుణకిణాంకితము భూ
పతి! నీ భుజ మెంతదవ్వు పాలించెడినో.

రాజు—కులపతు లిప్పు డాశ్రమమం దున్నారా?

వైఖా—కూఁతు రగు శకుంతల నాశ్రమమున నతిథిసత్కారమునకె
నియమించి యామెయొక్క ప్రతికూలదైవము నుపశమింపఁ
జేయుటకు వా రిప్పుడే సోమతీర్థమున కేగిరి.

రాజు—పోఁగాక. ఆమెనే చూచెదను. మహర్షియెడ నాకుఁగల భక్తి
నామె యే యాయనకు విన్నవింపఁ గలదు.

వైఖా—మేమిఁకఁబోయివచ్చెదము. (అని శిష్యులతో నిష్క్రమించును.)

రాజు—సూతుఁడా ! గుఱ్ఱములఁ దోలుము. పుణ్యాశ్రమదర్శనమున మనలం బవిత్రులఁ గావించుకొందము.

సూతు—దేవర యాజ్ఞానుసార మొనరించెదను. (అని తిరిగి రథవేగమును నిరూపించును.)

రాజు—(అంతటఁ గలయఁ జూచి) సూతుఁడా ! ఇది చెప్పకున్నను దపోవనముయొక్క సంపూర్ణత్వ మని తెలియవచ్చుచునే యున్నది.

సూతు—ఎట్లు ?

రాజు—నీవు చూడలేదా యేమి ? ఇదిగో ,

మ. వనిఁ గంటే శుకగర్భకోటరముఖ భ్రష్టంబు లీ చెట్లక్రిం
దున * నీవారము లింగుదీఫలభిదల్ సూచించు నిద్దంపురా
ళ్ళను విశ్వాసముచే నభిన్నగతిఁ జాలన్ జప్పుడుల్ సైచు లే
ళ్లను వల్కంబుల జాఱు నీరముల చాళ్ళన్ మార్గమార్గంబులన్.

సూ—అంతయు నట్లే యున్నది.

రాజు—(కొంతదూరము పోయి) తపోవనవాసుల కాటంకము గలుగఁ గూడదు. ఇచటనే రథము నిలుపుము. నేను దిగెదను.

సూ—పగ్గములఁ బట్టుకొన్నాఁడను. ఆయుష్మంతుఁ డిఁక దిగవచ్చును.

రాజు—(దిగి) సూతా ! తపోవనంబులు వినయవేషములఁ బ్రవేశింపఁ దగినవికదా ! వీని నందుకొనుము. (అని యాభరణములను ధనువును దీసి సూతున కిచ్చుచున్నాఁడు) సూతుఁడా! నే నీ యాశ్రమవాసులఁ జూచి వచ్చు లోపల నీవు గుఱ్ఱముల వీపులఁ గడుగుము.

సూ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు).

రాజు—(కొంత నడచి యవలోకించి) ఆశ్రమద్వార మిదిగో ప్రవేశించుచున్నాను. (ప్రవేశించి నిమిత్తమును సూచించుచు)

క. శాంతం బీ యాశ్రమపద
మెంతయు బాహువు వదరు నిట నెటు తత్ఫలమా
వింతా ! ♦ భవితవ్యమ్ముల
కంతట మార్గంబు లబ్బె యమరుంగాదే.

---

* జాపమల్ క్వచిదిం ♦ కాఁదగినవి శుభములు.

(నేపథ్యమున)

సఖులారా! ఇటు! ఇటు!

రాజు—(చెవి యొగ్గి) ఓహో! వృక్షవాటికకు దక్షిణమున మాట లాడు నట్లు వినవచ్చుచున్నది. అచ్చటికిఁ బోయెదను. (కొంతనడచి—చూచి) ఈ తాపసకన్యలు వారివారి శక్తికిఁ దగిన సేటికడవలతో మొక్కలకు నీరుఁ బోయ నిటె వచ్చుచున్నారు. (లెస్సఁగాఁ బరికించి) ఆహా! వీరి దర్శన మెంతరమ్యము.

క. కాంతారాశ్రమ జనమున
కంతఃపురదుర్లభతను నమరిన యేని
న్జెంతయు గుణముల మీఱు వ
నాంతరలత లుపవనంబు లందలి లతలన్.

ఈ చెట్టుచాటున నిలిచి చూచుచుండెదను. (అని చూచుచు నిలుచున్నాఁడు.)

(అంతటఁ బైఁజెప్పిన వ్యాపారముతో నిద్దరుసఖులతో శకుంతల ప్రవేశించుచున్నది.)

శకు—సఖులారా! ఇటు! ఇటు!

అన—చెలీ శకుంతలా! తండ్రిగారగు కాశ్యపులకు నీమీఁదకన్న నీ యాశ్రమములోని మొక్కలమీఁద నెక్కుడు మక్కువ యని తోఁచుచున్నది. ఏలయన నవమాలికాకుసుమంబుఁ బోలె సుకుమారి వగు నిన్నుఁగూడ నీ చెట్లపాదులకు నీళ్ళుపోయ నియమించినారు.

శకుం—తండ్రిగారి యాజ్ఞమాత్రమే కాదు. వీనియందు నాకును సోదర స్నేహమే కలదు.

(అని చెట్లకు నీరు పోయుట నభినయించుచున్నది.)

రాజు—కణ్వున కీమె కూఁతు రెట్లయి యుండును! ఈమె నాశ్రమధర్మమందు నియోగించుటంబట్టి పూజ్యుఁడగు కణ్వుఁ డౌచితిఁ బాటించినవాఁడు కాఁడుగదా!

క. ఈ యవ్యాజ మనోహర
కాయుంబుఁ దపంబు నోర్వఁగాఁ జేయఁగఁ దా

నేయమి గోరు నతఁడు శమిఁ
గోయఁగడఁగుఁ గలువ ఱేకుకొనలఁ దూఁడిఁ.

కానిమ్ము. ఈచెట్టుచాటున నుండి యలికిడి గాకుండఁ జూచెదను.(అని అట్లు చేయుచున్నాఁడు.)

శకు—సఖీ! అనసూయా! ప్రియంవద నా వల్కలమును బిఱ్ఱుగ బిగించి కట్టినది. దీనినిఁ గొంచెము సడలింపుము.

అన—అట్లే (అని సడలింపుచున్నది.)

ప్రియ—(నవ్వుచు) నన్నేల నిందించెదవు? పయోధరవిస్తారమును గలిగించు నీ యౌవనమును నిందించుకొనుము.

రాజు—ఈమె వయస్సున కీ వల్కల మెంతమాత్రము తగినదికాదు. ఐన నిది యలంకారశోభ నతిశయింపఁజేయు లేదని చెప్పరాదు. ఎట్లంటే!

*చ. జలజము రమ్యమే యగును శైవలసంగతమయ్యు నెంతయుఁ
మలినమ యయ్యుఁ జంద్రునకు మచ్చ మఱింతగ లక్ష్మిఁగూర్చువ
ల్కలములనైన నీ కలికి కాంచు విశేషమనోహరత్వమే
యిలపయి సుందరాకృతుల కెద్ది యలంకృతిఁ బోలదోగదా.

శకుం—(ముందు చూచి) గాలిచేఁగదలుచున్న పల్లవాంగుళులచే నీ కేసర వృక్షము నన్నుఁ ద్వరగా రమ్మని పిలుచుచున్నటు లున్నదిఁ కాన నే నిప్పుడు దీనిని సంభావించెదను. (అని వెళ్లును).

ప్రియ—సఖీ! శకుంతలా! అచ్చటనే కొంతసేపు నిలువుము. నీవు చేరువ నున్నప్పు డీ కేసరవృక్షము తీఁగతోఁగూడుకొన్నట్లు శోభించుచున్నది.

శకుం—కావుననేగదా! నీవు ప్రియంవద వైతివి.

రాజు—ప్రియ మైనప్పటికిని బ్రియంవద శకుంతలనుగూర్చి తథ్యమే చెప్పినది. ఈమెకు

---

* పాఠాంతరము

గీ. నాచు గప్పియున్న నలినంబు రమ్యంబు। శశికి నల్లమచ్చ చాయఁదెచ్చు
నీమె వల్కలముల నెంతయు శోభిల్లు। మంచి కేది తగదు మండనముగ.

కం. చివురువలెన్ గెమ్మోవి మృ
దువిటపముల ననుకరించు దోర్యుగ మారా
పువువలెఁ గమనీయం బగు
నవయౌవన మంగములను నాతికి నమరెన్.

అన—సఖీ శకుంతలా! సహకారమునకు స్వయంవరవధువైన యీ నవమాలికకు వనజ్యోత్స్న యని పేరు పెట్టితివి. దీనిని మరచితివి.

శకుం—అట్లయిన నన్ను నే మఱచిపోవలసినదే. (అని లతను సమీపించి దానిని(జూచి) రమణీయమగు కాలమునం దీ లతాపాదపమిథునమునకు సంబంధము కుదిరినది. వనజ్యోత్స్న నవకుసుమ యౌవనవతి. స్నిగ్ధపల్లవములచే భోగార్హ మైనది సహకారము. (అని చూచుచు నిలుచున్నది.)

ప్రి—అనసూయా! వనజ్యోత్స్నను శకుంతల యంతగా నేల చూచుచున్నదో నీకుఁ దెలియునా?

అన—నాకుఁ దెలియ లేదే! చెప్పుము.

ప్రియ—వనజ్యోత్స్న తనకుఁ దగిన వృక్షరాజము నెట్లు పొందెనో యట్లే తనకు ననురూపుఁడైన భర్త లభించునా యని.

శ— ఇది యంతయు నిశ్చయముగా నీ మనస్సునందలి యభిలాష. (అని కలశమును గ్రుమ్మరించుచున్నది.)

రా—కులపతు లగు కణ్వుల కీమె యసవర్ణక్షేత్రసంభవయై యుండునా యేమి? చాలు చాలు. సందేహ మేల?

గీ. పూజ్య మైనట్టి నా మనంబు వలచె నీక
సంశయంబేల యీమె రాజన్యయోగ్య
సందియంబులు గల పట్ల సత్పురుషుల
కాత్మవృత్తు లగుఁ బ్రమాణ మది నిజంబు.
అయినప్పటికి నీమె యాథార్థ్యం బరసెద.

శ—(సంభ్రమముతో) అమ్మో, నీళ్లు పోయుటచే బెదరి లేగి యీ మధుకరుఁడు నవమాలికనువదలి నాముఖమువీఁదికి వచ్చుచున్నాఁడు. (అని భ్రమరబాధ నభినయించుచున్నది.)

రా—(ఆశతో)

చ. వ్యథను వడంక మాటికి నపాంగవిలోకన మంటుచుంట రహః
కథనము భంగిఁ బాడుచును గర్ణములన్ మృదుగీతి భోగమూ
లధనము కాంత మోవి కడు డగ్గఱి క్రోలెదు చే నదల్చినన్
మధుకర! తత్త్వమారయుట మాపని యయ్యెఁ గృతార్థుఁ డీవె కా.

శకు—దుండగీఁడు మధుకరుఁడు నన్ను వదలునట్లు లేదు. ఇంకొక చోటికి నేఁబోయెదను. (ఒక్కయడుగు వేసి మధుకరుని వంకఁ జూచి) ఇక్కడకుఁగూడ నెట్లు వచ్చుచున్నాఁడో సఖులారా! ఈ దుర్వినీతుఁడగు మధుకరుని బారి నుండి నన్ను రక్షింపుఁడు.

ఉభయులు—(చిరునవ్వుతో) రక్షించుటకు మేమెవరము? దుష్యంతుని రమ్మనుము. తపోవనములు రాజరక్షితవ్యములు గదా!

రాజు—(స్వ) ఇదియే బయలుపడుటకు నాకు మంచిసమయము. (ప్ర) భయపడఁదగదు. భయపడఁదగదు. (అని సగములో నాపి ఆత్మగతమున) అట్లైన రాజభావము బయలుపడునేమో కదా! కానిమ్ము. ఇటులఁ బలికెదను.

శ—(ఇంకొక యడుగు పెట్టి నిలిచి, దృష్టి నిగుడించి) ఇచ్చటకుఁగూడ నన్నెట్లనుసరించి వచ్చుచున్నాఁడో!

రాజు—(త్వరగాఁ బ్రవేశించి)

గీ. దుర్వినీతుల దండించి యుర్వి పౌర
వుండు పాలించుచుండ నెవ్వండు వీఁడు
తపసికన్యల ముగ్ధలఁ దవిలి యవిన
యంబునను నేఁచు నిట్లు భయంబుఁ దక్క.

(అందఱు రాజును జూచి, యించుక సంభ్రాంతచిత్తలగుచున్నారు.)

అన—ఆర్యా! అంత యుపద్రవ మేమియు లేదు. ఈ మా ప్రియసఖి మధుకరాభిభూయమానయై భయపడినది. (అని శకుంతలను జూపుచున్నది.)

రాజు—(శకుంతలవైపు తిరిగి) తపస్సు వర్ధిల్లుచున్నదా?

(శకుంతల తత్తరముతో మాటాడ కూరకున్నది)

అన—మీ వంటి యుత్తము లైన యతిథుల రాకచే మఱియు వర్ధిల్లు చున్నది. సఖీ శకుంతలా! పర్ణశాలకుఁ బోయి ఫలములతోఁ గూడ నర్ఘ్యమును గొని తెమ్ము. ఇయ్యది పాదోదకం బగు.

రాజు—మీ సూనృతవాక్కులే నా కాతిథ్య మయ్యెను.

ప్రి—అట్లేని యార్యులు చల్లని నీడ గల యీ సప్తపర్ణ వేదికపై ముహూర్తము విశ్రమించి బడలికఁ దీర్చుకొందురు గాక.

రాజు—మీరు కూడ నీ పని చేసి మిక్కిలి యలసిన ట్లున్నారు.

అన—సఖీ! శకుంతలా! అతిథుల సేవించుట మన కుచితము గదా! ఇచటఁ గూర్చుందము (అని యందఱు గూర్చుందురు).

శకుం—(ఆత్మగతము) వీనిం జూచినది మొదలు నా కేలొకో తపోవన విరుద్ధ మైన మనోవికారము కలిగినది.

రాజు—(అందఱను జూచి) ఆహా! సమవయోరూపములచే నెంత రమణీయ మైనది, మీ స్నేహము!!

ప్రి—(జనాంతికముగ) అనసూయా! చతురగంభీరాకృతి గలిగి నేర్పుగను బ్రియముగను మాటలాడుచు మహారాజువలెఁ గన్పట్టు నీతఁ డెవ్వండు?

అ—సఖీ! నాకుఁగూడ నట్టి కుతూహలమే కలదు. ఈయననే యడిగెదను. (ప్రకాశముగ) ఆర్యుని మధురాలాపముల వలనఁ గలిగిన చనవు నన్నుఁ బ్రేరేచుచున్నది। ఆర్యునిచే నే రాజర్షి వంశ మలంకరింపం బడుచున్నది? ఏ దేశపు జనులు దేవర విరహమున దహతహ పడుచున్నారు? తపోవనగమనపరిశ్రాంతి కే నిమిత్తమున నిట్టి సుకుమార శరీరము పాల్సేయఁబడినది?

శ—(ఆత్మగతము) హృదయమా! తత్తరపడకుము. నీ వడుగఁ దలఁచిన దాని ననసూయయే యడుగుచున్నది.

రా—(ఆత్మగతము) నన్ను నే నెట్లు తెలుపుకొందును? పోనీ నన్నెట్లు మఱుగు పఱచుకొనఁ గలను? కానీ యీ లాగున నీమెతోఁ జెప్పెదను. (ప్రకాశముగా) అమ్మా! పౌరవరాజుచే ధర్మాధికారమునందు నియోగింపఁబడినవాఁడనై యాశ్రమవాసుల క్రియలు

నిర్విఘ్నముగ జరుగుచున్నవా యని తెలిసికొనుటకీ ధర్మారణ్యమునకు వచ్చితిని.

అ—ఇప్పుడు గదా ధర్మచారులైన యాశ్రమవాసులు సనాథులైరి. (శకుంతల శృంగారలజ్జ నభినయించుచున్నది.)

సఖులు—(ఉభయుల యాకారములను గ్రహించి జనాంతికముగ) సఖీ శకుంతలా! నాయనగారే యిప్పుడిక్కడ నుండినా!

శకు—ఉన్న నేమగును?

సఖులు—ఈ యతిథిశ్రేష్ఠునిఁ దన జీవితసర్వస్వము నొసంగియైనఁ గృతార్థునిఁగాఁ జేయును.

శ—మీ రుభయులు పొండు. మీ రేద్దియో మనమున నిడుకొని మాటలాడుచున్నారు. మీ మాటల నే వినను.

రాజు—మేము కూడ మీ సఖిని గుఱించి కొంత యడిగెదము.

సఖులు—ఆర్యా! ఇట్లు కోరుట మమ్మనుగ్రహించుటయే.

రా—పూజ్యులగు కాశ్యపులు శాశ్వతబ్రహ్మనిష్ఠులని ప్రసిద్ధి. ఈ మీ సఖి వారి కాత్మజ యెట్లయ్యెను?

అ—దేవర చిత్తగింపుఁడు. కృతగోత్రనామధేయుఁడును మహాప్రభావసంపన్నుఁడు నగు కౌశికుఁ డను రాజర్షి యొకఁడు గలఁడు.

రాజు—కలఁడు. వినియున్నాము.

అన—మా చెలినిఁ గన్నవాఁ డతఁడే సుమండీ. పరిత్యజింపఁబడిన యీమెకు శరీరపోషణాదికము చేసి పెంచుటచేఁ గాశ్యపులు తండ్రియైరి.

రా—"పరిత్యజింపఁబడి" యను శబ్దముచే నాకుఁ గుతూహలము పుట్టుచున్నది. ఆమూలాగ్రముగ విన నిచ్ఛగించుచున్నాను.

అన—దేవర యవధరింపుఁడు. పూర్వము గౌతమీతీరమున నా రాజర్షి యుగ్రతపముఁ జేయుచుండఁగా నెంతయు భయము నొందిన దేవతలచే నియమవిఘ్నకారిణి యగు మేనక యను నప్సరస పంపఁబడినది.

రా — దేవతలకు నన్యసమాధిభీరుత్వ మెప్పుడు నున్నదే!

అ — రమణీయ మగు వసంతసమయమున నున్మాదమును గలిగించు నామె రూపమును జూచి— (ఇట్లు సగము చెప్పి లజ్జచే నూఱకుండును.)

రా — తరువాత తెలియుచునే యున్నది. సర్వవిధముల నీమె అప్సర స్సంభవయే.



అ — అవును.

రా — యుక్తముగనే యున్నది.

క. కర మరు దగు రూపం బిది
తరమా పొడమంగ మర్త్యతరుణులయందుం
*తరళజ్యోతి తటిల్లత
ధర నుద్భవ మొందు టన్న దబ్బరయొకదా!

(శకుంతల తలవంచుకొని యున్నది.)

రా — (ఆత్మగతముగ) నా మనోరథము నెఱవేఱ నవకాశము కల దయ్యె. అయినం జెలికత్తెలు పరిహాసముగా నుదాహరించిన యీమె వరప్రార్థనము విని నా మనంబు భిన్నభావంబులచేఁ గలఁత నొందుచున్నది.

ప్రి — (మందహాసముతో శకుంతలను జూచి రాజువైపు తిరిగి) దేవర మరల నేమో చెప్పఁదలఁచిన ట్లున్నారు?

శకుంతల — (చెలికత్తెను వ్రేలితో బెదరించుచున్నది.)

రా — నీవు చక్కఁగఁ గనిపెట్టితివి. మాకు సచ్చరిత్రమును వినుట యందలి కుతూహలమున మఱియొక విషయము నడుగఁదలఁచి నాము.

ప్రి — తా మింత విచారింప నక్కఱలేదు. మన సిచ్చి యే విషయ మైన ముచ్చటింపఁ దగినవారుగదా తపస్విజనులు!

రా — ఇట్లు మీ సఖినిఁ గూర్చి తెలియఁగోరు చున్నాము.

---

*తరళమైన జ్యోతికలది=తరళజ్యోతి, తరళజ్యోతి యైన తటిల్లత=తరళ...... లత, పాఠాంతరము — తరళప్రభా తటిల్లత.

ఉ. ఈ నళినాయతాక్షి కుసుమేషుసుకృత్య విరోధి యైన వై
ఖానస సద్వ్రతంబు పతిఁగాంచిన దాఁక నిటాచరించునో ?
కానియెడ న్నిరంతరముఁ గానల నాత్మసమానదృష్టి సొం
పైన మృగీతతిం గలసి యాడుచుఁ బ్రొద్దులు పుచ్చునో కదా !

ప్రియ—ఆర్యా ! ధర్మాచరణమునందు గూడ నీమె పరవశయే యయినను దండ్రిగారికి మాత్ర మనురూపుఁడైన వరునకు నీమె నిచ్చి పాణిగ్రహణము నొనర్చుటయే సంకల్పము.

రా—(ఆత్మగతముగ) ఈ కోరిక దుర్లభము కాదుసుమీ !

గీ. హృదయమా సస్పృహమ వగు మింక నీవు
సంశయం బది యిప్పుడే సమసిపోయె
నగ్ని యని దేని శంకించి తదియ యూర
తాఁకఁ దగినది యయ్యె సద్రత్న మిద్ది.

శ—(రోషముతో నున్నట్టుగ) అనసూయా ! నేను వెళ్ళెదను.

అన—ఏల ?

శ—పూజ్యురా లైన గౌతమికి నీ యసంబద్ధ ప్రలాపిని యైన ప్రియంవదను గూర్చి చెప్పుటకు.

అ—సఖీ ! అతిథిశ్రేష్ఠుని సత్కరింపకయే విడిచి యిచ్చవచ్చిన చోప్పున వెళ్ళుట యుక్తము కాదు.

శకుంతల—(ఏమియు బదులుచెప్పకయే బయలుదేరును.)

రాజు—(పట్టుకోనఁ బోయి తిరిగి తనను నివారించుకొని స్వగతముగా) ఔరా ! కామిజన చిత్తవృత్తి చేష్టాప్రతిరూపముగ నున్నది కదా ! ఏలయన, నేను

క. మునిసుత వెనుకోనఁ గోరియు
వినయము త్రోడ్తోడ బొడమి వేగిర మడఁపఁ
మునుపున్న చోట నుండియుఁ
జని మఱలఁ వచ్చువాని చందం బైతిఁ.

ప్రియ—(శకుంతల నడ్డగించి) సఖీ ! నీవు వెళ్ళఁ దగదు.

శ—(బొమముడిపాటుతో) ఏమి నిమిత్తము ?

ప్రి—నీవు నాకు రెండుచెట్లకు నీళ్లు పోయ నప్పుపడి యున్నావు ! రమ్ము. (అని బలవంతముగా నామెను మరలించును.)

రా—కల్యాణీ ! నీళ్లు పోయుటవలననే యీమె యలసినట్లు కనంబడు చున్నది. ఏలయన నీమెకు

మ. ఘటమెత్తన్ సడలెన్ భుజమ్ములవి రాగంబెక్కెఁ బాణిద్వయిన్
ఘటియించుం గద యిప్పుడే గుచములన్ గంపంబు నిట్టూర్పు చె
మ్మటలున్ గర్ణశిరీషరోధులుగఁ గ్రమ్మన్ జొచ్చె నెమ్మోమునన్
బటిమన్ జెర్వఁగ నొక్కచేముడివిడన్ బర్యాకులంబయ్యెఁ గురుల్.

కాన నీమెను నేను ఋణవిముక్తఁ గావించెద. (అని యుంగరము నిచ్చును). (సఖు లిద్దఱు నామముద్రాక్షరములఁ జదువుకొని యొండొరులఁ జూచుకొందురు.)

రాజు—మమ్ముల నన్యథా భావింపవలదు. ఇది రాజుగారి బహుమానము కావున నన్నొక రాజపురుషునిగా నెఱుంగుఁడు.

ప్రి—ఆ కారణముననే యీ యుంగరము మీ వ్రేలి నెడఁబాయఁ దగదు. దేవరమాటచేతనే యిప్పు డీమె ఋణవిముక్తురాలయ్యెను. (ఇంచుక నవ్వి) సఖీ! శకుంతలా! కరుణాళుఁ డగు నార్యునిచే, నేల! మహారాజుచే ఋణవిముక్తురాల వైతివి. ఇఁక నీ విప్పుడు పొమ్ము.

శకుం—(ఆత్మగతము) నేనే స్వతంత్ర నైనచో! (ప్రకాశముగ) నన్నడ్డగించుటకుఁ గాని పోనిచ్చుటకు గాని నీ వెవతవు?

రాజు—(శకుంతలను జూచి స్వగతముగ) ఈమె యెడ నా కెట్లున్నదో యీమెకు నాయెడ నట్లే యుండునా ? ఉండ కేమి ? నా మనోరథమున కవకాశము కలదు. ఎట్లన ?

ఆ. వె. కలిసి మాటలాడఁగా నొల్లన ట్లుండు
వీను లొగ్గఁ బల్కఁ బూని నంత
నన్నుఁ జూడనట్టు లున్నది గా కీమె
కంటి కన్యవిషయ మంట దెందు.

( నే ప థ్య ము న )

ఓ తాపసులారా ! చేరువ నుండి యాశ్రమ మృగముల రక్షించు కొనుఁడు. మృగయావిహారియై దుష్యంతమహారాజు సమీపించి యున్నాఁడఁట.

తే. గీ. కొమ్మలందు జలార్ద్రవల్కమ్ము లార
గట్టు నాశ్రమద్రుమముల బిట్టు * రాలఁ
బరిణతారుణనిభమైన తురగఖురహ
తరజ ♦ మియ్యది మిడుతలదండు వోలె.

మఱియు.

మ. ఒకదంతంబున దీవ్రఘాతహత వృక్షోరుప్రకాండంబు ని
ల్పి కరం బద్దుల లాఁగఁ జుట్టుకొను తీవెల్ పాశముల్ గాఁగ భి
న్నకురంగౌఘము మా తపంబునకు విఘ్నం బెత్తు రూపట్లు + పా
యకు తేరుం గని యే న్గిదే బెదరి ధర్మారణ్యముం జొచ్చెడిన్.

(స్త్రీలందఱు చెవియొగ్గి విని యించుక తత్తఱపడుచున్నారు)

రాజు—(ఆత్మగతము) ఇసీ ! పౌరులు మమ్ము వెదకుచు వచ్చి తపోవనమును గలఁతఁబెట్టుచున్నారు. కానిమ్ము. మే మిఁక వెళ్ళెదము.

సఖులు—ఆర్యా ! యీ యారణ్యకవృత్తాంతము చేతఁ గలఁతఁబొందినాము. పర్ణశాలకుఁ బోవుటకు మా కనుజ్ఞ నిండు.

రాజు—(సంభ్రమముతో) మీరు పోయి రండు. మేమును నాశ్రమమునకెగ్గు జరగకుండునటులఁ బ్రయత్నించెదము.

(అందఱు లేచుచున్నారు)

సఖులు—ఆర్యా ! మీ కతిథిసత్కార మొనర్పని మేము తిరిగి దర్శనమిండని ప్రార్థింప సిగ్గుపడుచున్నాము.

---

* పడెడు. ♦ ముమటియు.

\+ పాయకుడు = రక్షకుడు. కళాపూర్ణోదయము షష్ఠాశ్వాసమున 161 పద్యమున జూడుడు

రాజు.—అట్లనకుఁడు. మీఁగు దర్శన మిచ్చుటయే మాకు సత్కారము.
(శకుంతల రాజును జూచుచు నెపము వెట్టి యాలసించి చెలులతో నిష్క్రమించును.)

రా.—నగరగమనమునుగూర్చి మాకు నుత్సాహము తగ్గుచున్నది. పరివారజనమును గలిసికొని వారిని దపోవనమున కనతిదూరమున విడియించెదను శకుంతలావ్యాపారమునుండి మనసు మఱలింప నా వశము గాకున్నదిగదా! ఏలయన నాకు

క. తనువా! ముందఱ కడుగిడు
మనమా! యపరిచిత మనఁగ మరలుచు బోఁటుల్
అనిలమున కెదురఁగొను కే
తనచీనాంశుకముఁ బోలెఁ దటతట మనుచున్.

(ఇ ట్లందఱు నిష్క్రమింతురు.)

ఇది యాంధ్రీకృతాభిజ్ఞానశాకుంతలమునందలి
ప్రథమాంకము సమాప్తము.



# అభిజ్ఞానశాకుంతలము

## ద్వితీయాంకము

అంతట విషణ్ణుఁ డగు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.

విదూ—(నిట్టూర్పు విడిచి) హా దైవమా! మృగయాసక్తుఁ డగు నీ రాజు సఖ్యమున దుఃఖము దెచ్చుకొంటిని. ఇదిగో మృగము, అదిగో వరాహము; అల్లదె శార్దూల మని మధ్యాహ్నము నందుఁ గూడ వేసవి నల్పచ్ఛాయ లగు వృక్షములక్రింద నొక యడవినుండి మఱియొకయడవికిఁ దిరుగవలసివచ్చినది. ఆకలములు పడి చిశికి వగరెక్కిన వెచ్చని సెలయేటినీళ్ళుఁ ద్రాగవలసి వచ్చినది. వేళకాని వేళలలోఁ దఱచుగఁ గఱుకుట్లతోఁ బొట్ట నింపుకోవలసివచ్చినది. వేటయందు గుఱ్ఱముల వెంబడి పఱుగు లిడుచుండుటచేఁ గీళ్ళు సడలి రాత్రులందు సైతము పడకకుదురక బొత్తుగా నిద్దుర పట్టుటలేదు. ఇంకను దెల్లవాఱలేదు. అప్పుడే తొత్తుకొడుకు లి పిట్టవేటకాండ్రు వలలు గిలలు తీసికొనుచు నడవి నరికట్టఁ జేయు కోలాహలము వలనఁ బట్టిన నిద్ర భంగ మైనది. ఇప్పటికి నింతటితోఁ బీడ తొలఁగిపోలేదు. ఇప్పుడు గోఱుచుట్టుమీఁద రోకంటిపోటు వలె నైనది. నిన్న మేమెవ్వరమునులేనప్పుడు మృగమును వెంబడించుచు నాశ్రమపదముఁ బ్రవేశించిన మా రాజునకు నా దురదృష్టమునఁ దాపసకన్యయగు శకుంతల కంటఁబడినదఁట ఇప్పుడెట్లు నూరికిఁబోవుటయేఁ దలపెట్టఁడు. నేఁడు నామె చింతతోనే రాజునకుఁ దెల్లవాఱినది. ఏమి గతి! మహారాజు కాల్యకృత్యములఁ దీర్చుటతోడనే దర్శింతును. విండ్లు చేఁబూని వనపుష్పమాలికల ధరించిన యవన

స్త్రీలు వెంటరాఁగాఁ బ్రియవయస్యుం డిటకే వచ్చుచున్నాఁడు. కానిమ్ము. అంగభంగవికలునివలె నిలిచెదను. ఇట్లైనను నాకుఁ గొంతవిశ్రాంతి లభించునేమో! (అని కఱ్ఱ నూతఁజేసికొని నిలుచున్నాఁడు.) (పైని వర్ణింపఁబడినట్లు రాజు పరివారముతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

రాజు—గీ. ఎంచఁ బ్రియురాలు సులభకా దెటు తదీయ
భావ దర్శనాశ్వాసి నా స్వాంతమార
కాయజుండు కృతార్థుండు గాని పట్ల
రతి నొసంగుఁ బరస్పర ప్రార్థనంబు.

(మందహాసము చేసి) ఇటులనే కదా! తన యభిప్రాయమున కనుగుణముగ నిష్టజనమనోవృత్తులను గల్పించుకొని కాముకుఁడు నవ్వులపాలగు చున్నాఁడు.

మ. కనియెన్ నిద్దపుఁజూడ్కి వేఱుదెస నక్కంజాక్షి వీక్షించుచున్
జనియెన్ మెల్లఁగ లీలఁగా జఘనవిస్తారంపు భారంబునన్
జనుచోఁ గూడ దటంచు నాఁగు చెలిమిన్నన్ బల్కె సేర్ష్యంబుగాఁ
గన సర్వంబు మదర్థ మద్దిర గనుంగా కామి స్వాత్మీయతన్.

విదూ—(అట్లే నిలుచుండి) సఖుఁడా! నాకుఁ గాలుసేతులు కదలుట లేదు. వాఙ్మాత్రముననే విజయీభవ యని పలుకుచున్నాను.

రా—ఈ యంగవైకల్యము నీ కెట్లు తటస్థించిన దోయి!

విదూ—ఎట్లా! కన్నుఁబొడచిన నీవే కన్నిటి కారణ మడుగుచున్నావు!

రా—నా కేమియుఁ దెలియ లేదు.

వి—సఖుఁడ! ప్రబ్బలిచెట్టు మరిగుజ్జువలె వంగుట స్వప్రభావముచేతనా? నదీవేగము చేతనా?

రా—దానికిఁ గారణము నదీవేగమే.

విదూ—నాకును నీవే కారణము.

రా—అది యెట్లు?

వి—రాచకార్యముల నుజ్జగించి భయంకరమైన యీయరణ్యప్రదేశమందు నీవిట్లడవిద్రిమ్మరివి కావలసి వచ్చినది. నిక్కముపచింతు. ప్రతి

దినము నీ యడవిమృగముల వెంటఁబరుగు లిడుటచేఁ గీళ్లు సడలి యవయవములు నాకు వశముగా కున్నవి. కావున నొక్కదిన మైనను విశ్రమించుటకు నన్ను విడువఁ బ్రార్థించెదను.

రాజు—(స్వగతము)ఇతఁడు నిట్లు చెప్పుచున్నాఁడు. నాకుఁగూడ కాశ్యప సుత తలఁపునకు వచ్చిన వేటమీఁద మనసు పోకున్నది. ఏలయన

గీ. వనిని బ్రియురాలితో సహవాస మమరఁ
గలికి చూడ్కు లక్కలికికిఁ గఱపిన వన
నొప్పు లేళ్ళ నే నేయంగ నోప నకట
యమ్ము దొడిఁగిన బాణాసనమ్ము వంచి.

విదూ—(రాజు మొగముఁ జూచి) మీ రేదియో మనసునఁ బెట్టుకొని యాలోచించుచున్నారు. నేఁ జెప్పిన దంతయు నరణ్యరోదన మయ్యెను.

రాజు—(ఇంచుక నవ్వి) వే తే మున్నది? స్నేహితునిమాట దాఁట గూడనిదిగదా? యని యూరకుంటిని.

విదూ—చిరం జీవ (అని వెళ్ళఁగోరును.)

రాజు—వయస్యా! ఉండుము. ఇంకను జెప్పవలసినమాట యున్నది.

విదూ—దేవర యానతిచ్చెదరుగాక.

రాజు—నీవు శ్రమ తీర్చుకొనుచు ననాయాసమైన యొక కార్యమందు నాకును సహాయపడవలసియున్నది.

విదూ—మోదకభక్షణమునందా యేమి? అయినఁ దీరికయే.

రాజు—ఇదిగో! చెప్పుచున్నాను. ఓరీ! ఎవఁడురా! అక్కడ.

దౌవారికుఁడు—(ప్రవేశించి దండ మిడి) దేవర యాజ్ఞాపింపుఁడు.

రాజు—రైవతకా! సేనాపతి నిటకుఁ బిలుచుకొని రమ్ము.

దౌవా—చిత్తము. (అని నిష్క్రమించి సేనాపతితోఁ దిరిగి ప్రవేశించి సేనాపతితో) దేవర వా రాజ్ఞాపించు నాతురతతో నిటువైపే చూచుచున్నారు. సన్నిధి కరుగుఁడు.

సేనా—(రాజును జూచి) వేట నింద్యమైన నిప్పటికిని మహారాజునెడ కేవలము గుణముగనే పరిణమించినది. ఎట్లన,

మ. అమరం గాననసీమ సంతత ధనుర్జ్యాస్ఫాలనక్రూరపూ
ర్వము నర్కాంశు సహిష్ణువున్ జెమట యల్పంబైన లేకుండి దా
ర్ఢ్యము కల్మిన్ గడు దగ్గియున్ దెలియఁగా రాకున్నదై ప్రాణసా
రమునా మే నిటు కొండయేన్గు వలె వీరల్ దాల్చు రిప్పట్టునన్.

(సమీపించి) ప్రభువులకు జయమగుఁగాక జయ మగుఁగాక! క్రూరమృగములు గదలకుండ నడవి నరికట్టి యుంచితిమి. ఇంక నిక్కడ జాగేల చేసెదరు?

రాజు—వేటను నిందించు మాధవ్యునిచే నుత్సాహరహితునిగాఁ జేయఁబడితిని.

సేనా—(జనాంతికముగ) సఖుఁడా! నీ వా మాటమీఁదనే యుండుము. నేను మహారాజు చిత్తవృత్తి ననుసరించెదను. (ప్రకాశముగ) ఈ మూర్ఖు నాలాగే ప్రేలుచుండ నిండు. నిశ్చయముగా దీనికిఁ బ్రభువులే నిదర్శనము.

ఉ. క్రొవ్వఱి బొజ్జ సన్నగిలి గొబ్బున లేవఁగఁ దేలికౌను మే
నివ్వనసత్త్వధీవికృతు లెల్లఁగనన్ దగుఁ గ్రోధ భీతులం
దవ్వలఁ బాఱు జంతువులఁ దద్దయు నేయుట మెప్పు ధన్వి కిం
కెవ్విధి వేట దూష్య మనుటే మృష యెయ్యెడ నీ వినోదమౌన్.

విదూ—ఓరీ! ప్రోత్సాహకారకుఁడా! పోపొమ్ము. మహారాజిప్పుడు స్వస్థచిత్తుఁడై యున్నాఁడు. నీ వొక యడవి నుండి మఱియొక యడవికిఁ దిరుగుటలో నరనాసిక యం దిష్టము గల యెడ్డె నొక వృద్ధభల్లూకపు వాతఁ బడఁగలవు.

రాజు—భద్రా! సేనాపతీ! మన మాశ్రమ సమీపమునం దున్నాము. ఆ కారణమున నీ మాటల నే నంగీకరింపను. ప్రకృతము,

ఉ. క్రొమ్ముల నీళ్ళ జిమ్ముచును గుంటల దున్నలు మున్గు గాత వృ
క్షమ్ముల నీడ లేళ్ళగమి చర్వితచర్వణముల్ రచించుతన్

నమ్మికఁ బల్వలంబుల ఘనంబుగఁ బందులు ముస్తలెత్తుత,
నెమ్మది నెక్కుడించుటను నేఁటికిఁ గాంచుత నాదు చాపమున్.

సేనా—దేవర చిత్తము వచ్చినట్లు కానిండు.

రాజు—అట్లయిన ముందుపోయిన వనగ్రాహిణుల మఱలింపుము. మన సైనికులు తపోవనమును గలఁతఁ బెట్టకుండునట్లు నివారింపఁ బడుదురుగాక. చూడు.

సీ. శమపరాయణు లగు తపస్విజను లందు
నణఁగియుండు తేజంబు దాహాత్మకంబు
సూర్యకాంతంబు లటు ముట్టఁ జలకనయ్యు
నన్య తేజోభిభవమున నది వెలార్తు.

సేనా—చిత్తము. దేవర యాజ్ఞాపించినట్లే.

విదూ—నీ యుత్సాహవృత్తాంతము భంగమైనదిలే! పో!

(సేనాపతి నిష్క్రమించును.)

రాజు—(పరిజనమును విలోకించి) మీరు వేటవేషమును దీసివేయుఁడు. రైవతకా! నీవు నీ పని మీద నుండుము.

రైవ—దేవర యాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును.)

విదూ—ఒక్కపురుగైన లేకుండఁ జేసితివి. లతలచే మేలుకట్లుగా నొనర్పఁబడి మనోహరముగా నున్న యీ చెట్లనీడను గూర్చుండుము. నేనును సుఖముగఁ గూర్చుండెదను.

రాజు—నీవు ముందు నడువుము.

విదూ—నీవును రమ్ము. (ఇద్దఱుఁ బోయి కూర్చుందురు.)

రాజు—మాధవ్యా! నేత్రసాఫల్యముఁ గాంచక పోతివి. ఏల యనఁ జూడఁదగిన దానినిఁ జూడకపోతివి.

విదూ—నీవు నా యెదుటనే యుంటివిగదా!

రాజు—అందఱు నాత్మీయమును మనోజ్ఞముగ నెంతురు. కాని నేను మాత్రము మాశ్రమమున కంతయు నలంకారమైన శకుంతలను గూర్చి చెప్పుచున్నాను.

విదూ—(స్వగతము) కానిమ్ము. ఇతని కపకాశ మెంతమాత్ర మీయను. (ప్రకాశముగ) చెలికాడా! మునికన్యక నీవు కోరఁదగినదిగాఁ గనపడుచున్నదే!

రాజు—పౌరవులకుఁ బరిహరింపఁదగిన వస్తువులమీఁద మనస్సు పోదు.

గీ. దేవకాంతకుఁ బుట్టి యది విడువంగ
మునికిఁ దొరకుట నతనికిఁ దనయ యయ్యె
నూడి జిల్లేడుపైఁబడి యొప్పుచుండు
నవ్య నవమాలికా ప్రసూనంబువోలె.

విదూ—(నవ్వి) స్త్రీ రత్నములను సరకుఁ గొనని నీ కీ కోరిక పుట్టుట పిండ ఖర్జూరముతో మొగము మొత్తినవానికిఁ జింతపండురుచించినట్లే.

రాజు—నీ వామెను జూడలేదు కావున నిట్లు చెప్పుచున్నావు.

విదూ—అట్లయిన నీకుఁ గూడ నాశ్చర్యమును బుట్టించునది తప్పక రమణీయముగ నుండవలయును.

రాజు—వయస్యా! వేయేల!

గీ. చిత్రమునఁ గూర్చి ప్రాణంబుఁ జేర్చెనో విధి
మదిని నొప్పులకుప్ప నమర్చి నొక్క
మానవతి మేను బ్రహ్మసామర్థ్య మరయ
నూత్నమై తోఁచు నద్ది స్త్రీ రత్నసృష్టి.

విదూ—అట్లయిన రూపవతు లందఱకు నీకఁ బరాభవమే.

రాజు—నా మనస్సులోని మాటయు నిదియే.

మ. కన నాఘ్రాణము సేయనట్టి సుమ మా కల్యాణిరూపంబు చే
తను గిల్లంబడనట్టి పల్లవ మవిద్ధంబైన సద్రత్న మా
నని క్రొందేనియ పుణ్యపూర్ణ ఫలముల్ నా నిర్మలం బౌర యె
వ్వనికిన్ భోగ్యముగా విధాత సమకూర్పన్ జేసెనో నేర్పుమై.

విదూ—గారనూనె జిడ్డోడుచున్నతల గల జడదారిచేతిలో నామె పడక మున్నె యామెను శీఘ్రముగ నేలుకొనుము.

రాజు—ఆమె పరాధీనురాలుగదా! తండ్రియును జెంతలేడు.

విదూ—ఇంతకు నీ యెడల నామె చూపు వల పెట్లున్నది?

రాజు—స్వభావముగానే తపస్వికన్యలు ప్రగల్భురాండ్రు కారు. అట్లయ్యు,

గీ. ఏ నెదురుగా౯గ మఱలించె దృష్టి నొర
కారణాంతర మున్నట్లు కలికి నవ్వె
తద్వినయవారితుం డగు దర్పకుండు
బయలు పడలేదు దాగినవా౯డు గా౯డు.

విదూ—అట్లుగాక చూచిన మాత్రముననే నీతోడ నెక్కనా యేమి?

రాజు—సఖులతో వెళ్ళునపుడు లజ్జావతి యయ్యు నామె తనభావమును స్పష్టముగ౯ బ్రకటించెను. అది యెట్లంటే

గీ. సాగి రెండడ్గు లూరక యా౯గె౯ దన్వి
గ్రుచ్చుకొనె౯ బాదముల౯ గుశాంకుర మటంచు౯
జెట్లకొమ్మల౯ దగులని చీరకొంగు౯
దీసికొను మిష వెనుకకు౯ దిరిగి చూచె.

విదూ—అట్లయిన బత్తెము కట్టుకొని సిద్ధముగ నుండుము. నీవు తపోవనము నుద్యానవనముగ౯ జేసికొన్న ట్లున్నది పో!

రా—సఖు౯డా! కొందఱు తపస్వులు నన్ను గుర్తించినారు. ఏ నెపము మీాద నీ యాశ్రమమున మనము నిలువవచ్చునో నీవు కొంత యాలోచింపుము.

విదూ—రాజవైన నీకు వేఱొక నెప మే మున్నది? తాపసులు నీవారధాన్యమున నాఱవభాగము మాకు౯ గప్పము౯ జెల్లింప వలసిన దని.

రాజు—మూర్ఖు౯డా! రత్నరాసులను సైతము త్రోసిపుచ్చి మనము గ్రహింప౯దగిన కప్పము వీరిని రక్షించుటచే మనకు ముట్టు చున్నది. చూడు.

ఆ. వె. ప్రజ లొసంగు పన్ను పార్థివులకు౯ జూడ
శాశ్వతంబు గాదు జగమునందు
అక్షయము తపమున నాఱవ పాలిత్తు
రాటవికు లిల మాకు నది ధ్రువంబు.

## ద్వితీయాంకము

(తెరలో)

ఆహా మనము కృతార్థులము.

రాజు—(చెవియొగ్గి) ఓహో! యీ ధీర ప్రశాంతస్వరమును బట్టిచూడ వీరు తాపసులు కావలయును.

దౌవారికుఁడు...(ప్రవేశించి) దేవా! జయముగుగాక! జయముగుగాక! ఋషికుమారు లిద్దఱు ద్వారమందు వేచియున్నారు.

రాజు—అట్లయిన వారిని వెంటనే ప్రవేశ పెట్టుము.

దౌవా—ఇదిగో తోడ్కొనివచ్చెదను.

(అని నిష్క్రమించి ఋషికుమారులతోఁ బ్రవేశించి) తమ రిటు దయచేయుఁడు.

(ఉభయులు రాజును జూచుచున్నారు.)

ప్రథముఁడు—కాంతిమంతుఁ డయ్యు నీతఁ డెంత విశ్వసనీయుఁడుగాఁ గనుపట్టు చున్నాఁడు. ఋషులకుఁ దనకు విశేషభేదములేని యీ రాజున కిది తగియే యున్నది. ఏల యన,

ఉ. ఈ నృపుఁ డుండు నాశ్రమ మదెన్నఁగ సర్వజనోపభోగ్యమౌఁ
బూని తపంబుఁ బెంచు దినముల్ బ్రజఁ బ్రోచి యితండు దాంతుఁడౌ
వీనికి రాజపూర్వ మయి వెల్గెడు సన్మునిశబ్దముం బొరిఁ
దా నభ మంటుఁ జారణుల ద్వంద్వము పాడెడు గీతికాతతిన్.

ద్వితీ—గౌతమా! ఇతఁ డింద్రసఖుఁ డగు దుష్యంతుఁడా!

ప్రథ—మ తేమి?

ద్వితీ—అ ట్లగుటనేకదా.

ఉ. వింత యొకింత లే దుదధివేష్టితభూవలయంబు నంత న
త్యంతము నీతఁ డేలు నగరార్గళ బాహువుఁ డోకండె యన్న స్వః
కాంతలు దైత్యవైరమునఁ గాంచు యొనర్త్రిజయంబు నీ ధరా
కాంతు నధిజ్యచాపమునఁ గాశికు వజ్రమునందు నన్న చోన్,

ఉభ—(సమీపించి) మహారాజా! విజయ మగుఁగాక! విజయమగుఁగాక!

రాజు—(ఆసనమునుండి లేచి) మీ కభివాదము చేయుచున్నాను.

ఉభ—నీకు శుభం బగు గాక! (అని ఫలముల నర్పించుచున్నారు.)

రాజు—(నమస్కారపూర్వకముగా గ్రహించి) మీ యాజ్ఞకు వేచి యున్నాను.

ఉభ—తమ రిచట నున్న ట్లాశ్రమవాసులకుఁ దెలిసి మనవి చేసికొను చున్నారు.

రా—ఏమి యాజ్ఞాపించుచున్నారు.

ఉభ—"పూజ్యు లగు కణ్వమహర్షు లాశ్రమమున లేనందున రాక్షసులు మా యజ్ఞములకు విఘ్నము గలిగించుచున్నారు. కావున సారథి సమేతముగ దేవరవారు కొలఁది దినము లాశ్రమమును సనాథ ముగఁ జేయుదురు గావుత మని"

రాజు—అనుగ్రహింపఁ బడినాఁడను.

విదూ—(అపవారించి) ఇప్పు డీ వేడికోలు నీ కనుకూల మైనదే!

రాజు—(చిఱునవ్వుతో) రైవతకా! సారథితో బాణాసనముతో రథమును సిద్ధపఱచి తెమ్మని నేఁ జెప్పినట్లు చెప్పుము.

దౌ—దేవరవా రాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును.)

ఉభ—(హర్షముతో)

క. పెద్దల యాచారం బది
యొద్దిక మై పొల్చు నీకు నొప్పుఁగద యిదే
యద్దిర పౌరవు లన ను
ద్యద్దీక్షితు లార్త రక్షణాధ్వరములలోన్.

రాజు—(అంజలిఁ జేసి) మీరు ముందు సాగుఁడు. నేనును మీ వెంట వచ్చుచున్నాను.

ఉభ—జయ మగుఁగాక! (అని నిష్క్రమింతురు.)

రా—మాధవ్యా! శకుంతలాదర్శన కుతూహలము కలదా!

విదూ — మొదటఁ గుతూహలము పొర్లిపోవుచుండెను గాని యిప్పుడు
రాక్షస వృత్తాంతముచేత నొక్క బొట్టయినను మిగుల లేదు.

రాజు భయపడకుము. నా దగ్గఱనే యుందువు గాని లే.

విదూ—అట్లయిన నీ రాక్షసబాధ యొకటి తప్పినది.

(ప్రవేశించి)

దౌవా—గథ మాయత్తమైనది. దేవర విజయప్రస్థానము నపేక్షించు
చున్నది మఱియు నగరమునుండి దేవేరుల యాజ్ఞను గొని
కరభకుఁడిదె వచ్చియున్నాఁడు.

రాజు—(సాదరముగ) అమ్మగారు పంపినారా యేమి ?

దౌవా —చిత్తము.

రాజు—ఓరీ ప్రవేశపెట్టుము.

దౌవా—చిత్తము. (అని నిష్క్రమించి కరభకునితోఁ బ్రవేశించి)
వారే ప్రభువులు, దగ్గఱకుఁ బొమ్ము.

కరభ—ఏలినవారికి విజయ మగుఁగాక. అమ్మగారి ట్లాజ్ఞాపించు
చున్నారు. "నేటికి నాలవదినమువఱకు నుపవసించి యానాఁడు
పారణఁ జేయఁ దగిన మద్వ్రతసమయమునఁ జిరంజీవి తప్పక
వచ్చి నన్ను సంభావింప వలసిన"దని.

రాజు—ఇటఁ దపస్విజనకార్యము. అట గురుజనుల యాజ్ఞ. రెండును
దాఁటగూడనివే ! ఇపు డేమి చేయవలయును ?

విదూ— త్రిశంకునిం బోలె నంతరాళమున నిలువుము.

రాజు—నిక్కముగ నేను మిక్కిలి కలఁతఁ జెందియున్నాను.

గీ. రెం డవశ్యకృత్యంబులు రెండు చోట్లఁ
జేయఁ దగినవి యగుటచేఁ జిత్త మొందె
ద్వివిధభావంబు నొక మహాద్రిమొదురఁ బ్రతి
హత మగు తరంగిణీప్రవాహంబు వోలె.

(చింతించి) సఖుఁడా ! మా యమ్మగారు నిన్నుఁ బుత్త్రినివలె జూచు
చున్నది. కావున నిక్కడనుండి బయలుదేరి తపస్వికార్యమందు

నా మనస్సు లగ్న మైనట్లు తల్లిగారికి నివేదించి వారికిఁ బుత్రకృత్యము నిర్వహింప నర్హుఁడవు.

విదూ—నన్ను రాక్షసులకు భయపడినవానిఁగాఁ దలంపవుగద!

రాజు—(మందహాసము చేసి) నీ యం దట్టిభావ మెట్లు కలుగఁ గలదు?

విదూ—అట్లయిన రాజుగారి తమ్ముఁడు వెళ్లునట్లు వెళ్ళెదను.

రాజు—తపోవనమునఁ గలఁత లేకుండునట్లు చేయవలయును. కావునఁ బరివారము నందఱ నీతోడఁ బంపెదను.

విదూ—అట్లయిన నిపుడు యువరాజ నైతిని గదా!

రాజు—(తనలో) ఈ బ్రహ్మచారి చపలుఁడు. ఒకవేళ నా కోరిక నంతఃపురములోఁ జెప్పినను జెప్పవచ్చును. కానిమ్ము! ఇతనితో నిట్లు చెప్పెదను. (విదూషకుని హస్తముఁ బట్టుకొని ప్రకాశముగ) వయస్యా! ఋషులయందలి గౌరవమునుబట్టి యాశ్రమమునకుఁ బోవుచున్నాను. తాపసకన్యయందు నా కభిలాష యనునది సత్యముకాదుసుమా! చూడుము.

గీ. హరిణశాబకతతిఁ బెర్గి మరునిమాట
యే నెఱుంగని జన మేడ నేడ మనము
సఖుఁడ! మత్పరిహాసవిజల్పితంబు
నెంచ వలదయ్య పరమార్థ మంచు మదిని.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము



# అభిజ్ఞానశాకుంతలము

## తృతీయాంకము

(అంతటఁ గుశలను దీసికొని కణ్వుని శిష్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శిష్యుఁడు — ఆహా! దుష్యంతమహారాజు మహానుభావుఁడు. పూజ్యుఁడగు నాతఁడు ప్రవేశించినంత మాత్రముననే యాశ్రమానుష్ఠానములు నిర్విఘ్నముగాఁ గొనసాగినవి.

గీ. నారి టంకృతి మాత్రనె దూరమునన
వింటిహుంకృతి నన్నట్లు విఘ్నవితతి
దఱుముచుండెను నీతఁడే దారిఁజూడ
బాణసంధానకథ మఱి పలుక నేల!

వేదికపైఁ బఱచుటకు నీ దర్భలను ఋత్విజుల కొఱకుఁ దీసికొని పోవుచున్నాను. (కొంచెము నడిచి యాకాశమువంకఁ జూచి) ప్రియంవదా! ఈ వట్టివేళ్ళ గంధమును, దూండ్లతో నున్న యీ తామరాకులను నెవ్వరి నిమిత్తము గొనిపోవుచున్నావు? (వినుట నభినయించి) ఏ మనుచున్నావు? ఎండదెబ్బచేత శకుంతల మిక్కిలి యస్వస్థురాలుగా నున్నది. ఆమె శరీరతాపము నివారించుట కనియా! అట్లయిన శీఘ్రముగఁ బొమ్ము. ఆమె కులపతు లగు కణ్వభగవానులకుఁ బ్రాణముకదా! నేనుగూడ యజ్ఞసంబంధమైన తీర్థము నామె కొఱకు గౌతమిచేతఁ బంపెదను. (అని నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

(అంతట రాజు మదనార్తితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

రాజు—(చింతతో నిట్టూర్పు విడిచి)

క. తాపసవీర్యం బెఱుఁగుదు
నా పడఁతి పరవతి యగుట య ట్లెఱుఁగుదు నే
నోప నటులయ్యు హృదయం
బా పేర్మియసినుండి త్రిప్ప హా యే మందున్!

(మదనబాధ నిరూపించి) భగవానుఁడా! కుసుమాయుధుఁడా! నీవును శీతకరుండును గామిజనసమూహము నెంత నమ్మించి మోసపుచ్చుచున్నారు? ఏల యన,

ఉ. నీ సుమసాయకత్వమును నీరజవైరి హిమాంశుకత్వమున్
నా సరివారియం దివి గుణంబులు రెండును గల్ల, మంచు పైఁ
బూసిన స్వాంశుజాలమునఁ బోరనఁ జందురుఁ డగ్గిఁ జల్లు నీ
వే సరి! వజ్రసారముల నేపునఁ జేసెదు పూవుటమ్ములన్.

అటు గాదేని,

కం. కాముఁడు నా మది కనిశము
బాములు కల్పించి యైనఁ బరమహితుండా
నేమన్న నట్టు లేఁచుట
యా మదిరేక్షణను గూర్చియ కదా తలఁపన్.

(కొంత నడిచి) ఇప్పటికి ఋషులయాగము ముగిసినది. సదస్యులచే ననుజ్ఞాతుండనై వచ్చితిని. మేనెల్ల బడలియున్నది. శ్రమపడియున్న నా డెందము నెందు వినోదింపఁజేయుదును! (నిట్టూర్పు విడిచి) ప్రియురాలి దర్శనముకంటె నా కొండొక శరణ మేమున్నది! నే నామెనే వెదకెదను. (సూర్యుని వంకఁ జూచి) ఈ మట్టమధ్యాహ్నసమయమున నెండవేడిమికి శకుంతల చెలికత్తెలతో మాలినీ తీరమునఁ బొదరిండ్లయందుఁ బ్రాయికముగాఁ గాలము గడుపుచుండును. నే నచ్చటికే పోయెదను. (కొంత నడచి స్పర్శసుఖమును రూపించి) ఆహా ప్రకృష్టమైన మారుతముచే నీ ప్రదేశ మెంత మనోహరముగా నున్నది.

గీ. మాలినీతరంగ మాలికాకణవాహి
పద్మసౌరభయుతపవనుఁ డొప్పఁ
గరము గౌఁగిలింపఁ గామసంతప్తాంగ
కముల కెపుడు ప్రీతికరము గాఁగ.

(కొంత నడచి, చూచి) వేపలచే నొప్పు నీ పొదరింట నామెయుండ వలయును. నిజమే. (క్రిందు చూచి)

గీ. ద్వారమం దిచట జఘనభారకలన
మడమవైపున లోతుగ మఱియు వ్రేళ్ళ
వైపునం దేలి నవపదపంక్తి యిదిగో
కానవచ్చెడు శ్వేతసైకతము నందు.

ఈ కొమ్మలనందునుండి చూచుచుండెదను. (ముందు నడచి అట్లొనరించి హర్షముతో) ఆహా! కన్నులపండువైనది. ఇదె నామనోరథప్రియతమురాలు శిలాపట్టముపైఁ గుసుమశయనంబున సఖీజనపరివృతయై యున్నది. అగుఁగాక! వీరి విస్రంభాలాపములు వినుచుండెద.

( అని చూచుచు నిలుచున్నాఁడు. )

(యథోక్తవ్యాపారమున సఖులతో శకుంతల ప్రవేశించుచున్నది.)

సఖులు—(విసరుచు స్నేహాముతో) సఖీ శకుంతలా! నీ కీ పద్మపత్రముల గాలి హాయిగా నున్నదా!

శకు—సఖులారా! విసరుచున్నారా యేమి?

సఖు—(విషాదము నభినయించుచు నొకరి నొకరు చూచుచున్నారు.)

రాజు—శకుంతల మిక్కిలి యస్వస్థ శరీరగాఁ గనఁబడుచున్నది.(వితర్కముతో) ఏమిది? ఎండదెబ్బయై యుండునా! లేక నే ననుకొన్నట్లేనా! (అభిలాషతోఁ దిలకించి) ఇంతయేల? సందేహమే లేదు.

చ. స్తనయుగమం దుశీరమును జారువిశుష్కబిసైక కంకణం
బును గల ప్రేయసీతనువు పొల్పగు మిక్కిలి నొచ్చియేనియుం
మనసిజ ఘర్మపీడల సమం బగుఁ దాపముగాని స్త్రీలయం
దున నిటు దర్శనీయముగఁ దోఁచునె గ్రీష్మకృతాపరాధముల్.

ప్రియం—(జనాంతికముగ) అనసూయా! శకుంతల యీ రాజర్షిని దొలుతఁ జూచినది మొదలు తహతహ పడుచున్న ట్లున్నది. ఈమె యస్వస్థత తన్నిమిత్తంబు కాదుగద!

అన—సఖీ! నాకును మనసున నిట్టి సందేహమే గలదు. అయిన నామె నడిగెదను. (ప్రకాశముగ) సఖీ శకుంతలా! నిన్నొకమాట యడుగవలసియున్నది. నీకు సంతాప మధికముగా నున్నదికదా!

శకు—(పడకనుండి సగము లేచి) సఖీ! ఏమి యడుగఁ దలఁచితివి.

అన—సఖీ! శకుంతలా! మేము మదనవృత్తాంతమునఁ బరిచయము లేనివారముగదా! అట్లయ్యు నితిహాస ప్రబంధములయందుఁ గామార్తుల కే యవస్థ వర్ణింపఁబడినదో యట్టిస్థితిని నీయందుఁ జూచుచున్నాము. నీ సంతాపమున కేమికారణము? చెప్పుము. వ్యాధి నిదానము నిక్కముగ నెఱుఁగక చికిత్సఁ జేయరాదుకదా!

రాజు—నాకుఁగలిగిన యూహయే యనసూయకుఁ గూడఁ గలిగినది. నా యభిప్రాయ ప్రకారమే యిట్లు తోఁచుటకాదు.

శకు—(ఆత్మగతముగ) నా వలపు మిక్కిలి యెక్కువగా నున్నదికదా! ఇప్పటికిని వీరికి శీఘ్రముగాఁ దెలుపఁ జాలకున్నాను.

ప్రియ — సఖీ శకుంతలా! ఈమె చక్కఁగఁ జెప్పినది. నీ వ్యాధి నేల యుపేక్షఁ జేయుచున్నావు? నానాఁటికి నీ యవయవములు కృశించి పోవుచున్నవి. లావణ్యమయమైన చాయ యొక్కటియే నీ శరీరమును వదలకున్నది.

రా—ప్రియంవద యథార్థము పలికినది. అట్లేకదా,

చ. వదనమునందు నెంతయును వాడెఁ గపోలము లక్కునన్ స్తనం
బుఁ దొరగెఁ గర్కశత్వ మది బొత్తుగఁ జిక్కెను గౌను మూపులున్
వదులయి జాఱెఁ దెల్లఁబడె వన్నియ శోచ్యయు దర్శనీయయూ
నిదె కుసుమాయుధార్త యగు నింతి సదాగతి నాకు వాడియున్
ముద మిడు మాధవీలతికఁబోలెఁ గనంబడు నాదు చూడ్కికిన్.

శకు—సఖీ! మఱి యొరుల కెవ్వరికిఁ జెప్పెదను? ఇప్పుడు మీకాయాసము గలుగఁజేసిన దాన నగుదును.

ఉభయులు—కావుననే కదా! నిన్ను నిర్బంధించుట. సఖులతోఁ బంచు
కొన్నప్పుడే సుమా దుఃఖము భరింప నగును.

రాజు —

చ. ఇడుమలయందు సౌఖ్యముల నేకమతిన్ జరియించువారు ద
న్నడుగఁగ బాల యిద్ది హృదయంబున డాఁగిన యాధిహేతువు
న్నుడువకపోదు మాటికి ననుం దమి ము న్నటు మళ్ళి చూచినన్
గడువడి నింతలో శ్రవణకాతరతన్ భ్రమ జెందుదున్ గదా!

శకు—సఖీ! ఏ నాఁడు తపోవనరక్షకుఁడైన రాజర్షి నా కంటఁబడెనో:
(అని సగము చెప్పి లజ్జ నభినయించు చున్నది.)

ఉభ—ప్రియసఖీ! చెప్పుము చెప్పుము.

శకు—అప్పటినుండియు నాతనియందలి యభిలాషచే నీ యవస్థ నొందిన
దాననైతిని.

రాజు—(సంతోషముతో) వినఁదగినది వింటిని.

గీ. జంతు సంతానమునకు గ్రీష్మాంతమందు
నంబుదశ్యామ మైన దినంబువోలె
మారుఁడే నాకుఁ దొలితాపకారణంబు
వాఁడె సౌఖ్యప్రదుం డయ్యె నేఁడు చూడ.

శకు—కాన మీకు సమ్మతమేని నే నెట్లా రాజర్షి యనుగ్రహమునకుఁ
బాత్రురాల నగుదునో యట్లు వర్తింపుఁడు. కాదేని నాకుఁ
దిలోదకమును వదలుఁడు.

రాజు—ఈ మాటతో సందేహము తీరినది.

ప్రియ—(జనాంతికముగ) అనసూయా! మితిమీఱిన మన్మథావస్థ
నొందిన యీమె, కాలహరణము సహింపదు. ఈమె యెవని
యందు బద్ధానురాగయై యుండెనో యతఁడు పూరువంశభూష
ణుండు. కావున నీమె యభిలాష యభినందింపఁ దగియున్నది.

అన—నీవు చెప్పినది సత్యమే.

ప్రియ—(ప్రకాశముగా) సఖీ! అదృష్టవశమున నీ కోరిక యెంతయుఁ

దగియున్నది. సముద్రమును గాదని మహానది మఱి దేనిఁ జేరును? చిగిర్చిన మాధవీలతను సహకారముగాక మఱియొకం డేది భరించును?

రాజు — చంద్రరేఖను విశాఖ లనుసరించుటలో వింత యే మున్నది?

అన — శీఘ్రముగాను, గూఢముగాను మన సఖి మనోరథము నెఱ వేర్చుట కే యుపాయ ముండును?

ప్రియ — గూఢముగాఁ జేయు విషయ మాలోచింపవలెనే గాని, శీఘ్రముగా నొనర్చుట సులభమే.

అన — ఎట్లు?

ప్రియ — స్నేహభావము గల చూపులచే నీమెయం దభిలాషను గనఁ బఱచిన యీ రాజర్షి నిద్రలేక యున్నాళ్ళు కృశించుచున్నట్లు గనపట్టుచున్నాఁడు.

రాజు — నిజముగ నే నట్టులే యైతిని.

చ. మనమున బుట్టు తాపమున మాపున మాపున వెచ్చ నొచు బా
ష్పమున నిడు కంటి కోనఁ బడుచుండెడు నీట వివర్ణరత్నమౌ
కనకపుఁ గంకణంబు గుణఘాతకిణంబుల మీఱి జాఱి పో
యిన మనికట్టునుండి లలి నే నెగఁద్రోయుదు మాటిమాటికిన్.

ప్రియ — (ఆలోచించి) చెలీ! అతని కొక మదనలేఖను వ్రాయునిమ్ము. దానిని బువ్వముల నడుమ దాచి దేవతాప్రసాద మను నెప మున నాతని చేతి కందునట్లు చేసెదను.

అన — ఈ సుకుమారప్రయోగము నాకు నచ్చినది. శకుంతల యేమనునో!

శకుం — మీ నియోగము నెన్నఁడేని కాదంటినా యేమి?

అన — అట్లయినచో స్వవిషయమును వివరముగఁ దెలుపునట్టి లలిత పదబంధనమును యోజింపుము.

శకు — సఖీ! యాలోచించెదను గాని తిరస్కారభయముచే నా చిత్తము త్తలపడుచున్నది.

రాజు—(సంతోషముతో)

గీ. ఎవఁడు నిన్నొల్లఁడని భీరుహృదయ యెంచె
దిదిగొ నిన్గూడు తమి నతఁడిచటఁ గలఁడు
శ్రీనిఁ బ్రార్థింపఁ జేరును జేరకుండు
లక్ష్మియే కోర నెవఁడు దుర్లభుఁడు జగతి.

సఖులు—స్వసౌందర్యము నవమానించుకొను నో శకుంతలా! ఇపుడు దేహతాపశాంతికరం బగు శరత్కాలపు వెన్నెల నెవఁడేనిఁ జేలాంచలమున వారించునా?

శకు—(చిఱునగవుతో) ఇప్పుడు మీరు చెప్పిన పనిలో నున్నాను. (అని కూర్చుండి యాలోచించు చున్నది.)

రాజు—ఱెప్పపాటు మఱచిన కనులతోఁ బ్రియురాలి నవలోకించెదను. ఇది యుక్తమే కదా!

గీ. ఇంతి పదములఁ గూర్చెడు చింత నెత్తు
కన్నుబొమ గల మోమది కంటకితక
పోలమునఁ దెల్పుచున్నది పో! తలంప
నంగనకు నా యెడఁ గల ప్రేమాతిశయము.

శకుం—సఖీ! పద్యమున వ్రాయఁ దగు విషయ మాలోచించితిని. లేఖన సాధనములు దాపున లేవుగదా!

ప్రియ—కీరగర్భకోమల మైన యీ పద్మదళంబున నఖంబులతో నక్షరములఁ లిఖింపుము.

శకుం—(చెప్పినట్లుచేసి) ఇందలి యర్థము చక్కఁగఁ బొందుపఱుపఁబడి యున్నదో లేదో వినుఁడు.

సఖులు—జాగరూకులమై యున్నాము.

శకుం—(చదువుచున్నది.)

క. నే నెఱుఁగను నీ హృదయం
బో నిర్దయహృదయ మరుఁ డహోరాత్రింబుల్

* తా నత్యంతం బేఁచెడు
హా! నినుఁ దమి,గోరు నస్మదంగము లన్నఁ.

రాజు—(సత్వరముగఁ బ్రవేశించి)

గీ. ఇంతి! తపియించు నిను మరుఁ డింతియకద
నన్నఁటన్ననో దహియించు చున్న వాఁడు
వాసరం బది రాజును వాడ్చురీతి
వాడఁజేయదు గద కుముద్వతిని జగతి.

సఖులు—(హర్షముతో) ఈప్సితార్థస్వరూపుఁడ వగు నీకు స్వాగతము.

శకుం—(ప్రత్యుత్థానముఁ జేయ నిచ్ఛగించును.)

రాజు—ఆయాస పడవలదు.

గీ. రమణి! సంసక్తపుష్పాస్తరణము లాశు
శోషిత మృణాళ భంగసంసురభిళములు
గురు పరితాపములు నీదు కోమలాంగ
ము లివి పరికింప నుపచారమునకుఁ దగవు.

అన—ఈశాలిమీాద నొక ప్రదేశము ప్రియవయస్యుఁడలంకరించుఁగాక!

రాజు—(కూర్చుండును. శకుంతల సిగ్గుపడుచుండును.)

ప్రియ—మీా యిరువురకును గల యన్యోన్యానురాగము ప్రత్యక్షమయి
నను సఖీ స్నేహము నన్ను మరల నడుగునట్లు చేయుచున్నది.

రాజు—కల్యాణీ! ఇది మానఁ దగనిది. చెప్పవచ్చినమాట చెప్పకుం
డుట యనుతాపమును గలిగించును.

ప్రి—ఆపన్ను లగు విషయవాసులైన నరుల యార్తి హరించుట మీాకు
ధర్మము.

రాజు—దానికంటె నుత్కృష్టధర్మము రాజునకు లేదు.

ప్రియ—అట్లయిన నీ మా ప్రియసఖి యగు శకుంతల నిన్నుఁగూర్చి
మన్మథునిచే నిట్టి యవస్థఁ బొందింపఁబడినది. కావునఁ గరుణించి
మా చెలి ప్రాణముల నిలువఁబెట్ట నర్హుఁడవు.

---

* (పాఠ) తానుం గడు నేఁచెడుగద.

రాజు—కల్యాణీ! ఈ నీ ప్రార్థన మిరువురకు సమానమే. అన్నివిధముల ననుగ్రహింపఁబడితిని.

శకు—(ప్రియంవదను జూచి) సఖీ! అంతఃపుర జనవిరహముచే వేగుచున్న యీ రాజర్షి నేల ప్రతిబంధించెదవు!

రాజు—గీ. హృదయ సన్నిహితా! మదిరేక్షణా! య
నన్యసక్తంబు నా హృదయంబు దీని
నన్యథా సమర్థించితే నంగజశర
హతుఁడ నైనట్టి నేఁ బునర్హతుఁడ నగుదు.

అన—ఆర్యా! భూకాంతులు బహుకాంతాప్రియు లని వినికిడి. మా ప్రియసఖి బంధుజన శోచనీయ కాకుండున ట్లాదరింపుము.

రాజు—కల్యాణీ! పెక్కుమాటలేల?

గీ. ఎంద ఱేల్లాండ్రు గలిగిన నేమిఫలము
కులము వెలయింప నిరువురే గలరు నాకు
వసధిమేఖలయైన యీ వసుమతియును
మీకుఁ జెలియై చెలంగు నీ మీనాననయన.

ఉభ—ఆనందించితిమి.

ప్రియ—(చూపునిగిడించి) అనసూయా! ఇదిగో లేడిపిల్ల యుత్కంఠతో నిటువైపు చూచుచుఁ దల్లిని వెదకుచున్నది. ఈ పిల్లను దల్లినిఁ జేర్చుదము రమ్ము. (అని యిద్దరు బయలుదేరి పోయెదరు)

శకు—చెలులాలా! నిరాశ్రయురాల నైతిని. మీ యిరువురలో నొకరు నా దగ్గఱకు రండు.

ఉభ—పృథ్వీ కంతకును శరణ మైనవాఁడు నీ సమీపమున నున్నాఁడు. (అని నిష్క్రమింతురు.)

శకు—సఖులు పోనేపోయిరి. ఇఁకెట్లు?

రాజు—సంభ్రమ మేల? నిన్నారాధించు సేవకుఁడు నీ సమీపమునసే యున్నాఁడు.

చ. శ్రీమము నడంపఁజాలు కడుచల్లని పద్మదళంపు తాళవృం
తములను నార్ద్రవాతములఁ దద్దయు వీతునో లేక పద్మరా
గము లగు నీ పదంబుల సుఖంబుగ నో కరభోరు నాదునం
కమునను జేర్చి మత్కరయుగమ్మున సంవహన మ్మొనర్తునో!

శకుం—సమ్మానింపఁ దగినవారి యెడ నపచారము చేయఁజాలను (అని లేచిపో నిచ్ఛగించుచున్నది.)

రాజు—సుందరీ. ఎండవేడి యింకను దగ్గలేదు. నీ శరీరావస్థయు నిట్లున్నది.

ఆ. వె. పద్మనయన పూలపాన్పు, నబ్జదళకృ
తస్తనావరణముఁ దద్దవిడిచి
పంచబాణుబారి బడలు నంగంబుల
నాతపమున నెట్టు లరిగె దీవు.

(అని బలవంతముగా నామెను మరల్చుచున్నాఁడు)

శకుం—పౌరవా! సౌశీల్యము గాపాడుము. మదనపీడిత నైనను నేను స్వతంత్రురాలను కానుగదా!

రాజు—పిరికిదానా! గురుల వలని భయమువలదు. పూజ్యుండును, ధర్మజ్ఞుఁడును నైన కులపతికిఁ దెలిసినను నీయం దిది దోషముగా నెంచఁడు. చూడుము.

కం. తొలి రాచతపసికన్నెలు
పలువురు గాంధర్వ విధినిఁ బరిణీత లనఁ
దలిదండ్రులచే నట వా
రలు నభినందితలు నగఁగ రమణీ వినవే.

శకుం—ఇప్పటికి నన్ను విడువుము. సఖీజనుల యనుమతిఁ బడసి తిరిగి వచ్చెదను.

రాజు—కానిమ్ము! వదలెదను.

శకుం—ఎప్పుడు?

రాజు—గీ. అనుపహత మృదులనవసుమాసవంబు
భృంగ మల్లన నానెడు భంగి సదయ
ముగను నీ యధరామృతంబు తమిదీరఁ
గ్రోలు నవలగద మదమరాళగమన.

(అని యామె ముఖము నెత్తఁబోవును.)

శకుం—(నివారించుట నభినయించును.)

(నే ప థ్య ము న)

ఓ చక్రవాకవధూటీ! నీ సహచరుని వీడ్కొనుము. రాత్రి సమీపించుచున్నది.

శకుం—(సంభ్రమముతో) పౌరవా! సందేహములేదు. నా శరీర వృత్తాంతమును విచారించుటకుఁ బూజ్యురాలగు గౌతమి యిచ్చటికే వచ్చుచున్నది. కావునఁ గొమ్మలచాటున నుండుము.

రాజు—అట్లే (కొమ్మలమరుగున దాగియుండును.)

(అంతట హస్తమునం దొకపాత్ర నుంచుకొని గౌతమి సఖులతోఁ బ్రవేశించుచున్నది.)

సఖులు—అమ్మా గౌతమీ! ఇటు! ఇటు!

గౌతమి—(శకుంతలను సమీపించి) బిడ్డా! నీ శరీరతాపము తగ్గినదా!

శకుం—నాకుఁ గొంత మార్పుకలదు.

గౌతమి—ఈ దర్భోదకముచేత నీ శరీరబాధ యంతయుఁ దొలఁగిపోఁ గలదు. (అని శకుంతల శిరస్సుమీద ప్రోక్షించి) వత్సా! సాయం కాలమైనది. పర్ణశాలకే పోవుదము రమ్మా.

(అని బయలుదేరుదురు.)

శకు—(ఆత్మగతముగ) హృదయమా! ప్రథమమున సుఖముగ మనోరథము లభింపఁగా భీరుత్వమును విడువవైతివి. పశ్చాత్తాప పూర్వక విఘటనమునకు నిప్పుడు నీకు సంతాపమేల? (కొంత నడచి, యచ్చట నిలచి ప్రకాశముగ) సంతాపము నార్చు నో లతాగృహమా! మరల నిన్ననుభవించుటకు వచ్చెదను. అనుజ్ఞ

యిమ్ము. (అని విషాదముతో శకుంతల తక్కినవారితో నిష్క్ర
మించును.)

రాజు—(పూర్వస్థానము ప్రవేశించి నిట్టూర్పు విడిచి) అయ్యో! అభీ
ప్సిత కార్యసాఫల్యమునకు నంతరాయము లుండునుగదా!

* గీ. అసకృదంగుళి సంఛాదితాధరము, ని
షేధవర్ణవిక్లబ సురుచిరము భుజ శి
రోవివ ర్తియౌ పక్ష్మలాక్షీవదనము
నెట్టులో యె త్తియును ముద్దుపెట్టుకొనను.

నే నిప్పు డెచ్చటి కని పోవుదును! ప్రియురా లనుభవించి వదలిన యీ
లతాగృహమునం దిప్పుడు కొంచెముసేపు నిలిచెదను. (కలయఁ
జూచి)

చం. ఇదె శిల దేహసంమృదిత మింతి సుమాస్తరణ మ్మిదే సవా
బ్జదళనఖాంకురార్పితము వాడిన తత్కుసుమాస్త్రలేఖ యి
య్యదె కద తత్కరచ్యుత బిసాభరణం బని చూచి చూచి వే
కదలఁగఁజాల వేతసనికాయము వెల్వడి శూన్య మైననున్.

(ఆకాశమున)

ఓ రాజా!

ఉ. సాయమునందుఁ జేయఁ దగు జన్నము సల్పెడు వేళ నగ్నిహో
త్రాయతనైకవేదిపయి నల్లనె మిక్కిలి భీతిఁ గొల్పుచున్
ఛాయక సంచరించు బహుభంగుల సాంధ్యపయోద పింగళ
చ్ఛాయల రాక్షసౌఘముల చాయలు చూడఁగ నెల్లచాయలన్.

రాజు—ఇదిగో వచ్చుచున్నాను. వచ్చుచున్నాను. (అని నిష్క్ర
మించును).

తృ తీ యాం క ము

సంపూర్ణము.

---

గీ. సారెకధరంబు వ్రేళ్ళచేఁ జాటుచేయు । చస్ఫుటముగ నిషేధవాక్యములఁ బలుకు
చంసమునకుఁ ద్రిప్పెడుపక్ష్మలాక్షి ముద్దు । మోమెటో యె త్తిలినిగాని ముద్దునుగొన.

# అభిజ్ఞానశాకుంతలము

## చతుర్థాంకము

విష్కంభము.

(అంతట సఖు లిద్దఱు పువ్వులు గోయుట యభినయించుచుఁ బ్రవేశించు చున్నారు)

అనసూయ—సఖీ! ప్రియంవదా! మన శకుంతల గాంధర్వ వివాహము చేఁ దగినవరుని బొందిన దని నా చిత్తమునకు సంతోష మేకాని ఇది యొక్కటిమాత్ర మాలోచింప వలయును.

ప్రియ—ఏ మది ?

అన—ఇప్పు డా రాజర్షి యజ్ఞమును బరిసమాప్తముచేసి ఋషులచే ననుజ్ఞ వడసి స్వనగరమును బ్రవేశించి యంతఃపురస్త్రీలం గూడినవాఁడై యిచటి వృత్తాంతమును స్మరించునో లేదో యని.

ప్రియ—నమ్మకము కలిగియుండుము. అట్టి స్వరూపాతిశయము గుణ విరోధముగా నుండదుసుమా! అయినను దండ్రిగా రీ వృత్తాంత మును విని యే మందురో తెలియరాదు.

అన—నాకుఁ దోఁచినంతవఱకు నిది యాయనకు సమ్మతముగనే యుండును.

ప్రియ—ఎట్లు ?

అన—గుణవంతునికిఁ గన్య నీయవలయు ననికదా ప్రథమ సంక ల్పము. దానిని దైవమే సమకూర్చినప్పుడు తండ్రిగా రాయాస పడకయే కృతార్థు లైనారుగదా.

ప్రియ—(పువ్వుల బుట్టను జూచి) సఖీ ! బలికర్మమునకుఁ జాలినన్ని పూవులు కోసితిమి.

అన—చెలీ ! మన ప్రియసఖ యగు శకుంతల సౌభాగ్యదేవతనుగూడ నర్చింపవలెనుగదా !

ప్రియ—ఔను నిజమే ! (అని యీ పనినే యారంభించుచున్నారు.)

(నేపథ్యమున)

ఓహో ! నే నిదె వచ్చినాఁడను.

అన—(చెవి యొగ్గి) సఖీ ! అతిథులమాటవలె నున్నది.

ప్రియ—శకుంతల పర్ణశాల సమీపముననే యున్నది లెమ్ము.

అన—ఇప్పుడు బొత్తిగా నామె మనసు మనసులో లేదు. ఈ పువ్వులు చాలును. (అని బయలు దేరును)

(నేపథ్యమున)

ఓసీ ! అతిథినిఁ బరిభవించినదానా !

గీ. ఎవని నీ వనన్యమతి లోనెంచుచుండి
నను దపోధను నెదుట వచ్చిన యతిథినిఁ
దెలియవో వాఁడు మఱచు నిక్క దెలుపఁబడియు
మత్తుఁడు ప్రథమకృత కథ మఱచుభంగి.

ప్రియ—అక్కటకటా ! అప్రియమే జరిగినది. శూన్యహృదయ యగు శకుంతల పూజనీయుఁ డగు నెవనియెడలనో యపరాధము చేసినది. (ముందునకు దృష్టిని బ్రసరించి) ఎవనియెడలనో యనుకొన నేల ! ముక్కున కోపము గల యీ దుర్వాసమహర్షి యే మన సఖి నట్లు శపించి దుర్వారవేగముతోఁ దిరిగిపోవుచున్నాఁడు.

అన—తగులఁ బెట్టుట కగ్నిదేవునికంటె సామర్థ్య మేరికిఁ గలదు ? పో పొమ్ము. పాదములకు మ్రొక్కి యాయనను మఱలింపుము. ఇంతలో నే నర్ఘ్యోదకమును సమకూర్చెదను.

ప్రియ—ఆలాగే (అని నిష్క్రమించును.)

అనసూ—(ఒక యడుగు నడిచి కాలు జాఱుట నభినయించి) అయ్యో ! వేగముగ నడచుటచేఁ గాలు జాఱినందునఁ జేతినుండి పువ్వుల బుట్ట క్రిందఁబడినది. (అని క్రిందఁబడిన పువ్వుల నేఱుచున్నది.)

(ప్రవేశించి)

ప్రియ—సఖీ ! స్వభావకుటిలుఁడైన యాతఁ డెవ్వరి వేఁడికోలు నంగీకరించును ? అయినను గొంతవఱకుఁ బ్రసన్నునిఁ జేసి వచ్చితిని.

అన—(చిఱునగవుతో) అతనియెడ నదియే పదివేలు; చెప్పుము.

ప్రియ—ఎంతకును మరల నొల్లకుండుటఁ జూచి నే నిట్లు విన్నవించుకొంటిని. "మహాత్మా ! తపఃప్రభావ మెఱుఁగని యీ బిడ్డ చేసిన యొక్క తప్పిదమును మొదటి దని యెంచి మీరు మన్నింపవలె"నని.

అన—తరువాత ! తరువాత !

ప్రియ—అంతట నతఁడు నా వచన మన్యథా జరుగదు. అయిన నానవాలు కొఱ కిచ్చిన యాభరణముఁ జూపుటచేత శాపము నివర్తించు నని చెప్పుచు నంతర్హితుఁ డైనాఁడు.

అన—ఇప్పుడు మన మూఱడిల్ల వచ్చును. ఆ రాజర్షి వెడలిపోవు నప్పుడు స్వనామధేయాక్షరములు గల యుంగరము జ్ఞాపకార్థము, తానే యిచ్చినది యున్నదికదా ! దాన శకుంతల స్వాధీనోపాయయే.

ప్రియ—సఖీ ! రమ్ము, పోదము. దేవకార్యమును నెఱవేర్తము.

(ఇట్లు బయలుదేరుదురు.)

ప్రియ—(చూచి) అనసూయా ! అల్లదే చూడుము. మన ప్రియసఖ యెడమచేతఁ దనవదనము నుంచుకొని చిత్తరువున వ్రాయఁబడిన ట్లున్నది. భర్తమీఁది చింతచేఁ దన్నే తా నెఱుఁగకున్నది. ఇక నాగంతుకునిమాట చెప్పవలెనా ?

అన—ప్రియంవదా! మన నోటిలోనే యీ వృత్తాంత ముండవల

యును సుమా! ప్రకృతికోమల యగు ప్రియసఖి రక్షింపఁ దగినదిగదా!

ప్రియ—వేడినీళ్ళచే విరజాజుల నెవ్వఁడు తడుపును.

(అని నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

(అంతట నిద్రనుండి లేచిన శిష్యుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

శిష్య—ప్రవాసమునుండి వచ్చిన పూజ్యు లగు కాశ్యపులు వేళను జూచి రమ్మని నన్ను నియమించినారు. బయటికిఁ బోయి రాత్రి యింక నెంత యున్నదో చూచెదను. (అని పోయి చూచి,) అయ్యో! తెల్లవాఱినది, ఔను.

ఉ. చనియెడు నోషధీశుఁ డొక చాయను దా నపరాద్రిమీఁదికిన్
దినకరుఁ డొక్క ప్రక్క నరుణేరు ననూరు పురస్సరుండునై
యనయము రెండు తేజములకౌ యుగపద్వ్యసనోదయమ్ములన్
జన ముపదిష్టమౌ నటు నిజమ్ముగ నాత్మదశాంతరమ్ములన్.

మఱియును,

చ. అరయఁగ నా కుముద్వతియె యస్తగిరిన్ శశి చేర నాకుఁ దా
మురిపెము గొల్పుకున్న యది మున్నటు సంస్మరణీయశోభయై
కరము ప్రియప్రవాసమునఁ గల్గెడు నయ్యబలాజనంపు ము
మ్మర మగు బాధ లౌర యతిమాత్ర సుదుస్సహముల్ గదా భువిన్.

(తెఱను దోసికొని ప్రవేశించి)

అన—విషయపరాఙ్ముఖ మైన జనమునకు నిట్టి దెంత తెలియక పోయినను, శకుంతలపట్ల మాత్రము రాజుచే నధర్మమే యాచరింపఁ బడినది.

శిష్య—హోమవేళ సమీపించిన దని గురువునకు నివేదించెదను.

(అని నిష్క్రమించును.)

అన—తెలిసియున్నను నే నేమి చేయఁగలను? ఉచిత మైన నిజకృత్య ములయందుఁగూడ నాకుఁ గాలుసేతు లాడకున్నవి. అనత్య

సంధుఁ డగు రాజు నెడ శూన్యహృదయ యగు మా సఖ కభి లాష కలిగించిన కాముని కోరిక లీడేరును గాక. ఒకవేళ దుర్వాసుశాపంబున నిట్టి మఱపు కలిగెనేమో! అట్లు కాని యెడల నటువంటి మాటలుచెప్పి పోయిన రాజర్షి యిన్ని దిన ముల కొక్కలేఖ నైనఁ బంపియుండఁడా! కావున నిటనుండి యానవాలుగా నొసఁగఁబడిన యుంగరము నతని కంపెదము. ఆహారాదినియమములచేఁ గష్టజీవు లగు నీ ఋషుల యం దెవ్వ రినిఁ బ్రార్థింప నగును! సఖ యందే తప్పుండుటచేఁ బ్రవాసము నుండి వచ్చిన కాశ్యపులకు, దుష్యంతుని వివాహముచేసికొని గర్భవతిగ నున్న శకుంతలఁగూర్చి నివేదింప నోరాడ కున్నది. ఇట్టి సమయమునందు మే మేమి చేయఁదగును?

(ప్రవేశించి)

ప్రియ—(హర్షముతో) సఖీ! మన శకుంతలకుఁ బ్రయాణోత్సవము చేయుటకుఁ ద్వరపడుము! త్వరపడుము.

అన—ఇది యెట్లు సఖీ!

ప్రియ—వినుము. "సుఖముగ నిద్రపట్టినదా!" అని యడుగుటకు నిపుడే శకుంతలయొద్ద కేఁగితిని.

అన—తరువాత! తరువాత!

ప్రియ—అపుడు లజ్జావనతముఖి యగు శకుంతలను కౌఁగిలించుకొని తండ్రి కాశ్యపులే యి ట్లభినందించిరి. "పొగచేఁ గన్నులు కాన రాకున్నను యజమానుని యాహుతి యదృష్టముచే నగ్నిహో త్రినియందే పడినది. బిడ్డా! మంచిశిష్యున కిచ్చిన విద్యవలె నీవు నాకు నిర్విచారముఁ గల్పించితివి. ఇప్పుడే నిన్ను ఋషు లను దోడిచ్చి నీభర్త సమీపమున కనిపెదను.

అన—కాశ్యపుల కీ వృత్తాంతము నెవరు చెప్పిరి?

ప్రియ—అగ్నిశాలను బ్రవేశించిన కణ్వునికి నశరీరవాణి ఛందోబద్ధ మైన వాక్కుచేఁ జెప్పినది.

అన——(విస్మయముతో) ఏ మని చెప్పెను?

ప్రియ——గీ. అగ్నిగర్భశమీలత యట్లు నీదు
దుహిత దుష్యంత భూపతినిహిత తేజ
మవసిమండలైశ్వర్య సంప్రాప్తికొఱకుఁ
దాల్చియున్నది తెలియుమో తాపసేంద్ర!

అన——(ప్రియంవదను కౌఁగిలించుకొని) సఖీ! నాకు సంతోష మైనది. అయిన, శకుంతలను నేఁడే పిలుచుకొని పోవుచున్నా రని యుత్కంఠతోఁగూడిన సంతోషము ననుభవించుచున్నాను.

ప్రియ——సఖీ! మనచింత నెట్లో పోఁగొట్టుకొందము. పాప మీమె సుఖపడుఁగాక.

అన——అట్టయిన నీ చూతశాఖకుఁ దగిల్చిన కొబ్బరియాకుల బుట్టలో నెన్నిదినములైన (వాసన చెడక) నుండు పొగడపూవుల దండ నామెకొఱకు నుంచితిని. కాన దీనిని చేతఁ బుచ్చుకొనుము. నేనుగూడ నీలోపల నామెకై గోరోచనతీర్థమృత్తికా దూర్వాంకురములు మొదలగు మంగళానులేపనముల సిద్ధము చేసెదను.

ప్రియ——అట్లే చేయుము.

(అనసూయ నిష్క్రమించును. ప్రియంవద పువ్వులు కోయుట యభినయించుచున్నది.)

(నే ప థ్య ము న)

గౌతమీ! శార్ఙ్గరవమిశ్రులకు శకుంతలను గొంపోవ నాజ్ఞాపింపుము.

ప్రియ——(చెవి యొగ్గి) త్వరపడుము! అనసూయా! త్వరపడుము! ఇదిగో వీరే హస్తినాపురమున కేఁగు ఋషులు కేకలు వేయుచున్నారు.

(మంగళానులేపనములఁ జేత నుంచుకొని ప్రవేశించి)

అన——సఖీ! రమ్ము పోదము. (అని వెళ్ళును)

ప్రియ——ఇదిగో! శకుంతల సూర్యోదయమునకే యభ్యంజన స్నానమాచరించి నీవారాక్షతలు చేతఁబూని యాశీర్వదించు తాపస

స్త్రీలచేఁ గొనియాడఁబడు చున్నది. ఈమె దగ్గఱకుఁ బోవు
దము రమ్ము. (అని సమీపింతురు.)

(అంతట నిదివఱకుఁ జెప్పఁబడి న ట్లాసీనయై శకుంతల
ప్రవేశించుచున్నది.)

ఒక తాపసి —(శకుంతల నుద్దేశించి) పుత్రీ! భర్తృగౌరవ సూచక మైన
పట్టమహిషీబిరుదమును బడయుము.

రెండవది—వత్సా ! వీరమాతవు కమ్ము !

మూడవది—పగనిమన్ననఁ బడయుము.

(ఇట్లాశీర్వదించి గౌతమితక్కఁ దక్కినవారలు నిష్క్రమింతురు)

సఖులు—(సమీపించి) సఖీ ! నీకు సుఖాభిషేక మగుఁగాక !

శకుంతల—సఖులకు స్వాగతము. రండు, ఇటుఁ గూర్చుండుఁడు.

ఉభ—(శోభనపుష్పాది భాజనములఁ దెచ్చి కూర్చుండి) సఖీ ! సిద్ధ
ముగా నుండుము. ఇదె నీకు మంగళాంగరాగము నలందెదము.

శకుం—ఇదియును నాకు మిక్కిలి యాదరణీయము ! ఇఁక సఖుల
యలంకరణము నాకు దుర్లభ మయ్యెడినిగదా ! (అని కన్నీటిని
విడుచుచున్నది.)

ఉభ— శుభసమయమునం దిట్లేడ్చుట నీకు నుచితము కాదు. (అని
కన్నీటినిఁ దుడిచి యలంకరించుట యభినయింతురు.)

ప్రియ—భూషణార్హ మైన నీ సౌందర్య మాశ్రిమ సులభము లైన
యలంకారములచే వికారము నొందుచున్నది.

(కానుకలను జేతఁ బట్టుకొన్నవారై యిరువురు ఋషికుమారులు
ప్రవేశించి)

ఉభ—ఇవిగో సొమ్ములు. పూజ్యురా లగు శకుంతల నలంకరింపుఁడు.
(అందఱు చూచి యాశ్చర్యపడుదురు)

గౌతమి—వత్సా ! నారదా ! ఇవి యెక్కడివి ?

ప్రథము—తండ్రి కాశ్యపుల ప్రభావముల వలనఁ గలిగినవి.

గౌతమి—మానససిద్ధివలననా యేమి ?

ద్వితీ—అటు కాదు వినుఁడు. శకుంతల నిమిత్తము వృక్షములనుండి కుసుమములఁ దెమ్మని తండ్రిగారు మాకు నాజ్ఞాపించినారు. అంత నిప్పుడు,

మ. తరు వొం డిచ్చెను జంద్రపాండురలసత్క్షౌమంబు మాంగళ్యముం
జరణాలంకరణైకయోగ్య మగు లాక్షన్ వృక్ష మొం డిచ్చె నా
భరణంబుల్ పెర లిచ్చెఁ దత్కిసలయాభన్ మించు నా పర్వ ని
స్సరణాంచద్వనదేవతాకరతలాబ్జాతంబులన్ బ్రీతిమై.

ప్రియ—(శకుంతలను జూచి) సఖీ! యీ యనుగ్రహ విశేషముచేత నీవు భర్తృగృహమునం దనుభవింపఁ దగిన రాజ్యలక్ష్మి సూచింపఁబడినది.

(శకుంతల సిగ్గుపడుట నభినయించును)

ప్రథ—గౌతమా, రమ్ము, రమ్ము, స్నానార్థ మేగిన కాశ్యపులకు వనస్పతి సేవను నివేదింతము.

ద్వితీ—అట్లే, (అని యిరువురు నిష్క్రమింతురు.)

సఖులు—సఖీ! మేము భూషణముల నుపయోగించిన వారము కాము. చిత్రకర్మపరిచయముచే నీ యంగకముల నీ సొమ్ములచే నలంకరింతుము.

శకు—మీ నైపుణ్యము నే నెఱుఁగుదును.

(ఉభయులు నలంకరించుట యభినయింతురు.)

(అంతట స్నానము చేసి వచ్చిన కాశ్యపుఁడు ప్రవేశించును.)

కాశ్యపుఁడు—

శా. ఏగు న్నేఁడిదె తా శకుంతల యనన్ హృత్సీమ నుత్కంఠ యా
నాఁగన్ బాష్పము లెల్లు రాల్పడియె మాంద్యంబందెఁ జూడ్కిన్ వగన్
రాగం బాకులపెట్టు నన్నె యిటరణ్యస్థున్, గటా, యింక నే
లాగున్ గేస్తులు వంత నోర్తురొకో పిల్లన్ గ్రొత్తఁగాఁ బంపుచోన్.

(అని నడచుచున్నాఁడు.)

సఖులు—సఖీ ! శకుంతలా ! అలంకరణమైనది. ఇప్పు డీ పట్టుబట్టలజత ధరింపుము.

(శకుంతల లేచి ధరించును.)

గౌతమి—కుమారీ, ఇదిగో నీ తండ్రి యానందప్రవాహము పొరలు నేత్రములతో నాలింగనము చేయువాని వలె వచ్చుచున్నాఁడు. ఆచారము చొప్పున మెలంగుము.

శకు—(సిగ్గుతో) తండ్రీ, వందనము.

కాశ్య—పుత్త్రీ !

క. అల శర్మిష్ఠ యయాతికి
వలె నీ భర్తకును నీవు బహుమత వగుమా
యెలనాఁగ మున్ను పూరుం
బలె సుతునిఁ నీవుఁ జక్రవర్తినిఁ గనుమా.

గౌతమి—స్వామీ, ఇది వరమే కాని యాశీర్వాదము కాదు.

కాశ్య—వత్సా ! ఇప్పు డీ హోమము చేసిన యగ్నులకు నిటు ప్రదక్షిణము చేయుము.

(అందఱు పరిక్రమించుచున్నారు.)

కాశ్య—(ఋక్ఛందస్సు చేత నాశీర్వదించు చున్నాఁడు.)

గీ. విరచితస్థానములు గల్గి వేది నంత
ట సమిధలు వెలుఁగ నలుగడలను గుశలు
పఱల హవ్యగంధమ్ములఁ బాపచయముఁ
బాఱఁ దోలెడు వైతానవహ్ను లివియు
పావని నొనర్చుఁగావుత బాల నిన్ను.

ఇఁక బయలు దేరుము.

(దృష్టిప్రసారము చేసి) ఆ శార్ఙ్గరవ మిశ్రు లెక్కడ ?

(ప్రవేశించి)

శిష్యుఁడు—దేవా ! ఇదె వచ్చితిమి.

కాశ్య—మీ చెల్లెలికి మార్గమును జూపుఁడు.

శార్ఙ్గరవుఁడు—అమ్మా ! ఇటు ! ఇటు !

(అందఱును నడిచెదరు)

కాశ్య—ఓహో ! సమీప తపోవనవృక్షములారా !

మ. తొలుతన్ మీరు గ్రహింప కెవ్వరితె తాఁదోయంబులం గ్రోలదో
తలి రే స్త్రీ ప్రియభూష యయ్యును భవత్సఖ్యంబునన్ గోయదో
యలరుల్ పుట్టఁగఁ దొల్త మీ కెవతె కౌ నానంద మా యీ శకుం
తల పాణిగ్రహణేశ్వరు నింటి కేగెడు ననుజ్ఞన్ మీర లిం డెల్లరున్.

(కోకిలరవమును సూచించి)

క. ఈ వినఁబడు కోకిలకల
రావమునం బ్రతివచనము రా ననుమతయౌఁ
దా వెడల నీ శకుంతల
యీ వనసంవాసబంధువృక్షంబులచేన్.

(ఆకాశమున)

శా. అందందున్ నళినీహరిత్సరసు లత్యాహ్లాదమున్ గూర్ప శో
కం దీవ్రార్కమయూఖతాపమును వృక్షచ్ఛాయ వారింపఁగాఁ
గ్రిందన్ పద్మపరాగ మట్లు మృదువౌ కెంధూళిపర్వన్ పథం
బందంబై హితశాంతమారుతమునై యాత్రన్ శివం బీమెకున్.

(అందఱు నాశ్చర్యముతో వినుచున్నారు.)

గౌ—బిడ్డా! బాంధవజన స్నేహము గల తపోవనదేవతలచేఁ బోననుజ్ఞ వడసితివి. దేవతలకు నమస్కరింపుము.

శకు—నమస్కార పూర్వకముగా నడచి (జనాంతికముగ) సఖీ! ప్రియంవదా! ఆర్యపుత్రుని దర్శింప నుత్కంఠ కలిగినను నాశ్రమమును వీడు దుఃఖముచే నా యడుగులు ముందుకుఁ గష్టముమీఁద సాగుచున్నవి.

ప్రియ—సఖిమాత్రమే తపోవనమును విడుచుటకు దుఃఖించుట కాదు. నిన్నెడఁబాయు నున్న యీ తపోవనమునకును నట్టి యవస్థయే కానఁబడుచున్నది.

ఆ. వె. జార్చు హరిణములు కుశగ్రాసముల నోట
నాట మాని నెమ్మ లట్టె నిలుచు
నశ్రువులను రాల్చు నట్టుల వనలతల్
గళితధవళపత్రము లగుఁ జువ్వె.

శకు—(జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని) తండ్రీ! లతాభగిని వనజ్యోత్స్నను వీడ్కొని వచ్చెదను.

కాశ్య—వనజ్యోత్స్న యెడల నీకు సహజస్నేహము కలదని నాకుఁ దెలియును. ఇదిగో నీకుఁ గుడివైపున నున్నది.

శకు—(లతను సమీపించి) వనజ్యోత్స్నా! చూతవృక్షముతోఁ గూడు కొని యున్నను నిటువైపునకుఁ బర్విన శాఖాబాహువులతో నన్నాలింగనము చేసికొమ్ము. ఇఁకమీఁద నీకు నే దూరస్థురాల నయ్యెదను గదా!

కాశ్య—

గీ. తొలుత నే నీ కొఱకెటు నేఁ దలఁతు నట్లు
తగినవరు నందితివి సుకృతమున నీవు
మావిఁ బొందిన దీ నవమాలికయును
దీఱె నా కిప్డు నీ చింత దీని చింత.

ఇఁక బయలుదేఱుము.

శకు—(సఖులతో) సఖులారా! దీనిని మీ యిద్దఱిచేతులలో నొప్పగించుచున్నాను.

సఖులు—సఖీ! మమ్ముల నెవరి చేతి కప్పగించెదవు? (అని కన్నీటిని విడుచుచున్నారు.)

కాశ్య—అనసూయా! ఏడుపుఁ జాలింపుము. మీ రిద్దఱే శకుంతలను ధైర్యవంతురాలుగఁ జేయవలెను.

(అందఱు నడుచుచున్నారు.)

శకు—తండ్రీ! మన పర్ణశాల సమీపమునందు గర్భధారణముచే మెల్లఁగా సంచరించుచున్న యీ యాఁడుజింక ప్రసవింపఁగానే నా కా ప్రియ వృత్తాంతము నివేదించుట కెవనినైనఁ బంపుము.

కాశ్య—దీనిని మఱచిపోము.

శకుం—(గతిభంగము నభినయించి) ఎవరిది? నా చీరకొంగుఁబట్టి లాగుచున్నారు? (అని వెనుకకు మఱలుచున్నది.)

కాశ్య—కుమారీ?

ఆ. వె. దర్భసూచి నోరఁదవుల గాయము మాన్పఁ
బూసి గారనూనె ముష్టిఁ జామ
బిడుచుఁ బెంచుకొనెదొ కొడుకుఁగా నే లేడి
నీదు పథము విడువ లే ద దిదియ.

శకుం—బిడ్డా! సహవాసులఁ బరిత్యజించు నన్నేల యనుసరించెదవు? పుట్టినప్పుడే తల్లిచే విడువఁబడి నాచేఁ బెంపఁబడితివి. మఱి నాచే విడువఁబడిన నిన్నిపుడు తండ్రి విచారించును. ఇఁక మఱలి పొమ్ము. (అని యేడ్చుచు బయలుదేరును.)

కాశ్య— గీ. తెప్పలెత్తు కనులఁ గప్పి దృష్టిని నాఁగు
* బాష్పవితతి స్థిరతఁబాపు మెచ్చు
తగ్గులు గన కీ పథంబున నడచినఁ
దడఁబడుగద నీకు నడుగు లబల!.

శార్ఙ్గరవుఁడు—దేవా! బంధుజను లుదకసమీప ప్రదేశమువఱకే యనుసరింపఁదగు నని శాస్త్రము. ఇదిగో చెఱువుగట్టు. కావునఁ జెప్పవలసిన వన్నియుఁ జెప్పి మఱలుట యుక్తము.

కాశ్య—అట్లయిన నీ యశ్వత్థవృక్షపునీడ కరుగుదము.

(అందఱు నడచి నిలుచుచున్నారు.)

కాశ్య—(ఆత్మగతముగ) పూజ్యుఁ డగు దుష్యంతుని కెట్టి సందేశము పంపఁదగి యుండునో కదా? (అని యాలోచించుచున్నాఁడు)

---

* బాష్పవితతి స్థిరతఁ బాపు కొన । కెచ్చుతగ్గు లున్న నీ పథాన నడువ

శకుం—(జనాంతికముగ) సఖీ చూడుము! ఈ చక్రవాకి తామరాకుల చాటుననే యున్నను దనసహచరునిఁ జూడఁజాలక యాతురతతో నేను దుష్కరకార్య మొనర్చుచున్నా నని యఱచుచున్నది.

అన—సఖీ యట్లు చెప్పకుము.

గీ. ప్రియుని నెడబాసియును నిది విరహదుఃఖ
దీర్ఘతరరాత్రి యెట్టెట్లొ తివిరి గడుపు
నెంత దుర్భర మైనట్టి దేని విప్ర
యోగబాధ నాశాబంధ మోర్వఁజేయు.

కాశ్య—శార్ఙ్గరవా! నీ వా రాజుతో నా మాటలుగా శకుంతలను బురస్కరించుకొని యిట్లు చెప్పుము.

శార్ఙ్గరవుఁడు—దేవర యాజ్ఞాపింతురుగాక!

కాశ్య—

ఉ. మమ్ముఁ దపోధనాఢ్యుల సమంచితరీతిఁ దలంచి యెంచి స్వీ
య మ్మగు సత్కులమ్ము నల యయ్యది నీ యెడ నీమె కెట్లొ చు
ట్టమ్ము లెఱుంగకుండఁ గడు డక్కిన కూర్మి గణించి దీని న్యా
యమ్మ సపత్నులట్ల గన నవ్వల గల్గు ఫలం బదెల్ల భా
గ్యమ్మునఁ జుమ్ము దాని నగునా! వచియింపఁగ నింతి బందుగుల్.

శార్ఙ్గర—సందేశము గ్రహించితిని.

కాశ్య—కుమారీ! ఇప్పుడు నీకు బుద్ధులు గఱపవలసి యున్నది. వనవాసులముగా నుండి యున్నను మేము లౌకికజ్ఞానము గల వారము సుమా.

శార్ఙ్గర—ధీమంతులకు గోచరింపని విషయమే లేదు గదా!

కాశ్య—అట్టి నీ విక్కడ నుండి నీ పతిగృహమును బ్రవేశించి,

మ. గురుశుశ్రూష యొనర్పుమా సవతులన్ గొమ్మా సఖీవృత్తితో
వరుఁ డే భంగ మొనర్చనే నలుక మార్వల్కన్న దే మానుమా
పరివారంబు గడుం గృపం గనుము సంపద్గర్వము స్వీడు తా
ల్తురు రామల్ గృహిణీపదం బిటు పెరల్ చూడన్ గులాధుల్ గదా.

గౌతమి యెటు తలంచుచున్నదో కదా.

గౌతమి—వధూజనుల కుపదేశ మింతమాత్రమే. కుమారీ! దీని నంతయు శ్రద్ధతో మనమున నుంచుకొనుము.

కాశ్య—బిడ్డా! నన్నును సఖీజనమ్మును గౌఁగిలించుకొనుము.

శకుం—తండ్రీ! ఇచ్చటనుండియే ప్రియంవద మొదలగు నా సఖులు మఱలిపోయెద రా యేమి?

కాశ్య—బిడ్డా! వీరు గూడ నొకరి కీయవలసిన వారు గదా! వీ రిద్దఱు నచటికి వచ్చుట యుక్తము కాదు. నీతో గౌతమి వచ్చును.

శకుం—(తండ్రిని గౌఁగిలించుకొని) మలయతటము నుండి పెరికి పార వేయఁబడిన చందనలతవలెఁ దండ్రి యొడినుండి పరిచ్యుతనై దేశాంతరమున నా జీవముల నిపు డెట్టు తాల్తునో కదా.

కాశ్య—కుమారీ! ఏ మిట్లు భయపడుచున్నావు?

మ. ఖ్యాతిన్ సత్కులసూతియౌ పతికి నిల్లాలై సదా నల్పుచో
నీతిన్ దద్విభవోరుకృత్యముల నెంతే నాకులీభూతవై
పూతున్ బుత్రునిఁ బ్రాచి యర్కు నటులన్ ముద్దార వేగాంచి నీ
చేతం బందున నన్నుఁ బాయు వగపుల్ జింతింపఁబో వమ్మరో.

శకుంతల—తండ్రి పాదములపైఁ బడుచున్నది.

కాశ్య—వాంఛితార్థసిద్ధి నీ కగుఁగాక.

శకుం—(సఖులను సమీపించి) సఖులారా! మీ రిద్ద ఱొక్కసారిగ నన్నుం గౌఁగిలించుకొనుఁడు.

సఖులు—(అట్లు చేసి) సఖీ! రాజు నిన్నొకవేళ గుర్తించుట కాలసించె నేని యప్పు డాతని కాత్మనామధేయాంకిత మైన యీ యుంగరమును జూపుము.

శకుం—ఈ మీ సందేహము చేత నాకుఁ గంపము కలుగుచున్నది.

సఖులు—భయపడకుము. అతిస్నేహ మెప్పుడు ననర్థముల శంకించుచుండును.

శార్ఙ్గర—జాము ప్రొద్దెక్కినది. అమ్మా! త్వరపడవలయును.

శకుం—(ఆశ్రమమున కెదురుగ నిలచి) తండ్రీ! మఱల నీ తపోవనము నెప్పుడు కాంచెదనో.

కాశ్య—వినుము.

గీ. చాలకాలంబు సవతివై సకలమహికి
సప్రతిరథుఁ దనూజు దౌష్యంతి నిలిపి
తన్నిహితకుటుంబభరుని ధవునిఁగూడి
మఱల వచ్చెదీ శాంతాశ్రమమున కబల.

గౌతమి—బిడ్డా! ప్రయాణసమయ మతిక్రమించుచున్నది. తండ్రినిఁ బంపుము. (కణ్వునితో) దేవా! ఎంతకాల మైన నీమె యిటులే మఱల మఱలఁ జెప్పుచుండును. మీరు తిరిగిపొండు.

కాశ్య—కుమారీ! మా తపోనుష్ఠానముల కాటంకము కలుగుచున్నది.

శకుం—(మఱలఁ దండ్రినిఁ గౌఁగిలించుకొని) తండ్రీ! శరీరము తపస్సుఁ జేయుటచే శుష్కించియున్నది. కావున మఱల నా కొఱకెక్కువగ నుత్కంఠఁ జెందకుము.

కాశ్య—(నిట్టూర్పుతో)

గీ. మున్ను నీ వుటజద్వారమున నునిచిన
నివ్వరపుబలి మొలకలు నిగుడుచుండఁ
గన్నులారంగఁ గాంచు నా కెన్న నెద్ది
దుఃఖశమనంబు గల్గెడు తొల్లివ వత్స.

నడువుము. నీ పథంబు శివం బగుఁగాక (కూడ వెడలువారలతో శకుంతల నిష్క్రమించును.)

సఖులు—(శకుంతల పోయినదిక్కుఁ జూచి) అక్కటకటా! శకుంతల చెట్లసమూహములో నంతర్హిత యైనది.

కాశ్య—(నిట్టూర్పు విడచి) అనసూయా! మీ సహచారిణి వెళ్ళిపోయినది. మీ దుఃఖము నణఁచుకొని నాతోఁగూడ నాశ్రమమునకు రండు.

ఉభ—తండ్రీ! శకుంతల లేమిఁ బాడువడిన ట్లున్న తపోవనము నెట్లు ప్రవేశింతుము?

కాశ్య—స్నేహప్రవృత్తిచే నిట్లు కనిపించుచున్నది. (విచారముతో నడిచి) అమ్మయ్యా! శకుంతల నత్తవారింటికిఁ బంపి యిప్పుడు స్వస్థతఁ గాంచితిని. బిడ్డలారా! ఎట్లనఁగా,

గీ. ఆఁడుపిల్ల యొరునిసొత్తె యగుట దానిఁ
బ్రతిగృహీతకుఁ జేర్పంగఁ బంపి యిపుడు
స్వామి కిల్లడ నిచ్చినవాని భంగి
నెంతయును నిర్మల మగు నా యంతరాత్మ.

(అని యందఱు బయలుదేరి పోవుదురు.)

ఇది చతుర్థాంకము

సంపూర్ణము.



# అభిజ్ఞాన శాకుంతలము

## పంచమాంకము

అంతట నాసనస్థుఁడైన రాజు, విదూషకుఁడు ప్రవేశింతురు.

విదూ——(చెవి యొగ్గి) సఖా! సంగీతశాల వైపు నాలకింపుము. అవ్యక్త మధుర మైన శుద్ధగీతికయందు స్వరసంయోగము వినవచ్చు చున్నది. ఆఁ! తెలిసినది. పూజ్యురాలగు హంసపదిక వర్ణము లభ్యసించుచున్నది.

రాజు——ఊరకుండుము. నే వినియెదను.

(ఆకసమునఁ బాట వినఁబడుచున్నది.)

* ఆ. వె. చూతమంజరి నటు నూతనాసవపాన
లోలుపుఁడవు నీవు గ్రోలి గ్రోలి
కమలవసతిమాత్రిఁ గడు నిర్వృతిం జెంది
మఱచి తెట్లు దాని మధుకరంబ.

రాజు——ఔర! గీతి, రాగపరివాహిని!

విదూ——ఏమీ! ఈగానము నందలి యక్షరముల యర్థము గ్రహించితివా!

రాజు——(చిఱునవ్వునవ్వి) ఈమెతో నొకప్పుడు స్నేహము చేసితిని. అట్లగుట దేవేరి వసుమతి నుద్దేశించి నన్నుపాలంభించు చున్నట్లు తెలిసికొంటిని. మిత్రమా! మాధవ్యా! హంసపదికతో "నేర్పుగా నెత్తి పొడిచితి" వని నా మాటలుగాఁ జెప్పుము.

విదూ——దేవర యాజ్ఞాపించినట్లే (అని లేచి) సఖుఁడా! ఆమె నన్ను నితరులచేతఁ జుట్టు పట్టించి కొట్టింప, నప్సరసచేతిలోని విరాగికివలె నా కిపుడు మఱి మోక్షము కలుగదు.

---

* మత్తకోకిల——నూతనాసవ లోలుపుండవు నోటివిందుగ నీవు మున్ జూతమంజరి నవ్విధంబునఁ జుంబన మ్మొనరించి యు
బ్జాతగర్భనివాసమాత్రి నపారనిర్వృతి నొంది యే
రీతి దాని స్మరింపకుంటి వరే ద్విరేఫ! విశాళిమై.

రాజు—హామ్మా! ఆమెకు నాగరికవృత్తితోఁ జెప్పుము.

విదూ—హా! యేమిగతి? (అని నిష్క్రమించును.)

రాజు—(ఆత్మగతముగ) ఈ గీతార్థము నాకర్ణించి ప్రియజనవియోగము లేకున్నను, మిక్కిలి యుత్కంఠితుఁడ నగుచున్నాను. కా కేమి?

గీ. మధురవాక్కుల వినుచు, రమ్యములఁ గనుచు
నరుఁడు సుఖియయ్యు నుత్కంఠ నలుగు నెడ, న
బోధపూర్వంబుగాఁ జిత్తమున స్మరించు
స్వాత్మగత పూర్వజన్మ సఖ్యముల నిజము.

(అని యేమియుఁ దోఁపనివాని వలె నిలువఁబడును.)

(అంతఁ గంచుకి ప్రవేశించును.)

కంచు—ఔరా! నే నిట్టి స్థితికి వచ్చితినిగదా!

చ. అవహితుఁడైన నేను నృపు నంతిపురిం గులధర్మ మంచు ము
న్నవిరతిఁ దాల్చు నెద్ది కరమందున నద్దియె వేత్రయష్టి తా
దివసము లేగ నేగఁ గలదిట్టము నేగఁగ దారి నేగుచో
నవశతఁ గాళ్లు తొట్రువడ నద్దిర నా కిపు డూఁతకఱ్ఱయో.

ఓహో! రాజునకు ధర్మకార్యము బొత్తుగ నతిక్రమింపరానిది గదా! ఐనను నిప్పుడే ధర్మాసనమునుండి లేచిన రాజునకు మఱల నిర్బంధకరమైన కణ్వశిష్యుల రాక విజ్ఞాపనము చేయుటకు బుద్ధిపుట్ట కున్నది. ఇంతకును లోకతంత్రాధికారమునకు విశ్రాంతి లేదు కదా! ఎట్లన,

గీ. ఏకవారసన్నద్ధాశ్వుఁడే యినుండు
పగలు రాత్రియుఁ దిరుగుఁ బ్రభంజనుండు
పాపతేఁ డెప్డు డీ భూమిభరముఁ దాల్చు
నిదియు ధర్మంబు షష్ఠాంశవృత్తి కగును.

కావున నా పని నే నెఱవేర్తును. (నడిచి ముందునకుఁ జూచి) ఇదిగో మహారాజు.

ఆ. వె. కరిఘటలను నడిపి కరిరాజు పగ లెండ
నలసి చల్లనియెడ నిలిచినట్లు
నిజతనూజు లట్ల ప్రజ నేలి నిర్జన
స్థలము నాశ్రయించె స్వస్థుఁ డగుచు.

(సమీపించి) దేవరవారికి జయము జయము. హిమాలయము నకు దాపున నున్న యరణ్యవాసు లైన మునులు కణ్వుని సందేశమును గొని స్త్రీలతో వచ్చియున్నవారు. దేవర చిత్తగింతురుగాక.

రాజు—(సాదరముగ) ఏమీ! కాశ్యపుని సందేశముఁ గొనివచ్చిన వారా!

కంచు—చిత్తము.

రాజు—అయిన నీ యాశ్రమవాసులను శ్రౌతవిధిచే స్వయముగ సత్కరించి ప్రవేశపెట్టు మని నా మాటలుగా నుపాధ్యాయు లగు సోమరాతునితోఁ జెప్పుము. నేను గూడ తపస్విజనులను దర్శించుటకు నుచిత మైన ప్రదేశమునం దుండి వారికై నిరీక్షించుచుండెదను.

కంచుకి—దేవర యాజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించును.)

రాజు—(లేచి) వేత్రవతీ! అగ్నిహోత్రశాలకు దారిఁ జూపుము.

ప్రతీహారి—ఇటు! ఇటు! దేవా!

రాజు—(నడిచి, యధికారదుఃఖమును నిరూపించి) సర్వప్రాణులును గోరిన ప్రయోజనములు సమకూరినప్పుడు సుఖపడుచున్నారు. రాజుల కన్ననో! చరితార్థతయు దుఃఖోత్తరమేకదా!

గీ. రాజ్య మది యుత్సుకత్వమాత్రంబుఁ బాపు
దానిఁ బాలించు పని దుఃఖదాయకంబ
స్వకరధృతదండ మగు నాతపత్రమట్లు
శ్రమమునకు వలెఁ గా దది శ్రమము నడఁప.

(నేపథ్యమున)

వైతాళికులు—దేవరకు విజయ మగుఁగాక.

ప్రథముఁడు—

గీ. స్వసుఖ నిరభిలాషి వగుచుఁ బ్రజలకొఱకు
గాసిలెదు నీదు వృత్తి యిక్కరణి సతము
తరువు తీవ్రోష్ణమును దలఁ దాల్చి స్వాశ్రి
తాళి పరితాపమును నీడ నార్చుఁ గాదె.

ద్వితీయుడు—

ఆ. వె. దారిఁ దప్పువారి దండిపై మరలింతు
కలహ మార్చి ప్రోవఁగలవు భాగ్య
మెచ్చ బంధు లుందు రేమి నీ యెడనె యా
బంధుకృత్య సిద్ధి ప్రజకు భూప.

రాజు—విచారమనస్కుల మయ్యు మే మిపుడు వీరి మాటలచే మఱల
నుత్సాహవంతుల మైతిమి. (అని నడచును.)

ప్రతీహారి—క్రొత్తఁగ శుద్ధముఁ జేయుటచే శోభావంత మైనట్టిదియు,
హోమధేనువు గట్టివేయఁబడినట్టిదియు నైన యీ యగ్నిహోత్ర
శాల బహిర్ద్వారప్రకోష్ఠ మిదె, దేవరవారు వేంచేయుఁడు.

రాజు—(ఎక్కి, కూడ వచ్చువాని బుజ మానుకొని నిల్చుండును)
వేత్రవతీ! దేని నుద్దేశించి త్రికాలజ్ఞుఁడగు కాశ్యపుఁడీ ఋషు
లను నా దగ్గఱ కనిపియుండును ?

మ. వ్రతవత్సంచిత సత్తపోధన తపోవ్యాఘాత మే కల్గెనో!
అతిధూర్తుం డెవఁడేని నేఁచెనొకో ధర్మారణ్య సత్త్వంబులన్
లతలన్ బూఁతలు నిల్చిపోయెనొ కదా నా చేయు దోసంబులన్
మతి నా కిట్టు లనిర్ణయాకుల మగున్ నానా వితర్కంబులన్.

ప్రతీహారి—సచ్చరిత్రముచే సంతుష్టి నొందిన ఋషులు దేవరవారిని
సంభావించుటకు వచ్చి రని యూహించెదను.

(అంతట గౌతమీసహితు లయి, శకుంతలను ముం దిడుకొని
మునులును, వారి ముందఱ కంచుకియును, బురోహితుఁడు ప్రవేశింతురు.)

కంచుకి—అయ్యలారా! ఇటు, ఇటు.

శార్ఙ్గరవుఁడు—ఓ శారద్వత!

మ. నరపాలుం డురుభాగ్యశాలి క్రమముం దప్పం డహో యెంతయు
నరుఁ డొక్కండును వర్ణహీనుఁ డయినన్ మార్గేతరం బందునన్
జోరుఁ డట్లయ్యు సదా వివిక్తవసతిన్ మోదించు చిత్తమ్మునన్
నరకీర్ణం బగు దీని నెంతు శిఖి సంతప్తాలయంబున్ బలెన్.

శారద్వతుఁడు—పురప్రవేశమువలన నీ విట్లనుట తగియే యున్నది. నేను గూడ,

గీ. స్నాతుఁ డభ్యక్తు నఁటుచిని శౌచయుతుఁడు
బద్ధు స్వైరియు సుప్తుఁ బ్రబుద్ధుఁ డెటులఁ
గాంచుచుందురో యవ్విధిఁ గాంతు నేను
వీరి సుఖపడుచున్నట్టి వారి నిచట.

శకు—(నిమిత్తమును సూచించి) అక్కటా! నా కుడికన్నేటికో యదరుచున్నది.

గౌతమి—కుమారీ! అమంగళము శాంతించుఁగాక. నీ భర్త కులదేవతలు నీకు శుభము నిత్తురుగాక! (అని నడచును)

పురోహితుఁడు—(రాజు నుద్దేశించి) ఓ మునులారా! వర్ణాశ్రమముల రక్షించు నట్టి పూజ్యుఁ డగు రాజుగారిదె మీరు వచ్చుటకుఁ బూర్వమే యాసనము నుండి లేచి మిమ్ముల నెదురుచూచుచున్నారు. వీరిని సందర్శింపుఁడు.

శార్ఙ—ఓ మహాబ్రాహ్మణుఁడా! ఇది పొగడఁదగినదియైనను మే మిందు మధ్యస్థులము. ఎట్లన

గీ. ఫలసమృద్ధిని వృక్షముల్ వంగియుండు
సమ్రదశఁ గాంచు ఘనతతి నవరసములఁ
గలిమి పెంపొంద సుజనులు గర్వపడర
వనిఁ బరోపకారులకు స్వభావ మిదియ.

ప్రతీహారి—దేవా! ఋషులు ప్రసన్నముఖవర్ణులుగాఁ గనఁబడుచున్నారు. విశ్వాసయుక్తమైన కార్యముకొఱకే వారు వచ్చియుందు రనుకొనియెదను.

రాజు—(శకుంతలను జూచి) కాని యీమె

గీ. మేలిముసుఁగును నిలువెల్ల లీలఁ దాల్చి
మేని లావణ్య మంతయుఁ గానరాక
పాండుదళ మధ్యగత పల్లవం బనంగఁ
దాపసులలోన నుంకు నీ తన్వి యెవతె.

ప్రతీహారి—దేవా! గర్భీకృతకౌతుకం బైన నా యూహ ప్రసరింప కున్నది. మహారాజా! ఈమె యాకృతిమాత్రము చూడఁదగి నదిగాఁ గనఁబడుచున్నది.

రాజు—అగుఁ గాక, పరకళత్రమును బరికించుట తగదు.

శకు—(గుండెపైఁ జేయి వైచుకొని, యాత్మగతముగ) హృదయమా! ఇట్లేల తల్లడిల్లెదవు. ఆర్యపుత్రుని భావ మెఱిఁగి ధైర్యముగ నుండుము.

పురో—(ముందుకు నడిచి) వీరే ఋషులు. విధ్యుక్తముగ నర్చింపఁబడిరి. వీరి యుపాధ్యాయుల సందేశ మేదో యున్న దఁట. దానిని దేవర వినఁదగును.

రాజు—సావధానుఁడనై యున్నాను.

ఋషులు—(చేతుల నెత్తి) రాజా! నీకు జయ మగుగాక!

రాజు—మీ యందఱకు నభివాదము చేయుచున్నాను.

ఋషులు—ఈప్సితార్థసిద్ధి యగుఁగాక!

రాజు—మునులకుఁ దపస్సు నిర్విఘ్నముగ జరుగుచున్నదా!

ఋషులు—

గీ. రక్షకుఁడ వీవు గాఁగ సదాశ్రమ కెల్ల
ధర్మకర్మాంతరాయ మే దారిఁ గలుగు
దివిని ఘర్మాంశుఁ డత్యంతదీప్తి నెసఁగఁ
బుడమి నెవ్విధి తిమిరంబు పుట్టఁ గలదు.

రాజు—నాకు రాజశబ్ద మిప్పుడుగదా యర్థవంత మైనది. పూజ్యులైన కాశ్యపులు లోకానుగ్రహార్థము కుశలముగ నున్నారా?

ఋషులు—సిద్ధిమంతులకుఁ గుశలము స్వాధీనమే; ఆయన యనామయ
ప్రశ్న పూర్వకముగ మీతో నిట్లు చెప్పు మనిరి.

రాజు—మహానుభావు లే మని యాజ్ఞాపించుచున్నారు?

శార్ఙ—గాంధర్వవిధివలన నీ నా పుత్రికను నీవు వివాహ మాడితివి.
మీ యిరువుర వివాహమునకు సంతోషించి నే నంగీకరించితిని.
ఎట్లన,

గీ. పూజ్యతములందు మా కీవు ముఖ్యుఁ డవుదు
సరి! శకుంతల రూపొందు సత్క్రియకద!
జంపతులఁ దుల్యగుణముల సంఘటించి
యిన్నినాళ్ళకు నడఁ బాసె సృష్టికర్త.

కావున గర్భవతిగా నున్న యీమెను సహధర్మాచరణము కొఱకు
గ్రహింపుము, అని.

గౌతమి—ఆర్యా! నేనుగూడఁ గొంత చెప్పఁ గోరెదను. నా మాటల
కవసరమే యుండదు, ఏలన

గీ. ఈమె గుర్వనుమతిఁ గోర దించుకైన
నా ప్రజనులను నీ వైన నడుగవైతి
వొకర కొకరు పరస్పర మొప్పఁజేయు
పనికి నొక్కొక్కరికి నేమి పలుకుదాన.

శకుంతల—(ఆత్మగతముగ) ఆర్యపుత్రుఁ డేమి చెప్పునోగదా!

రాజు—ఏమిది? ఇట్లుపన్యసించుచున్నారు?

శకుం—(ఆత్మగతముగ) అగ్గిగదా యీ వచనరచన!!

శార్ఙ—ఎట్లనియా! మీరే లోకవ్యవహారముఁ గడు నెఱింగినవారు
కదా!

గీ. భర్తగల్గి పుట్టిన యింటఁ బాయకున్న
సాధ్వినే నన్యథా యెంతు రిజనులు గాన
ప్రియయొ, యప్రియయొ ప్రమద పెనిమిటికడ
నుంట నిజబంధువులు గోరు చుందు రుర్వి.

రాజు—ఈమెను బూర్వము నేఁ బరిణయ మాడితినా ?

శకుం—(విషాదముతో నాత్మగతముగ) హృదయమా! నీవు భీతిల్లి నట్లే యిప్పుడు జరిగినది.

శార్ఙ—ద్వి. ఏమి యీ ద్వేషంబు కృతకార్యమందు
నేమి యీ విముఖత నృప ! ధర్మమందు?

రాజు—ఏల నిట్టి మిథ్యాకల్పిత మైన ప్రశ్నల నడుగుచున్నారు ?

శార్ఙ—ద్వి. ఎందేనిఁ గనఁ దలు చీ వికారంబు
లందు నైశ్వర్యమత్తాత్ముల నిజము.

రాజు—విశేషముగ నన్ను నిందించుచున్నారు.

గౌతమి—బిడ్డా ! ముహూర్తకాలము సిగ్గుపడకుము. నీ మేలిముసుఁగు నిపుడు తొలఁగించెదను. అపుడు నీ భర్త నిన్ను గుర్తించును.
(అని యట్లు చేయును.)

రాజు—(శకుంతలను బరికించి, యాత్మగతముగ)

మ. అనవద్యద్యుతి నిట్లు తోఁచినది యీ యబ్జాక్షి రూపంబు దీ
నిని నేఁ దొల్లి పరిగ్రహించు టది సందేహించుటన్, మంచు ప్రొ
ద్దున లోనుండుట మల్లెఁ దేఁటి యటులే తోడ్తోడ భోగింపఁ జా
లను వీడన్ మది నిశ్చయింపఁగను జాలన్ బాపురే దైవమా !
(అని విచారించుచుండును.)

ప్రతీహారి—ఏమీ ! ప్రభువుగారి ధర్మదృష్టి ! సుఖముగ లభ్య మైన యిట్టి రూపవతినిఁ జూచి యితరుఁ డెవ్వఁడు విచారించును ?

శార్ఙ—ఓ రాజా ! ఏల యూరకున్నావు ?

రాజు—తపోధనులారా ! నే నెంత యాలోచించినను, నీ పూజ్యురాలిని గ్రహించినట్లే నాకు స్ఫురింపకున్నదికదా ! కావున స్పష్టముగఁ గనఁబడుచున్న గర్భచిహ్నములు గల యీ మెను సందేహించు చున్న నే నెట్లు భార్యగా గ్రహింపఁ గలను ?

శకుం—(అపవారించి) ఆర్యునికిఁ బరిణయమే సందేహ మైనది. నా కిపు డింక వడియాస యేల ?

శార్ఙ్గ—అట్లు కాదు.

గీ. నీవు ముట్టిన బిడ్డపై నెసరుఁ జూపు
మానియే నీకు నిపు డవమాన్యుఁ డయ్యె
దొంగిలించిన స్వార్థంబు దొంగ నదియు
గొనఁగఁ బ్రార్థించినట్టు లిమ్మునికిఁ దగితి.

శారద్వ—శార్ఙ్గరవా! నీ విప్పు డూరకుండుము. శకుంతలా! మేము చెప్పవలసినది చెప్పితిమి. ఈ ప్రభువును నిట్లు చెప్పుచున్నాఁడు. ఆయనకు నమ్మకము కలుగునట్లు ప్రతివచన మిమ్ము.

శకుం—(అపవారించి) అట్టి యనురాగమున కిట్టి గతి పట్టినపుడు నేను జ్ఞప్తికిఁ దెచ్చుటవలని లాభ మేమి? ఇఁక నా యాత్మ దుఃఖముల పాలు గావలె నని స్థిరపడినది. (ప్రకాశముగ) ఆర్యపుత్రా! (సగము చెప్పి) పరిణయమునందే సందేహము కలిగినప్పు డీ వ్యవహారమును గూడదు. పౌరవా! పూర్వము తపోవనము నందుఁ బ్రతిజ్ఞాపూర్వకముగాఁ గపట మెఱుంగని యీ జనమును వంచించి యీ విధము లగు పలుకులచే నిరాకరించుట నీకు యుక్తము కాదు సుమా!

రాజు—(చెవులను మూసికొని) పాపము శాంతించుఁ గాక.

గీ॥ కలుష మొనరింప నెంచితే కులము పేరు
పతితుఁ జేయంగఁ దలఁచితే పడఁతి నన్ను
దరుల నొఱయుచుఁ బాఱెడు తటిని స్వచ్ఛ
జలము నొడ్డున నున్న వృక్షంబునువలె.

శకుం—కానిమ్ము, నిజముగఁ బరకళత్ర మను సంశయము నీకుఁ గల దేని నీ సందేహము నొక యానవాలుచేతఁ బోఁగొట్టెదను.

రాజు—ఇది యుత్తమ పక్షము.

శకుం—(ఉంగరపు వ్రేలిని దడవి చూచుకొని) అయ్యో! వ్రేలునం దుంగరము లేదు. (అని విషాదముతో గౌతమినిఁ జూచును)

గౌత—శక్రావతారమునందు శచీతీర్థమునకు నమస్కరించునపుడు నీ యుంగరము నిశ్చయముగా నందు జాఱి పడి యుండవచ్చును.

రాజు—(చిఱునవ్వుతో) స్త్రీలు సమయోచితబుద్ధికలవా రనుట యిట్టిదే కదా!

శకుం—ఈ విషయమున విధి తన సామర్థ్యమును జూపెను. నీకు మఱొక్కటి చెప్పెదను.

రాజు—ఇంక వినఁదగినది యున్నది!

శకుం—ఒకదినమున వనమాలికా మండపమునఁ దామరాకుదొన్నెతో నీటిని నీ హస్తమునం దుంచుకొంటివి.

రాజు—వినుచున్నాము.

శకుం—అప్పుడే నా పెంపుడు బిడ్డ యగు దీర్ఘాపాంగ మను లేడిపిల్ల సమీపించినది. నీవు కనికరముతో మొదట యది నీరు త్రాగవలె నని దానిని బుజ్జగించి పిలిచితివి. కాని నీ కది మచ్చికపడినది కాదు గావున నీ దగ్గఱకు రాలేదు. అంతట నే నా నీటినే పుచ్చుకొనఁ జనవున వచ్చి త్రాగినది. అపుడు నీవు "అందఱు జనులును వారివారి బందుగులనే విశ్వసింతురు. మీరిరువు రరణ్యవాసులు" అని పరిహసించితివి.

రాజు—స్వప్రయోజనమును సమకూర్చుకొనుటకు స్త్రీ లిటువంటి మిథ్యాభూత మైన వాఙ్మధువుచే విషయాభిలాషు లగు జనుల నాకర్షింతురు.

గౌత—ఓ మహాభాగా! ఈ విధముగా నీవు చెప్పఁదగదు. ఆశ్రమమునందుఁ బెఱిగిన యీ బిడ్డ కపటము నెఱుగదు సుమా.

రాజు—వృద్ధతాపసీ!

ఉ. నేరువనట్టి నేర్పులు గణింప నమానుషజాతు లందె యొ
ప్పారును స్త్రీల, బుద్ధియుతలం దనఁ జెప్పఁగ నేల మింటిపై
దారక మున్నొగిఁ బరభృతంబులు స్వీయ మపత్యజాతముం
ధారుణిఁ బెంపఁజేయుఁ గద *తద్దయు నన్య విహంగజాతిచే.

*పాఠాంతరము:—తద్దయు నన్యములౌ ద్విజాళిచేఁ,

శకుం—(రోషముతో) అనార్యుఁడా! నీ మనసులోని యనుమానమును బట్టి (సర్వమును) గాంచుచున్నావు. గడ్డిచేఁ గప్పఁ బడిన కూపం బట్లు ధర్మకంచుకము ధరించి నీ వలె నన్యుఁ డెవ్వఁడు వర్తించును?

రాజు—(ఆత్మగతముగ) నన్ను సందేహముపాలు చేయుచు నీమె కోపము కపటము లేనట్టులే కనఁబడుచున్నది.

గీ. విస్మృతిక్రూరమానసవృత్తి నగుట
నే రహఃకృతపరిణయంబు నెఱుఁగ ననఁగ
మరునివిల్ ద్రుంచినట్లయ్యె నరుణనయన
కుటిలభ్రూభంగమున నతిక్రోధమునను.

(ప్రకాశముగ) కల్యాణీ! దుష్యంతుని చరిత మంద తెలిసింగి నదియే. ఐన నం దిది కనఁబడదే.

శకుం—పూరువంశమునందలి నమ్మకముచే హృదయమున హాలాహలము ను ముఖమునఁ దేనెయుఁ గల యీ రాజుచేతఁ బడి యిప్పుడు స్వచ్ఛందచారిణిఁగాఁ జేయఁబడితిని. (అని ముఖముపై గుడ్డపెట్టుకొని యేడ్చుచున్నది.)

శార్ఙ్గ—స్వతంత్రముగాఁ జపలతతోఁ జేసిన పని యెప్పుడు నిట్లే దహించును.

గీ. చేయఁదగు నట్లగుటఁ బరీక్షించి చెలిమి
యది రహస్యమైన మఱియు నరసి పిదప
ననవగత హృదయు లయిన జనుల యందు
సౌహృదము తలఁపఁగ నిటు శత్రువగును.

రాజు—ఈమె యందలి విశ్వాసమునుబట్టి మా యందు దోషారోపణము చేసి యాక్షేపించుచున్నారా!

శార్ఙ్గ—(అసూయతో) నా మాటలు మీరు వ్యత్యస్తముగ విన్నారు.

గీ. జనన మాదిగ శాఠ్యంబుఁ గననివారి
మాట లవి చూడ నీ కప్రమాణమయ్యె

జగతిఁ బరవంచనమె తమ చదువుగాఁగఁ
బడయువారే నిజముఁ బల్కువార లైరి.

రాజు—ఓ యథార్థవాదీ! నీవు చెప్పిన దంతయు నంగీకరించితి మను కొనుఁడు. కాని యీమెను వంచించుటచే మాకుఁ గల్గు లాభ మేమి?

శార్ఙ—నరకము.

రాజు—పూరువంశరాజులు నరకమును గోరుదు రనుట విశ్వసింపఁ దగి నది కాదు.

శారద్వ—శార్ఙరవా! ఉత్తరముఁ జెప్పనేల? గురువుగారి సందేశము ననుష్ఠించితిమి. ఇఁక మనము తిరిగి పోదము.

(రాజు నుద్దేశించి)

గీ. కాన నీ కాంత నీకాంత దీసి నింక
విడిచిపెట్టు చేపట్టు మెవ్విధి నొనర్పు
భర్తలకు సర్వతోముఖ ప్రాభవంబు
దార లందున నద్ది యుక్తమ్ము నిజము.

గౌతమీ! ముందు నడువుము. (అని బయలుదేరుదురు.)

శకుంతల—ఎట్లు? ఈ ధూర్తుని చేత వంచింపఁబడితిని. నన్ను మీరును వదలి పెట్టి పోవుచున్నారా! (అని వారివెంట బయలుదేరును.)

గౌతమి—(నిలిచి) వత్సా! శార్ఙరవా? దీనముగ నేడ్చుచు శకుంతల మనవెంట వచ్చుచున్నది. భర్త క్రూరుఁడై వదలిపెట్టినప్పుడు నా బిడ్డ పాప మేమి చేయఁగలదు?

శార్ఙ—(కోపముతోఁ దిరిగి) దోషదర్శినీ! ఏల స్వాతంత్ర్య మవలం బించెదవు? (శకుంతల భీతిచే వణఁకును) శకుంతలా!

గీ. అధిపుఁ డాడినయట్లు నీ వైతివేని
తప్పి నడిచిన నీవు నీ తండ్రి కేల?
శుద్ధచరితంబు నీ దాట బుద్ధిఁదలఁతు
వేని పతిగృహంబున దాస్యమేని మేలు.

నిలువుము. మేము పోయెదము.

రాజు—మునీంద్రా! పూజ్యులగు నీమె నేల వంచించెదవు? ఏలన,

గీ. కలువలను విరియఁగఁ జేయుఁ గలువఱేఁడు
కమలమిత్రుండు నవ్విధి కమలములను
పరపరిగ్రహ సంశ్లేషపరత కెందు
విముఖము జితేంద్రియుల మనోవృత్తి సహజము.

శార్ఙ—అన్యసంగమువలనఁ బూర్వవిషయముల మఱచినప్పుడు నీ వధర్మమునకు భయపడిన వాఁడ వెట్లయ్యెదవు?

రాజు—(పురోహితునివంకఁ దిరిగి) ఈ విషయములో గురులాఘవములఁ గుఱించి మిమ్ములనే యడుగుచున్నాను.

క. నే మూఢుఁడనా! యీ సతి
తా మిథ్య వచించెన? యను తర్కంబున భా
ర్యామణి నే విడుతునొ? పర
భామామణి నంటునట్టి పాపి నగుదునో?

పురో—(విచారించి) అటులయిన మీ రిట్లు చేయుఁడు.

రాజు—నన్నుఁ దమ రాజ్ఞాపింపుఁడు.

పురో—పూజ్యురా లగు నీమె ప్రసవపర్యంతము మా యింటనే యుండుఁగాక. ఈ విధముగా నేలఁజెప్పితి ననఁగా "మీకుఁ బ్రథమమునఁ జక్రవర్తి యగు పుత్త్రుఁ డుదయించు నని సాధువులు మిమ్ముఁ గూర్చి చెప్పిరి. ఆ మునిదౌహిత్రుఁ డట్టి లక్షణములు కలిగియుండె నేని సంతోషముగ నామె నంతఃపురమునఁ బ్రవేశపెట్టుము. విపరీతము జరిగెనేని యీమెను దండ్రి కడ కంపుట యున్నదే కదా!

రాజు—ఆచార్యులవారికిఁ దోఁచినట్లే చేయుఁడు.

పురో—కుమారీ! నా వెంట రమ్ము.

శకుం—ఓ భగవతీ! భూదేవీ! నాకు వివరము నిమ్ము.

(ఇట్లేడ్చుచు బయలుదేరును.)

(శకుంతల పురోహితునితోడను, ఋషులతోడను నిష్క్రమించును.)

రాజు—(శాపముచేత మఱచినవాఁడై శకుంతలను గూర్చియే చింతించుచున్నాఁడు.)

(నేపథ్యమున)

ఆశ్చర్యము.

రాజు—(విని) ఇది యేమై యుండును?

(ప్రవేశించి)

పురో—(ఆశ్చర్యముతో) దేవా! ఒక యద్భుతము జరిగినది కదా.

రాజు—ఎట్లు?

పురో—మహారాజా! కణ్వశిష్యులు తిరిగిపోఁగానే

గీ॥ బాహువులఁ బైకి నెత్తి యబ్బాల యేడ్వఁ
దొడఁగెఁ దనభాగధేయంబు దూఱుకొనుచు

రాజు—తరువాత!

పురో—ఒక్క స్త్రీరూపతేజ మా యువిదఁ బైకిఁ
గొనిచనియె నప్సర స్తీర్థమునకు దరిగ.

(అందఱు నాశ్చర్యపడుచున్నారు.)

రాజు—స్వామీ! పూర్వమే మన మీ విషయమును నిరాకరించితిమి. ఇప్పుడు వ్యర్థవాదములతో నామెను వెదకుట యేల? మీరు విశ్రమింపుఁడు.

పురో—(చూచి) విజయీ భవ (అని నిష్క్రమించును.)

రాజు—వేత్రవతీ! నా మనస్సు కలఁతఁ జెందియున్నది. పడకటింటికి మార్గముఁ జూపుము.

ప్రతీ—దేవా! ఇటు! ఇటు! (అని బయలుదేరును.)

రాజు—గీ. ఏను వలదన్న మునిసుత నెంత మాత్ర
మేని నా భార్యఁగా స్మరియింప నైన
నాకు దోధూయమాన మానసము నమ్మ
కంబు గలుగంగ బోధించు కరణి నుండె.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

# అభిజ్ఞానశాకుంతలము

## షష్ఠాంకము

### ప్రవేశకము

(అంతట నగరపాలకుఁ డగు శ్యాలకుఁడును బెడతెక్కలు విఱిచి కట్టిన పురుషునిఁ దీసికొని యిద్దఱు రక్షకభటులును బ్రవేశించుచున్నారు.)

రక్ష—(పురుషునిఁ గొట్టి) ఓరీ దొంగా, చెప్పరా! రత్నాలకట్టున రాజుగారిపేరు చెక్కిన యీ యుంగరము నీ కెక్కడ దొరకినదిరా!

పురు—(భయము నభినయించి) అయ్యలారా! దయ యుంచుఁడు. నే నిట్టి పని చేయువాఁడను గాను.

ప్రథ—తగిన బ్రాహ్మణుఁడ వని విచారించి, రాజుగారు నీకు దీనిని దానము చేసిరి కాఁబోలు.

పురు—ఇప్పుడు నా మనవిఁ జిత్తగింపుఁడు. శక్రావతారతీర్థమునందు వసించు నే నొక బెస్తవాఁడను.

ద్వితీ—దొంగా! నీ జాతిని మే మడిగితిమా యేమి?

శ్యాల—సూచకా! ఇతని నంతయుఁ గ్రమముగఁ జెప్పనిండు. మధ్య నడ్డుపెట్టకుఁడు.

ఉభ—దేవర యాజ్ఞాపించినట్లే! చెప్పుము.

పురుషు—నేను వలలు, గాలములు మొదలగు వానిచేఁ జేపలుపట్టి కుటుంబమును బోషించుకొనుచున్నాను.

శ్యాలకుఁడు—(నవ్వి) ఆహా! నీ జీవన మెంతయుఁ బరిశుద్ధ మైనది.

పురుషు—గీ॥ హేయ మయ్యును సహజమౌ నెద్ది కర్మ
మట్టి దానిని వర్జింప గిట్ట దెందు
దారుణుండెయగుఁ బో పశుమారణమునఁ
జూడఁ గృపకల్మి సౌమ్యుండె సోమయాజి.

శ్యాలకుఁడు—తరువాతఁ దరువాత.

పురుషుడు—ఒక దినమున రోహిత మను మత్స్యమును గోసితిని. దాని కడుపు నందు రత్నములచే మెఱయు నీ యుంగరము కనఁబడి నది. తరువాత దానిని విక్రయింపఁ జూపుచున్న నన్ను మీరు పట్టుకొంటిరి. నన్నుఁ జంపినను జంపుడు. విడిచినను విడువుఁడు. నా కిది లభించిన విధ మిది.

శ్యాలకు—ఓ జానుకా! నీచుకంపుచే నీతఁడు గోధాదియగు జాలరివాఁడే యనుటకు సంశయములేదు. వీనికి నుంగర మగుపడుటనుగూర్చి విచారింపవలెను. రాజగృహమునకే పోవుదము.

రక్షకులు—అలాగే, ఒరే కత్తెరదొంగా, పద.

(అని యందఱు బయలు దేరుదురు.)

శ్యాలకు—సూచకా, పురద్వారమునం దీ చోరుని భద్రముగఁ గని పెట్టియుండుఁడు. నే నీ యుంగరము పట్టుపడిన విధము ప్రభువు గారికి నివేదించి వారి యాజ్ఞ వడసి తిరిగివచ్చెదను.

ఉభ—కుమరు స్వామిప్రసాదము కొఱకు లోనికిఁ బ్రవేశింపుఁడు.

(శ్యాలకుఁడు నిష్క్రమించును.)

ప్రథ—జానుకా! శ్యాలకుఁ డాలస్యము చేయుచున్నాఁడు కదా!

ద్వితీ—సమయమును గనిపెట్టిగదా రాజుల ననుసరింపవలయును.

ప్రథ—జానుకా! వధార్హుఁడైన వీనికిఁ బూవులు చుట్టుటకు నా చేతులు గులగుల లాడుచున్నవి. (అని పురుషునిఁ జూపుచున్నాఁడు.)

పురు—పూజ్యు లగు మీరు నన్ను నిర్హేతుకముగఁ జంప నెంచుట పాడిగాదు.

ద్వితీ—(చూచి) ఇదిగో ! మన యేలిక ! పత్రముఁ జేత బట్టుకొని రాజాజ్ఞను బడసి యీ దిక్కు మొగంబై కనఁబడుచున్నాఁడు. నీవు గద్దలకు బలి యయ్యెదవు! లేదా నక్కలవాతఁ బడెదవు.

(ప్రవేశించి)

శ్యాల—సూచకా ! ఈ బెస్తవానిని వదలిపెట్టుము. ఈ యుంగరపు రాక సహేతుకముగనే యున్నది.

సూచ—దేవర యాజ్ఞాపించినట్లే.

ద్వితీ—వీఁడు యమసదనమునకుఁ బోయి తిరిగివచ్చినాఁడు.

(అని పురుషుని బంధముల వదలించును)

పురు—(శ్యాలకునికి నమస్కరించి) ప్రభూ ! ఇఁక నా జీవనమున కెట్లు?

శ్యాల—రాజుగా రుంగరమునకు సరియైన ధనమును బహుమానముగఁ గూడ నీకుఁ బంపినారు. (అని వానికి ధనము నిచ్చును.)

పురు—(నమస్కార పూర్వకముగ గ్రహించి) ప్రభూ ! అనుగ్రహింపఁ బడితిని.

సూచ—తప్పకుండా యనుగ్రహమే. కొఱతనుండి దింపి యేనుఁగు మీఁద నెక్కించినారు.

జాను—శ్యాలకా ! ఈ యుంగర మనిన రాజుగారికిఁ జాల ప్రీతి యుండు నని యీ బహుమానమే చెప్పుచున్నది.

శ్యాల—అందుండు గొప్పరత్నముమీఁద రాజుగారి కంత యాదర మున్న ట్లనుకొనను. దాని దర్శనముచేత నాయనకు మిక్కిలి ప్రియ మైన వా రెవరో జ్ఞాపకమునకు వచ్చిరి. స్వభావముగా గంభీరు లైనను, ముహూర్తకాలము చింతాక్రాంతు లైరి.

సూచ—ప్రభువుగారికి సేవ చేయుట తమకు లభించినదికదా !

జాను—ఏల ! ఈ బెస్తలదొర కొఱకని చెప్పు (అని పురుషుని నసూయతోఁ జూచుచున్నాఁడు.)

పురు—అయ్యా ! దీనియందు సగము మీ సుమనోమూల్య మగుగాక.

జాను—ఇది సరిగా నున్నది.

శ్యాల—జాలరీ! ఇప్పుడు నీవు నాకు గొప్ప యనుంగు చెలికాఁడ వైతివి. కాదంబరీసాక్షికముగ మనము ప్రథమమైత్రి చేసికొన వలెను. కావునఁ గల్లంగడికే పోవుదము రమ్ము. (అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

(అంతట విమానముతో సానుమతి యను నప్సరస ప్రవేశించును.)

సానుమతి—సాధుజనులు స్నానము చేయునంతకాలము నప్సర స్తీర్థము నందు వేచి నా వంతు నేఁ జక్కఁగ నిర్వర్తించితిని. ఇప్పుడే రాజర్షి చరితము ప్రత్యక్షముగ నరసెదను. మేనకసంబంధము చేత శకుంతల నాకు శరీర సదృశ యైనది. మేనక తన కుమార్తె విషయ మిదివఱకే నన్ను నియమించియున్నది. (అంతటఁ గలయఁ జూచి) వసంతోత్సవ సమయ మైనను నీ రాజగృహము సంతోషరహితముగఁ గనుపట్టుచున్నది. ఏమి హేతువై యుండునో కదా! నాకు ధ్యానముచేతనే సర్వముఁ దెలిసికొను సామర్థ్యము కలదు. అయినను నా సఖి యాదరమును బాటింపఁ దగును. కానిమ్ము, ఈ యిరువు రుద్యానపాలికలకుఁ గనఁబడ కుండ పార్శ్వమున నుండి తెలిసికొనెదను. (అని దిగుట నభిన యించి నిలుచును.)

(అంతటఁ జూతాంకురమును జూచుచుఁ జేటియు దానివెనుక మఱియొక తెయుఁ బ్రవేశింతురు.)

ప్రథమ—

ఆ. వె. చైత్రమాసజీవ సర్వస్వమా! తామ్ర
హరితపాండుర మగు నామ్రకోర
కంబ! గాంచఁబడితి కడు ఋతుమంగళం
బును నినుఁ బరితుష్టముగ నొనర్తు.

ద్వితీయ—పరభృతికా! నీలో నీ వొంటరిగ మాట్లాడుకొనుచున్నావు. అదేమి?

ప్రథమ—మధుకరికా! చూతకళికను జూచి పరభృతిక...యున్మత్త లగును.

ద్వితీ—(సంతోషముతో దగ్గఱకు వచ్చి) మధుమాసము వచ్చినదా యేమి!

ప్రథమ—మధుకరికా! మదవిభ్రమకరము లగు పాటలఁ బాడుటకు నీ కిదియేగదా కాలము?

ద్వితీయ—సఖీ! నన్నుఁబట్టుకొమ్ము. కొనవ్రేళ్ళమీఁద నిలిచి మావి మొగ్గల గ్రహించి కామదేవార్చనముఁ జేసెదను.

ప్రథమ—అర్చనఫలములో సగము నాకు నిచ్చెదవేనిఁ బట్టుకొనెదను.

ద్వితీ—మన శరీరములు రెండైనను జీవిత మొక్కటి యగుట నే నట్లు చెప్పకున్నను నీ కది సిద్ధించును. (సఖి నూతము చేసికొని నిల్చుండి మావిచిగుళ్ళను గోయుచున్నది.) చెలీ! చూతప్రసవము చక్కఁగ వికసింపకున్నను దొడిమఁ ద్రుంచుటచేఁ బరిమళము వచ్చుచున్నది.

(అని కపోత హస్తమును బట్టి)

గీ. అర్చణముఁ జేసితి నిను జూతాంకురంబ
ధనువు నెక్కిడినట్టి యా దర్పకునికి
రసఁ బథికజన యువతి శరవ్య మగుచు
నైదు శరములలో మేటి వగుమ నీవె.

(అని చూతాంకురములను వదలుచున్నది.)

(తెరను ద్రోసికొని కోపముతోఁ గంచుకి ప్రవేశించును.)

కంచుకి—అట్లు వలదు. అజ్ఞానురాలా! దేవరవారు వసంతోత్సవము నిషేధించి యుండఁగా నీవు మావిమొగ్గల నేటికిఁ గోయ మొదలు పెట్టెదవు?

ఉభ—(భయముతో) అయ్యా! దయఁ జూపుఁడు. మాకీ విషయము తెలియదు.

కంచు—మీరు వినలేదా యేమి? వసంతమునఁ బుష్పించు తరువులును

11

వాని నాశ్రయించి యున్న పక్షులుగూడ దేవరశాసనమును బ్రమాణముగ గ్రహించినవి. చూడుఁడు.

మ. చిరసంభూతములయ్యుఁ జూతకళికల్ స్వీయోచితంబౌ రజం
బు రహిం దాల్పవు సిద్ధమై కురవకంబుల్ నిల్చెడున్ మొగ్గఁగాఁ
బొరిఁ సీతే గియు గంఠగద్గదితముల్ పుంస్కోకిలారావముల్
స్మరుఁ డమ్ముల్ సగమెత్తి జంకి పొది నుంపం బోలునం చెంచెదన్.

ఉభయులు—సందేహము లేదు. రాజర్షి మహామహిమసంపన్నుఁడు.

ప్రథమ—అయ్యా! రాష్ట్రియుఁ డగు మిత్రావసునిచేత మేము రాణిగారి పాదసేవ నిమిత్తము కొన్ని దినముల క్రిందటఁ బంపఁబడితిమి. ఇట్లుండఁగా నిచ్చట ప్రమదవనరక్షణమునకై మేము నియమింపఁబడితిమి. క్రొత్తఁగ వచ్చినవార మగుట నీ వృత్తాంతము మే మింతవఱకు వినలేదు.

కంచుకి—కానిండు. మఱల నిట్టిపనిని జేయకుఁడు.

ఉభ—అయ్యా! మాకుఁ గుతూహలముగ నున్నది. మాబోఁటి మనుష్యులు వినఁ దగునేని రాజుగారే నిమిత్తమున వసంతోత్సవమును నిషేధించిరి? చెప్పుఁడు.

సాను—మనుష్యు లుత్సవప్రియులు కదా! (ఏదియో) గొప్ప కారణమున నై యుండును.

కంచు—చెప్పఁగూడక నేమి? ఇది యందరకుఁ దెలిసినదియే. శకుంతలను రాజు నిరాకరించుటవలన నైన లోకాపవాదము మీ చెవినిఁ బడలేదా!

ఉభ—ఉంగరమును రాజు చూచినంతవఱకు శ్యాలకముఖమున విని యున్నాము.

కంచు—అయిన నేఁ జెప్పవలసినది కొంచెమే. రాజు తన యుంగరమును జూచిన నాటనుండియుఁ బూజ్యురా లగు శకుంతలను సత్యముగఁ దొల్లి రహస్యముగ వివాహ మాడితి ననియు, నజ్ఞానమున నామెను దిరస్కరించితి ననియుఁ దెలిసికొని యది మొదలు ప్రభువుగారు పశ్చాత్తాపః పడుచున్నారు. అట్లగదా!

మ. కడు ద్వేషించును రమ్యమస్వాహము ప్రాగ్భంగిఁ బ్రిక్రుత్యాళిఁకిఁ
గొలు వీఁ డిట్టటు శయ్యపై దొరలుచు న్కూర్కన్న దే లేక రేల్
గడపున్ దా మొగమోట నంతిపురి యుక్తంబైన మాటాడు న
య్యెడ గోత్రస్ఖలితుండునై త్రపను నెంతే నివ్వెఱఁ దాల్చెడున్.

సాను——నాకు సంతోషమైనది.

కంచు——దీనివలన రాజుగారు వికలమనస్కులై యుండి యుత్సవ
మును వలదని యాజ్ఞాపించిరి.

ఉభ——యుక్తముగనే యున్నది.

(నే ప థ్య ము న)

దేవా! రమ్ము! రమ్ము!

కంచుకి——(చెవి యొగ్గి) ఓహో! ప్రభువుగా రీ వైపునకే వచ్చు
చున్నారు. మీ పనులు మీ రొనర్చుచుండుఁడు.

ఉభ——అట్లే (అని వెళ్ళుచున్నారు.)

(అంతటఁ బశ్చాత్తాపమున కనుగుణమైన వేషముతో రాజును,
విదూషక ప్రతీహారులునుఁ బ్రవేశించుచున్నారు.)

కంచుకి——(రాజును జూచి) ఆహా! రూపవంతులు సర్వావస్థల
యందును, రమణీయముగనె యుందురు. రాజవరుఁ డుత్కం
ఠితుఁడైనను మనోహరముగ నున్నాఁడు. అట్లేగదా!

చ. ఉడిగి విశేష భూషణము లొక్కటి బంగరు మేల్కడెంబునుం
దొడుగుచు వామహస్తమునఁ దొరపు టూర్పున మోవి కెంపఱన్
గడు, వగ నిద్ర లేమియును గన్నులు కెంపయి చిక్కియుఁ గనం
బడఁ డటు, సానఁబట్టు నురువజ్రము కైవడి స్వాత్మకాంతిచేఁ.

సానుమతి——(రాజుఁ జూచి) శకుంతల యట్లు తిరస్కృతయై యవమా
నింపఁ బడియు వీనికొఱకు నవయుచుండుట యుక్తమేకదా!

రాజు——(పరధ్యానముచే మందముగ నడచుచు)

ఆ. వె. చెలి మృగాక్షి మేలుకొలిపినను దొలుత
పాతహృదయము సుప్తమయ్యె నిద్ది

మేలుకాంచె నకట ! చాల పశ్చాత్తాప
శోక మనుభవింపఁ జూచె నిపుడు.

సానుమతి—పాపము ! శకుంతల యదృష్ట మిట్టిదే కదా !

విదూ—(జనాంతికముగ) శకుంతలావ్యాధి మరల వీనినిఁ బట్టుకొన్నది.
దీని కెట్లు చికిత్సఁ జేయువలయునో నాకుఁ దెలియకున్నది.

కంచుకి—(సమీపించి) దేవర వారికి జయము జయము. మహారాజా !
ఉద్యానవన ప్రదేశములను జక్కఁగఁ బరిశీలించితిని. రమ్యస్థల
ములఁ దమరు యథేచ్ఛముగ విహరింపవచ్చును.

రాజు—వేత్రవతీ ! మంత్రి యగు నార్యపిశునినితో "మేము చాల
కాలము మేలుకొని యుండుటచే నిప్పుడు ధర్మాసనమునఁ
గూర్చుండుట కశక్తులముగ నున్నా మనియుఁ బురజనుల కార్య
ములను జక్కఁగ విచారించి పత్రికయందు లిఖించి పంపు
మనియు" నా మాటలుగాఁ జెప్పుము.

ప్రతీహారి—దేవరవా రాజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించును.)

రాజు—వాతాయనా ! నీవును నీ పనిమీఁద నుండుము.

కంచుకి—దేవా ! చిత్తము. (అని నిష్క్రమించును.)

విదూష—ఈఁగ నైన లేకుండఁ జేసితివి. ఇప్పుడు చల్లఁగ నుండి యెండ
కన్నెఱుఁగని రమణీయ మైన యీ యుద్యాన వనప్రదేశము
నందు నీ విప్పుడు క్రీడింతువుగాని లెమ్ము.

రాజు—వయస్యా ! సందు దొరికినప్పు డాపదలు సంప్రాప్త మగు
ననెడి వచనము కల్లగాదు సుమా ! ఎట్లంటే,

గీ. మునిసుతా ప్రణయస్మృతిఁ బొలియఁ జేయు
తమము విడిచెను నాదు చిత్తమ్ము నిదిగో
పుష్పబాణుండు నన్నేయఁ బోవుచుండి
వింటఁ జూత శరం బెక్కువెట్టె సఖుఁడ.

విదూ—నీవు కొంచె మూరకుండుము. నే నీ దుడ్డుకఱ్ఱతోఁ గందర్ప
బాణమును నాశ మొనరించెదను. (అని కఱ్ఱ నెత్తి చూతాం
కురమును బడఁగొట్టఁ బోవుచున్నాఁడు.)

రాజు—(నవ్వి) చాలు! చాలు. బ్రహ్మవర్చస్సును జూచినాము. సఖుఁడా! నా ప్రియురాలి ననుకరించుచున్న లతలందు దృష్టిని సారించుటకు నే నెక్కడ గూర్చుందును?

విదూ—మాధవీమండపమునం దీ సమయములో నుండెద ననియు, స్వహస్తమునఁ జిత్రింపఁబడిన పూజ్యురా లగు శకుంతల ప్రతిబింబమును దెచ్చి యిమ్మనియు, నీవు దాపున నున్న పరిచారిక యగు చతురిక నాజ్ఞాపించి యుంటివికదా.

రాజు—మనోరంజనస్థాన మిట్టిదే, కావున నా మార్గమునే చూపింపుము.

విదూ—ఇటు, దేవరా! ఇటు (ఇద్దఱు ప్రవేశించి కూర్చుండెదరు.)

(సానుమతి కూడ బోవుచున్నది.)

విదూ—మణులుచెక్కిన శిలలతో నీ మాధవీమండప ముపహారరమణీయ మగుట మనకు స్వాగత మిచ్చుటకు నపేక్షించు చున్నదా యనుట నిస్సంశయము. అచటికి వెళ్ళి నీవు కూర్చుండుము. (అని యిరువురు ప్రవేశించి కూర్చుందురు.)

సాను—ఈ తీఁగ నాశ్రయించుకొని నాచెలి చిత్రపటమును జూచెద. తరువాత భర్త కామెయెడలఁ గల పలువిధములైన యనురాగమును గూర్చి నివేదించెదను. (అని యట్లు చేయుచున్నది.)

రాజు—వయస్యా! ఇపుడు శకుంతల ప్రథమ దర్శనమును గూర్చిన దంతయు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. నీకు నది చెప్పియే యుంటినిగదా! ఆమెను నిరాకరించిన సమయము నందు నా సమీపమున నీవు లేవు కాని, దానికిఁ బూర్వము నందైనను నాతో నామెపేరు నుచ్చరింపనైన లేదు. నావలెనే నీవును మఱచిపోతివా యేమి?

విదూ—మఱచి పోలేదు. కాని యప్పుడు నీ వంతయుఁ జెప్పియుఁ జివరకు నదియెల్లఁ బరిహాసోక్తియే గాని సత్యము గాదంటివి. బంకమన్ను ముద్దవంటి బుద్ధిగల నేను నది యట్లేయని గ్రహించితిని. ఇంతకు నీశ్వరేచ్ఛ బలము కలదిగదా!

సాను—అది యట్టిదే ?

రాజు—(ఆలోచనామగ్నుఁడై) మిత్రుఁడా ! నన్ను రక్షింపుము.

విదూ—ఇది యేమి రాజా ! నీ కీట్లు కిది యుక్తము కాదుసుమా ! ధీరు లెప్పుడును దుఃఖసమయము లం దొకరిచేతఁ జెప్పించు కొనరు. పర్వతము లెంతగాలికి నైనఁ జలింపవుగదా !

రాజు—వయస్యా ! నిరాకరణదుఃఖ పరవశ యగు ప్రియురాలి శోచ నీయావస్థను దలంచుకొని మిక్కిలి యశక్తుడ నగుచున్నాను. ఆమె

ఉ. ఏ నిటఁ ద్రోసిపుచ్చఁ జన * నేఁగఁగ బంధులతోడ మాటి కిం
దే నిలు మం చదల్ప ముని కీడగు కణ్వుని శిష్యుఁ డంత నా
చాసయు బాష్పవారికలుషం బగు దృష్టినిఁ గ్రూరుఁ డైన నా
పై నిడె నల్లదే సవిష బాణము భంగి ననుఁ దహించెడున్.

సాను—ఆహా ! ఈ రాజుయొక్క సంతాపముచేత నాకు సంతోషము కలుగుచున్నది. స్వప్రయోజనాసక్తి యిట్టిదే !

విదూ—రాజా ! పూజ్యురా లగు శకుంతల నాకాశచరుఁ డెవ్వఁడో యపహరించియుండు నని నా సందేహము.

రాజు—అన్యుఁ డెవ్వఁడు పతిదేవత యైన యామెను స్పృశింపఁ బూను? నీ సఖికి మేనక కదా జన్మకారణ మని వింటిని. మేనక సహ చరు లెవ్వరో యామెను దీసికొని పోయి యుందు రని నా యూహ.

సాను—సమ్మోహము కలుగుట చాల యాశ్చర్యకరముగ నున్నది. కాని జ్ఞాపక ముండుట కాదు.

విదూ—అట్లయిన యెడలఁ గొలఁది కాలములోనే నీ కామె సమాగ మము కలుగును.

రాజు—ఎట్లు ?

విదూష—జననీజనకులు పతివిరహదుఃఖము గల పుత్రికఁ జూచుచుండు టకు సహింపరుగదా !

---

* వెంచ.

రాజు—వయస్యా!

గీ. స్వప్నమో! మాయయో! మతిభ్రమణమొక్కొ-
అంతె ఫలమైన పుణ్యసమాప్తి యొక్కొ-
మరల పొడచూపకయె యది మరలెనుగద
వట్టికోరికలు తటప్రపాతము లివి.

విదూ—అట్లు కాదు. అవశ్యముగ ననుభవింపఁ దగినవి తప్పక తమం తటఁ దాము సంభవించు ననుట కీ యంగుళీయకమే నిదర్శనము.

రాజు—(అంగుళీయకమును జూచి) ఉంగరమా! దుర్లభస్థానమునుండి చ్యుతమైతివి. నీ గతి శోచనీయముగ నున్నది.

గీ. ఫలమునుం బట్టి చూడ నల్పంబు నీ య
దృష్ట ముంగరమా! నా యదృష్ట మట్లు
అరుణనఖరకాంతమ్ములౌ నామె వ్రేళ్ళ
యందుఁ బడ మబ్బియును జ్యుతంబైన కతన.

సాను—ఇది యితరులచేతిలోఁ బడియుండి నట్లయిన నిక్కముగ శోచనీయమే యగును.

విదూ—రాజా! నీ నామముద్రాంకితమైన యుంగరమే సందర్భమున నామె చేతఁ బెట్టితివి?

సాను—నాకు వలెనే కుతూహలముచే నీతఁ డడుగఁబడెను.

రాజు—వినుము. స్వనగరమునకు బయలుదేరునపుడు ప్రియసి కన్నీళ్ళతో నార్యపుత్రుఁ డెంతకాలమునకుఁ గబురంపు నని నన్నడిగెను.

విదూ—తరువాత? తరువాత?

రాజు—అనంతరము నే నీ యుంగరము నామె వ్రేల నుంచుచు నిట్లంటిని.

గీ. నాదు నామాక్షరములు దినమున కొకటి
గాఁగ లెక్కింపు మిటఁ దుదిఁగల్గు తఱిని

ప్రియ, మదవరోధసద్మ ప్రవేశనేత
సేవకుఁడు నీ సమీపముఁ జేరు ననుచు.

క్రూరమనస్కుఁడైన నేను దానిని మోహముచే ననుష్ఠింప నేరనైతిని.

సాను—కడు రమణీయముగనే యున్నది. దైవము తలక్రిందులు చేసినాఁడు.

విదూ—జాలరివాఁడు చెప్పిన రోహితమత్స్యము యొక్క గర్భమున నిది యెట్లుండెను?

రాజు—శచీతీర్థమునకు నమస్కరించుచుండఁగా నీ సోదరి హస్తమునుండి యది జాఱి భాగీరథిలోఁ బడినది.

విదూ—యుక్తముగ నున్నది.

సాను—కావుననే యధర్మభీరు వైన యీ రాజునకు దీనురాలగు శకుంతల పరిణయవిషయమునందే సందేహము కలిగెను. అయిన నిట్టి యనురాగ మభిజ్ఞానము నపేక్షించునా! అ దెట్లు!

రాజు—ఈ యుంగరమును నిందించెదను.

విదూ—(ఆత్మగతముగ) ఈతఁ డున్మత్తుల మార్గము ననుసరించినాఁడు.

రాజు—

గీ. లలిత బంధుర కోమలాంగుళి కరంబు
విడిచి జలముల నీ వెట్లు పడితివో కద

అది యేల!

జడము గుణ మది తెలియదు సరియ యేల
ప్రియయు నా చేతనే తిరస్కృతినిఁ బొందె.

విదూ—(ఆత్మగతముగ) నే నాఁకలిచే మ్రింగివేయఁబడుచున్నాను. ఇఁక నెట్లు!

రాజు—ఓ ప్రియురాలా! అకారణముగ నిన్ను విడిచి పశ్చాత్తాపమునఁ గుములుచున్న వీనిని బునర్దర్శనమున ననుగ్రహింపుము.

(చిత్రఫలకమును జేతపట్టుకొని చతురిక తెరఁ దోసికొని వచ్చుచున్నది)

చతు—ఇదిగో! చిత్రపటరూపమున నున్న రాణిగారు. (అని చిత్రపటమును జూపించుచున్నది.)

విదూ—మేలు! మిత్రుఁడా! భావముయొక్క యనుప్రవేశము రమణీయస్థితిచేఁ గడు దర్శనీయముగ నున్నది. నిమ్నోన్నత ప్రదేశములందు నా దృష్టి తొట్రుపడుచున్నది.

సాను—ఆహా! ఏమి యీరాజర్షి నైపుణ్యము. సఖి యెదుట నున్నట్లే యున్నది.

రాజు—

క. ఏ దేది దర్శనీయము
కాదో యది యెల్లఁ జక్కఁగాఁ జిత్రమునం
దే దిద్దఁబడు నయిన నిం
దా దయితచెలువ మొకింత యలవడు రేఖన్.

సాను—అధికపశ్చాత్తాపముతోఁ గూడిన ప్రేమకును, గర్వరాహిత్యమునకు నిది తగియున్నది.

విదూ—రాజా! ఇందు మువ్వురు పూజ్యురాండ్రు కనఁబడుచున్నారు. అందఱును సౌందర్యవతులే. వీరియం దుత్తమురా లగు శకుంతల యెవ్వరు!

సాను—ఇట్టి సౌందర్యరాశినిగూడ గుర్తింప నేరని యీతఁ డెంతటి యపాజ్ఞుఁడు.

రాజు—వీరిలో నెవ రని నీ వూహించు చున్నావు?

విదూ—ముడివీడి పూవులు రాలుచున్న కొప్పుతోడను, చెమటబొట్టులతోఁ గూడుకొన్న మోముతోడను, మిక్కిలి వంగిన భుజములతోడను, జలాభిషేకముచే స్నిగ్ధమైన కోమలపల్లవములు గల రసాలవృక్షముచెంత నించుక బడలికతో నిలిచినట్లు వ్రాయఁబడిన యామెయే శకుంతల యనియుఁ, దక్కినవా రామె సఖు లనియు నే నూహించెదను.

రాజు—నీవు నిపుణుఁడ వోయి! ఇచట నా భావచిహ్నముున్నది.

గీ. చెమరిచిన వ్రేళ్ళు తాఁకుటచేత మరక
యల్లరేఖలకడఁ దోఁచు నశ్రు విదిగొ
గండములనుండి జాఱిన కరణి తోఁచు
వర్తికోచ్ఛ్వాసరీతినిఁ బట్టిచూడ.

చతురికా! వినోదస్థానమును సగము లిఖించితిని. నీవు వెళ్ళి తూలికను దీసికొనిరమ్ము.

చతు—అయ్యా మాఢవ్యా! ఈ చిత్రఫలకమును బట్టుకొనుము. నే నిదె పోయి వచ్చెదను.

రాజు—నేనే దీనినిఁ బట్టుకొనెదను. (అని చెప్పినట్లు చేయును.) (చేటి నిష్క్రమించును.)

రాజు—నే నన్ననో!

గీ. చెంతఁ బ్రత్యక్షముగఁ జేరఁ జెలిని మున్ను
విడిచి మఱి చిత్రగత దీనిఁ బెద్దఁజేయు
నేను దోవఁ బూర్ణ జలవాహినిని దాఁటి
యారమ మృగతృష్ణ వలచువాఁడైతి సఖుఁడ.

విదూ—(ఆత్మగతముగ) ఈ ప్రభువు నదిని దాఁటి మృగతృష్ణను జేరినాఁడు. (ప్రకాశముగ) చెలికాఁడా! ఇం దిఁకేమి లిఖింపవలెను.

సాను—ఏ యే భాగములు నా చెలికి నిం పగునో యా యా భాగముల వ్రాయఁ గోరినవాఁడై యుండవలెను.

రాజు—వినుము.

చ. పులినవిలీన హంసయుగముల్ గల మాలినిఁ దన్నదీతటం
బుల శయనించు లేళ్ళగమిఁ బొల్చు నుమాగురుపూతపాదముల్
వలయు రచింప, వ్రాయఁగను వాంఛ యొనర్తును శాఖలందు వ
ల్కలములు వ్రేల గట్టిన నగంబు సధస్థలి వామనేత్రముఁ
జిల చన జింక కొమ్ముకొనఁ జేర్చుచు నల్లనఁ గీరుకొఁ మృగిఁ.

విదూ—(ఆత్మగతముగ) నాకుఁ జూడ నీతఁడు వ్రేలాడు గడ్డములు గల తాపస సమూహముతోఁ జిత్రఫలకము నింపు నట్లున్నది.

రాజు—వయస్యా! మేము వ్రాయ నభిలషించిన శకుంతల యాభరణము నొండు మఱచితిమి.

విదూ—అది యెద్ది ?

సాను—ఎద్ది యరణ్యావాసమునకును, వినయసౌకుమార్యములకు నను రూపముగ నుండఁ గలదో యది.

రాజు—

గీ. చెక్కుపైఁ గేసరము లాడఁ జెవిని నిడిన
దిరిశినపు పుష్పబంధంబుఁ దీర్పలేదు
మరియు శరదిందుకిరణ కోమలమృణాళ
తంతువును వ్రాయ సఖుఁడ ! స్తనాంతరమున.

విదూ—ఓ చెలికాఁడా ! ఏ మిది ! ఈ యమ్మ యెఱ్ఱకలువచిగురువలెఁ బ్రకాశించుచున్న హస్తాగ్రముచేత మోమును గప్పుకొని యులికి యులికి పడుచున్నట్లున్నది ?

(సావధానముగ విమర్శించి) ఔరా ! ఇదిగో ! తొత్తుకొడుకు ! మకరందచోరుఁడు. మధుకరుఁడు పూజ్యురా లగు శకుంతలముఖమును మీదికి నెగురుచున్నాఁడు.

రాజు—ఓయీ ! ప్రగల్భుఁడైన వీని నివారింపుము.

విదూ—దుష్టులను శిక్షించు నీవే వీని నివారింప సమర్థుఁడవు.

రాజు—మంచిది. ఓ పుష్పవల్లీప్రియాతిథీ ! మధుకరా ! ఇచట నేల తిరిగి తిరిగి వేసటఁజెందెదవు ?

గీ. కుసుమమున వ్రాలియును దప్పి గొనియు నైన
మధుకరి యిదిగో నీపైన మమతఁ బూని
నీదు రాక నిరీక్షించి నిలిచియుండె
నానదుగద నిన్ను విడిచి తేనెఁ దాను.

సాను—ఈతఁ డిపుడు సమంజసముగా వారింపఁ బడినాఁడు.

విదూ—ఈ మధుకరజాతి, నివారింపఁబడినను వక్రస్వభావము గలది.

రాజు—ఓయీ! నీ విట్లు నా యాజ్ఞలో నిలువనియెడల విను మిప్పుడు మఱి

గీ. అనుపహత బాల తరుపల్లవాభిరామ
యువతి బింబాధరము రతోత్సవములందు
ముట్టి నట్టు లైన భ్రమర కట్టివైతు
నబ్జగర్భబంధన గృహామందు నిన్ను.

విదూ—ఇట్టి కఠినశాసనమునకు భయపడకుండునా యేమి ?
(నవ్వి ఆత్మగతముగ) ఈతఁ డిప్పుడు వెఱ్ఱివాఁ డైనాఁడు. నేను గూడ నీతని సాహచర్యమున నిట్టులే యైతిని.
(ప్రకాశముగ) వయస్యా ! ఇది చిత్రముకదా!

రాజు—ఏమీ! చిత్రమా!

సాను—నేనే యిప్పటికిఁ దెలిసికొంటిని. లిఖించిన దంతయు యథార్థముగ ననుభవించుచున్న యీతని మాట చెప్పవలయునా!

రాజు—వయస్యా! ఈ దుష్కరకార్యము నేల యనుష్ఠించితివి?

గీ. తన్మయం బైన మనముతో దర్శనసుఖ
మనుభవించుచు నిజమట్లు లలరుచున్న
నాకు స్మృతిఁ గలిగించి పరాకు డించి
చెలియ మఱలఁ జిత్రీకృతఁ జేసితిగద.

(అని కన్నీరు విడుచుచున్నాఁడు.)

సాను—అపూర్వ మైన యీ విరహమార్గము పూర్వాపరవిరోధిగ నున్నది.

రాజు—వయస్యా! ఇట్టి యెడతెగని దుఃఖము నెట్టు లనుభవింతును?

ఆ. వె. కన్ను మూఁతఁ బడమిఁ గలనైన నా కాంతఁ
గలియు నట్టి యెడరు కలుగదయ్యెఁ
గనుల బాష్పవారి కననీదు చిత్రస్థ
యైన యీమె నైన నక్కటకట.

సాను—శకుంతలను నిరాకరించుటచే శకుంతలకుఁ గలిగిన దుఃఖమును సర్వవిధములఁబోగొట్టితివి.

(ప్రవేశించి)

చతురిక——దేవరవారికి జయము జయము. రంగులపెట్టెను దీసికొని యిటు మొగంబై బయలుదేరితిని.

రాజు——తరువాత !

చతు——మార్గమధ్యమునఁ దరళికతో వచ్చుచున్న వసుమతీదేవి తానే ప్రభువుగారికి నొసంగెద నని చెప్పి నా చేతినుండి పెట్టెను బలాత్కారముగ లాగుకొన్నది.

విదూ——అదృష్టవశమున నీవు విడువఁబడితివి.

చతు——చెట్టుకొమ్మకుఁ దగులుకొన్న దేవిగారి పైఁటకొంగును దరళిక విడిపించునంతలో నేను దప్పించుకొని వచ్చితిని.

రాజు——వయస్యా! బహుమానగర్వితయైన దేవియును వచ్చుచున్నది. నీ వీ చిత్రఫలకమును గాపాడుము.

విదూ——"నన్న" ని చెప్పుము. (చిత్రఫలకమును దీసికొని లేచి) అవరోధజన కాలకూటము నుండి విడువఁబడితి వేని యపుడు మేఘప్రతిచ్ఛంద మను ప్రాసాదమున నన్నుఁ గేకవేయుము.

సాను——ఇతరస్త్రీయం దాసక్తచిత్తుఁ డైనను బ్రాచీనగౌరవమును బాలింప నిచ్ఛగించుచున్నాఁడు. కావున నీతఁ డతి శిథిలమైన సౌహార్దము కలవాఁడు.

ప్రతీ——(పత్రమును జేతఁబట్టుకొని) దేవరవారికి జయము జయము.

రాజు——వేత్రవతీ! దారిలో దేవినిఁ జూడలేదా!

ప్రతీ——ఔను! పత్రమును జేతఁబట్టుకొని వచ్చు నన్నుఁ జూచి యామె మఱలి పోయినది.

రాజు——దేవి కార్యజ్ఞురాలు ! నా కార్యములకుఁ బ్రతిబంధము కలుగ నీయదు.

ప్రతీ——దేవా ! "ధనసమూహము నధికముగ లెక్కింపవలసియుండుటచేఁ బౌరకార్య మొకటి మాత్రమే విచారింపఁబడినది. ఈ పత్రికయందు వ్రాయఁబడిన యీ విషయము దేవర చిత్తగింతురు గాత" మని మంత్రి మనవి చేయుచున్నాఁడు.

రాజు—ఏదీ పత్రిక నిటు చూపుము.

ప్రతీ—(చూపును.)

రాజు—(చదివి) ఎట్లూ! నావికవ్యవహారి యైన ధనమిత్రుఁ డను వర్తకుఁ డోడ పగులుటవలన మరణించెను. పాప మతఁడు బిడ్డలులేని వాఁడఁట. అతని ధనసమూహ మంతయు రాజును జెందవలయు నని మంత్రి వ్రాసియున్నాఁడు. సంతు లేమి కష్టముగదా! వేత్రవతీ! మహాధనసంపన్నుఁ డగుటచే నాతనికిఁ బెక్కండ్రు భార్య లుండియుందురు. ఆతనిభార్యలయం దెవతె యైన గర్భవతిగా నున్న దేమో విచారింపవలెను.

ప్రతీ—మహారాజా! సాకేతవర్తకుని పుత్రిక యగు నితని భార్యకు నిపుడే పుంసవనము జరిగినట్లు వినికిడి.

రాజు—అట్లయిన పితృసంబంధ మైన ధనము ననుభవింప నా గర్భస్థ శిశువునకు నర్హతగల దని నీ వేగి యమాత్యునితో నిట్లు చెప్పుము.

ప్రతీ— దేవరవా రాజ్ఞాపించినట్లే. (అని బయలుదేరును)

రాజు—ప్రతీహారీ! ఇటు రమ్ము.

ప్రతీ—ఇదిగో వచ్చితిని.

రాజు—సంతానము కలదు లే దనెడి విచార మేల!

గీ. వసుధను బ్రజ లే యే ప్రియబంధుజనముఁ
గోలుపోవుదురో వారికోలుపుఁ బాప
విషయమునఁ దక్క దుష్యంతవిభుఁడె సుమ్ము
యట్టి బందుగుఁ డని చాటుఁ డన్నిదిశల.

ప్రతీ—దేవరవారు సెల విచ్చినట్లు చాటింపఁ దగినదే. (నిష్క్రమించి)

(మఱలఁ బ్రవేశించి)

దేవరవారిశాసనమును సకాలమునఁ గురిసిన వర్షమువలె నెల్లరు కొనియాడిరి.

రాజు—(వేడినిట్టూర్పు విడిచి) ప్రతీహారీ! ఇవ్విధంబుననేకదా సంతాన రహితమై నిరాశ్రయ మైన వంశములకు మూలపురుషుల యనంతరము వారి సంపద లన్యునిఁ జేరును. నా యవసానము నందుఁ గూడ పురువంశ సంపదలకు నిట్టిగతియే.

ప్రతీ—అమంగళము తొలఁగుఁగాక.

రాజు—ఇసీ! సమీపించిన శ్రేయస్సు నవమానించిన వాఁడ నైతిని.

సాను—సందేహము లేదు. నా సఖినే మనమున నిడుకొని తన నిట్లు నిందించు కొనుచున్నాఁడు.

రాజు—గీ॥ ఆత్మతేజంబుఁ దాల్చిన యన్వయ ప్ర
తిష్ఠ నాదు సద్ధర్మపత్నిని విడిచితి
దొడ్డపంటకు నై తటి దున్ని విత్తి
కడు ఫలోన్ముఖమా నేల విడుచు భంగి.

సాను—ఇప్పుడు నీ సంతతి యవిచ్ఛిన్నముగ నుండఁ గలదు.

చతు—(జనాంతికముగ) ప్రతీహారీ! ఈ వణిగ్వృత్తాంతముచేత రాజునకు భయ మినుమడించినది. ప్రభువుగారి నూరడించుటకు మేఘప్రతిచ్ఛందము నుండి పూజ్యుఁడగు మాఢవ్యునిఁ దీసికొని రమ్ము.

ప్రతీ—లెస్సగఁ జెప్పితివి. (అని నిష్క్రమించును.)

రాజు—అక్కటా! దుష్యంతుని పితరులు సందేహించుచున్నారు. ఏలన?

చ. ఇతనికి వెన్క మాకు నీఁక నెవ్వఁడు మా కులమందు నక్కటా
శ్రుతివిహితంబుగా నొనరుచుఁ బితృతర్పణ మంచు నెంచు సం
తతివికలుండ నే వదలు నారము క్షాళిత బాష్పశేషమున్
బితరులు ద్రావుచుందురు గదా! పేరుచు వేదనతో నిజంబుగన్

(అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

చతురిక—(సంభ్రమముతోఁ జూచి) మహారాజా! ఊఱడిల్లుఁడు. ఊఱడిల్లుఁడు.

సాను—అక్కటక్కటా! ఈతఁడు దీప ముండఁగనే యది తెఱమఱుఁగున నున్న దోషమున నంధకారదోషము ననుభవించు

చున్నాఁడు. నే నిప్పుడే యీతని నానందింపఁ జేయుదును. ఏల! "యజ్ఞభాగములం దాసక్తులైన దేవతలే శీఘ్రకాలములో ధర్మపత్ని వగు నిన్ను నీ భర్తకడఁ జేర్చెద" రని శకుంతల నాశ్వాసించుచుండిన యిందజనని నోటినుండియే విని యున్నాను. కావున నట్టి సమయమునకై ప్రతీక్షించియుండుట యుక్తము. ఈ వృత్తాంతముచే నా ప్రియసఖిని సమాశ్వాసించెదను. (అని యాకాశమార్గమున కెగిరి నిష్క్రమించు చున్నది.)

(నేపథ్యమున)

అ బ్ర హ్మ ణ్య ము.

రాజు—(తెలివిఁ దెచ్చుకొని యాలకించి) ఈ యార్తనాదము మాఢవ్యునిదిగ నున్నది! ఎవ రక్కడ?

(ప్రవేశించి)

ప్రతీ—(సంభ్రమముతో) ప్రాణాపాయస్థితిలో నున్న ప్రియవయస్యుని రక్షింపుఁడు.

రాజు—బ్రహ్మచారినిఁ బరాభవించినవాఁ డెవ్వఁడు?

ప్రతీ—అదృశ్యమైన భూత మేదో యతనినిఁ బట్టుకొని పోయి మేఘప్రతిచ్ఛంద ప్రాసాదముయొక్క కొట్టకొమ్మునఁ గూర్చుండఁ బెట్టినది.

రాజు—(లేచి) అట్లుండదు. మా గృహములుకూడ భూతములచేఁ బీడింపఁబడుచున్నవిగా! ఇంత యేల?

క. దినదినము దాఁ బ్రమాదం
బున నొనరుచుఁ బాప మెఱుఁగఁబోల దటన్నన్
జనులం దెవ్వం డే పథ
మున జనునో వశమె పూర్ణముగఁ దెలియంగన్.

(నేపథ్యమున)

ఓ వయస్యా! అయ్యో! అయ్యో! వయస్యా!

రాజు—(గతిభేదముగ నడచుచు) మిత్రుఁడా! భయపడవలదు;

(నేపథ్యమున)

(మఱల నట్లే యఱచి) ఎట్లు భయపడకుండఁ గలను?

వీఁ డెవ్వఁడో! నన్నుఁ జెఱకుగడను విఱచినట్లు మెడను వెనుకకుఁ దిప్పి మూఁడు ముక్కలు చేయుచున్నాఁడు.

రాజు—(దృష్టి ముందుకు సారించి) విల్లు నిట్లందిమ్ము!

(ధనుస్సును జేతఁబట్టుకొని యవనిక ప్రవేశించుచున్నది.)

యవ—మహారాజా! నత్తముతోఁగూడ నిదిగో విల్లు. (రాజు ధనుస్సన బాణముఁ దొడుగుచున్నాఁడు.)

(నేపథ్యమున)

గీ. అభినవ గళరక్తార్థియా వ్యాఘ్రము వల
మానవపశువు నట్లు వధింతు నేను నిన్ను
నార్తభయమును బాప శరాసనంబుఁ
* బట్టు దుష్యంతుఁ డిపుడు కాపాడు నిన్ను.

రాజు—(రోషముతో) ఎట్లూ! నన్నే యుద్దేశించుచున్నాఁడు. ఓ కుణపాశనుఁడా! నిలునిలు! నీ వికఁ బ్రదుకఁ బోవు. (వి ల్లెక్కిడి) వేత్రవతీ! సోపానమార్గమును జూపుము.

ప్రతీ—ఇటు మహారాజా! ఇటు.

(అందఱును సత్వరముగ వచ్చుచున్నారు.)

రాజు—(అంతటఁ గలయఁ జూచి) ఇక్కడ నెవ్వరును లేరే!

(నేపథ్యమున)

అయ్యో! అయ్యో! పూజ్యుఁడ వగు నిన్ను నేఁ జూచుచున్నాను. నీవు నన్నుఁ జూడకున్నావు. పిల్లి పట్టుకొనిన యెలుకవలె జీవితాశను వదలుకొంటిని.

రాజు—ఓ తిరస్కరణీ గర్వితుఁడా! నా బాణము నిన్నుఁ జూడఁగలదు. ఇదిగో బాణమును సంధించు చున్నాను.

---

* పాఠాంతరము— పూను దుష్యంతు నిపుడు నిక్క బోవ నిమ్ము.

ఆ. వె. చంపఁ దగిన నిన్నుఁ జంపు నెయ్యది యట్లు
కావఁదగిన విప్రుఁ గాచు మఱియు
హంస పాలు గ్రోలి యందు మిళిత మైన
యుదకమును విడుచుచు నుండుఁగాదె.

(అని యస్త్రము సంధించు చున్నాఁడు.)

(అంతట విదూషకుని వదలి మాతలి ప్రవేశించు చున్నాఁడు.)

మాతలి—

గీ. నాకపతి నీకు దానవానీకము గుఱి
గ నొనరించె వారి పయి నీ ధనువు లాగు
సుజనుల ప్రసాదసౌమ్యదృష్టు లవి గాక
సఖులపైఁ బడవుగ తీవ్రశరము లెందు.

రాజు—(అస్త్ర ముపసంహరించి) మహేంద్రసారథి వగు మాతలీ! నీకు స్వాగతము.

విదూ—(ప్రవేశించి) ఎవనిచేత నేను యజ్ఞపశువువలె బాధింపఁ బడితినో యతఁడే యీ రాజుచే మన్నింపఁ బడుచున్నాఁడు.

మాతలి—(చిఱునగవుతో) ఆయుష్మంతుఁడా! నే నింద్రునిచే నీ యొద్దకు ననుపఁబడిన కారణమును వినుము.

రాజు—సావధాన చిత్తుఁడనై యున్నాను.

మాతలి—కాలనేమిసంతతి దుర్జయం బను దానవగణము కలదు.

రాజు—కలదు. నారదునివలనఁ బూర్వము వినియున్నాను.

మాతలి—

గీ. హరికి నీ మిత్రునకు వార లలవిగారు
అసురహంత వందు ని నెను రణాగ్ర మందు
రాత్రి హరి హరింపని తిమిరంబు రాజు
సంహరించుట యల్లది సహజమకద.

దేవర యాయుధముల ధరించియే, యిప్పుడిందురథ మెక్కి విజయార్థము బయలు దేరుఁడు.

రాజు—ఇంద్రుని మన్ననచే ననుగ్రహింపఁ బడితిని. కాని మాధవ్యుని యెడ మీ రేల యట్లు ప్రవర్తించితిరి?

మాతలి—అదియుఁ జెప్పెదను. ఆయుష్మంతుఁడే కారణముననో మనస్సంతాపమువలన వివశుఁడై యుంటఁ జూచితిని. తరువాత దేవరకుఁ గోపముఁ బుట్టించుటకై యిట్లొనర్చితిని. ఏలన,

ఆ. వె. జ్వాల లెగయఁ జేయుఁ జలితేంధనం బగ్ని
విప్రకృత మురగము విప్పు పడగ
క్షోణితలమునందు క్షోభితుం డగు జనుం
డాత్మమహిమ గాంచు నతిశయముగ.

రాజు—(జనాంతికముగ) వయస్యా! దేవేంద్రుని యానతి యతిక్రమింపరానిది. విషయమును దెలిపి మహామంత్రి పిశుననితో నా మాటలుగా నిట్లు చెప్పుము.

గీ. ఎక్కు వెట్టిన నా ధను విది మఱొక్క
కార్యమున వ్యాపృత మగు తత్కాలమునను
కేవలము నీదు ప్రతిభయే యీ వసుమతిఁ
బ్రజలఁ బరిపాలనము సేయవలయుఁ గాత.

విదూ—దేవర యాజ్ఞాపించినట్లే (అని వెళ్ళుచున్నాఁడు.)

మాతలి—ఆయుష్మంతుఁడు రథారోహణము సేయుఁగాక.

(రాజు రథము నెక్కుట నభినయించు చున్నాఁడు.)

అందఱు నిష్క్రమింతురు.

ఇది

షష్ఠాంకము సంపూర్ణము.



# అభిజ్ఞానశాకుంతలము

## సప్తమాంకము

(అంత నాకాశయానమున రథము నెక్కి మాతలితో, రాజు ప్రవేశించుచున్నాఁడు.)

రాజు——మాతలీ! నే నింద్రుని యాజ్ఞానుసారముగ నడుచుకొనిన వాఁడ నయ్యును నా కాతఁ డొనరించిన బహుమానాతిశయము వలన నన్ను నుపయుక్తునిగఁ దలంచుకొనుచున్నాను.

మాతలి——(చిఱునవ్వు నవ్వి) ఆయుష్మంతుఁడా! నాకుఁజూడ మీ రిరువురును సంతుష్టు లైనట్లు లేదు.

గీ. నాకపతి నీ కొనర్చుమన్ననలఁ దలఁచి
చూతు ప్రథమోపకృతమును జుల్కఁగాఁగ
హరియు నీ పౌరుషంబున కచ్చెరుపడి
తనదు సత్కృతి గొప్పఁగా దలఁపఁడయ్యె.

రాజు——మాతలీ! వలదు, అట్లనవలదు. నన్నుఁబంపునపుడు దేవేంద్రుఁడు చేసిన గౌరవము నా యభిలాషలకుఁ గూడ మించియున్నది. చూడుము. దేవత లందఱుముందఱ నన్నుఁ దన యర్ధాసనమునఁ గూర్చుండఁ బెట్టుకొని

గీ. చెంత నాసించియున్న జయంతుఁ జూచి
నాకపతి సస్మితుండౌచు నాదు కంఠ
మందు మృష్టవక్షోహరిచందనాంక
చారుమందారమాల నింపారఁ జుట్టె.

మాతలి——ఆయుష్మంతుఁ డమరేశ్వరునివలన దేనినిఁ బొంద నర్హుఁడు కాఁడు. చూడుము,

గీ. భోగపరుఁడైన దేవేంద్రుపురము పరగ
రెంట నుద్ధృతదానవకంటకముగ
నాఁడు నతపర్వముల హరినఖముల నటు
నీదు దివ్యశరంబుల నేఁడు నిట్లు.

రాజు—ఈ సందర్భమున మహేంద్రుని మహిమయేకదా స్తుతింపఁ దగినది.

చ. పెనుక్రియలందు నేనియును భృత్యులు సిద్ధిని గాంచు టెందునన్
గనఁగ నధీశగౌరవగుణం బని * నెమ్మది నీ వెఱుంగుమా
యనుపమ తేజుఁ డాతఁడు సహస్రకరుండె నిజాగ్రభాగమం
దునఁ దను నిల్పుకున్న నరుణుండు తమం బెటుఁ బాప నోపెడున్.

మాతలి—ఇది యుక్తమే. (కొంచెము దూర మేగి) ఆయుష్మంతుఁడా! నాకపృష్ఠప్రతిష్ఠిత మైన నీ కీర్తిసౌభాగ్యము నిచట నుండియే కాంచుము.

గీ. అమరకాంతలు నెమ్మేన నలద మిగులు
రంగులను గల్పలతికాంబరంబులందుఁ
జక్క యోజించి గేయార్థజాత మద్ది
యీ సురలు వ్రాయుచున్నారు నీ సుచరిత.

రాజు—మాతలీ, నాఁడు రాక్షససంహారోత్సుక్యమున, దివం బధిరోహించునపుడు స్వర్గమార్గమును జూడలేదు. మన మిప్పు డే వాయుపథ మందున్నాము?

మాతలి—

చ. గరిమ నభస్స్థితన్ త్రిపథగన్ వహియించెడి నెద్ది జ్యోతులం
జరుపు విభక్తరశ్మి యయి సవ్యముగా మఱియెద్ది, దాని కా
పరివహమారుతంబునకు మార్గ మటండ్రు ద్వితీయ మైన శ్రీ
హరిపదవిక్రమంబున నిరస్తతమస్కము దీని, భూవరా!

---

(పా) * నిక్కముగానె

రాజు — మాతలీ ! కావుననేకదా ! బాహ్యాంతఃకరణసహితముగ నా యంతరాత్మ ప్రసన్నముగ నుండుట ! (రథచక్రమును జూచి) మేఘమార్గమునకు మనము దిగుచున్నాము.

మాతలి — ఎట్లు తెలిసినది ?

రాజు —

గీ. అరవివరనిష్పతచ్చాతకాళిచేతఁ
జంచలాకాంతి పరివృతాశ్వములచేత
నీ రథ మిదె శీకరసిక్తనేమిఁ దెలుపు
వారిగర్భోదరాభ్రాలపైని పోక.

మాతలి — ఆయుష్మంతుఁ డిఁక క్షణములో స్వాధికారభూమిం జేరఁ గలఁడు.

రాజు — (క్రిందికిఁ జూచి) వేగముగ దిగుటవలన మనుష్యలోక మాశ్చర్య దర్శనమై కనఁబడుచున్నది. అట్లేకదా !

చ. ఎగయు ననంగఁ దోఁచు నగశృంగమునుండి ధరిత్రి డిగ్గున
ట్లగు, దళలనతక్ దరువు లట్టె విడుక్ గనుపింప బోదె లా
పగలు సమీపవృత్తిఁ దనుభావవిసష్టజలత్వముక్ విడుక్
దగ జగ మెవ్వఁడో విసరె నాఁ జుమి తేఁబడు నాదు చెంతకుక్.

మాతలి — లెస్సఁగాఁ బరికించితివి. (సగౌరవముగఁ జూచి) ఆహా! పృథివి యెంతయు రమణీయమై యున్నది.

రాజు — మాతలీ ! పూర్వసముద్రమునుండి పశ్చిమసముద్రమువఱకు వ్యాపించి సువర్ణధాతుస్రావమున, సంధ్యాకాల మేఘరాశివలె మనముందు నొక పర్వతము కనఁబడుచున్నదే ! అది యెద్ది ?

మాతలి — ఆయుష్మంతుఁడా ! ఇది కదా ! హేమకూట మను పేరు గల కింపురుష పర్వతము, తాపసులకు సిద్ధిక్షేత్రము. చూడుము.

గీ. బ్రహ్మసుతుఁడౌ మరీచి కెవ్వఁడు జనించె
నెవ్వఁడు ప్రజాపతి యనఁగ నెసఁగుచుండు
సురల కసురుల కెవ్వాఁడు గురువరుండు
భార్యతో నిందు నతఁడు తపం బొనర్చు.

రాజు—అట్లయిన శ్రేయము లనతిక్రమణీయములుకదా! మహాత్ముఁ బ్రదక్షిణించి పోఁగోరుచున్నాను.

మాతలి—ఉత్తమపక్షము. (అని యిరువురు దిగుట నభినయించుచున్నారు.)

రాజు—(సవిస్మయముగ)

గీ. శబ్దము రథాంగనేములు సలుపవయ్యె!
ధూళి క్రమ్ముట యైనను చూఁప దిందు
నిగ్రహింపని నీ తేరు నేలఁ దాఁక
కుంట దిగియును దిగని యట్లుండుఁ జుమ్ము.

మాతలి—ఇంద్రునకు నాయుష్మంతునకుఁ గల విశేష మింతమాత్రమే.

రాజు—మాతలీ! మారీచాశ్రమ మెక్కడ?

మాతలి—(చేతితోఁ జూపుచు)

మ. తనువం దర్ధము పుట్టఁబూడఁగ సహిత్వగ్వ్యాప్తమై వక్షముల్
దనరన్ జీర్ణలతాప్రతానవలయాత్యంతాగ్రస్తుఁడై కుత్తుకన్
వనశాకుంతకులాయపూరితజటాభారంబు మూపంటఁగా
నిను లక్షింపుచు స్థాణువట్లచలుఁడై యోదుండు నమ్మౌని తాన్.

రాజు—దుష్కర తపోనిష్ఠుండవైన నీకు నమస్కారము.

మాతలి—(పగ్గముల లాగిపట్టుకొని) మహారాజా! అదితి పెంచిన మందారవృక్షములు గల మారీచాశ్రమ మిదె ప్రవేశించినారము.

రాజు—స్వర్గమునకంటె నుత్కృష్టతర మైన సౌఖ్యస్థానము. అమృతసరస్సున మునిఁగిన వానివలె నైతిని.

మాతలి—(రథమును నిలిపి) ఆయుష్మంతుఁడు దిగవచ్చును.

రాజు—(దిగి) మాతలీ! మఱియిప్పుడు మీరో?

మాతలి—రథమును నియమించితిమి. మేము కూడ దిగుచున్నాము. (అట్లు చేసి) ఆయుష్మంతుఁడా! ఇటు! (పరిక్రమించి) పూజనీయు లగు మునుల తపోవనభూములను జూచెదవుగాక.

రాజు—ఓయీ ! ఆశ్చర్యముతో నవలోకించుచున్నాను.

చ. సురతరుకాననంబున ననుల్ నిలుపన్ బవనంబు, హేమప
ద్మరుచిరరేణుపీతజల ధర్మనిమజ్జన మార, ధ్యానముల్
గురుమణివేదులన్, యమమునన్ సురకాంతలచెంత దేనిక
న్య ఋషు లొనర్తు రి న త్తపము నట్టి యెడన్ దపియింతు రీరలున్.

మాతలి—మహాత్ముల యభిలాష యంతకంతకు నున్నతపదము నాక్రమింపఁ జూచుచుండునుగదా ! (కొంత నడిచి ఆకాశము వంకఁ జూచి) ఓ వృద్ధ శాకల్యా ! మహాత్ముఁడైన మారీచుఁ డేమి చేయుచున్నాఁడు ? ఏమనుచున్నావు ? తన్ను దాక్షాయణి పతివ్రతాధర్మమును గూర్చి యడుగఁగా మహర్షిపత్నీసమేతయైన యామెకు దానిని జెప్పుచున్నాఁడనియా !

రాజు—(చెవి యొగ్గి) ఓయీ ! అట్లయిన నీ సందర్భమున మనము సమయమును బ్రతీక్షింపవలయును.

మాతలి—(రాజును జూచి) ఆయుష్మంతుఁ డీ యశోకవృక్షము క్రింద నించుకసేపు నిలువ వలయును. ఇంతలో నే నింద్రజనకు నితో మిమ్ములఁ గూర్చి నివేదించుటకు నవసరము నరయుచుండెదను.

రాజు—మీకుఁ దోఁచినట్లే (అని నిలుచుండును.)

మాతలి—ఆయుష్మంతుఁడా, నేఁ బోయివచ్చెదను.

(అని నిష్క్రమించును.)

రాజు—(నిమిత్తమును సూచించి)

క. మది నాసింప మనోరథ
మదరెద వింకేల బాహువా ! వృథ, శ్రేయ
మ్మది ము న్నవధీరితమై
పదపడి దుఃఖంబుగఁ గద పరిణతిఁ గాంచున్.

( నే ప థ్య ము న )

అల్లరి చేయవలదు సుమా ! వీఁ డెట్లు తన పద్ధతికే వచ్చినాఁడో !

రాజు—(చెవి యొగ్గి) అవినయమున కిది తావు కాదు. ఈ నివారింపఁ బడువాఁ డెవఁడో కదా! (శబ్దము వచ్చిన చాయఁ జూచి సవిస్మయముగ) ఇరువురు తాపసస్త్రీలతో వచ్చు మహాబల సంపన్నుఁ డగు నీ బాలకుఁ డెవ్వఁడై యుండును?

ఆ. వె. తల్లి చన్ను సగము ద్రావఁగ, జూ లది
పట్టి మిక్కుటముగ బాధపెట్టి
చెలఁగి యాడుకొనఁగ సింహకిశోరంబు
బలిమి లాగుచున్నవాఁడు వీఁడు.*

[అంతటఁ బైవర్ణింపఁ బడిన ట్లిరువురు తాపస స్త్రీలతో బాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బాల—ఓ సింగమా! ఆవులింపుము. నీ పండ్లను లెక్కపెట్టెద.

ప్రథమ—ఓరి దుండగీఁడా! మాకు బిడ్డలతో సమాన మగు నీ జంతువుల నేల పీడించుచున్నావు? ఔరా! నీ తుందుడుకు పెచ్చుపెరుగుచున్నది. మునులు నీకు సర్వదమనుఁ డని తగినట్టే పేరు పెట్టిరి.

రాజు—ఏలొకో నా కీ బాలునియందు నౌరసపుత్రప్రేమ కలుగుచున్నది. నిక్కముగా నా యనపత్యతయే వాత్సల్యమును నాకుఁ గలిగించుచున్నది.

ద్వితీయ—ఇదిగో, ఆఁడుసింగము. నీవు దాని పిల్లను విడిచిపెట్టని యెడల నీమీఁదికి దుముకును.

బాలు—(నవ్వి) అమ్మయ్యో! నేఁ జాల భయపడితి నే!!! (అని క్రింది పెదవిఁ జూపును.)

రాజు—కం. ఉరుతర తేజోబీజము
కరణిని నీ బాలకుండు కనఁబడు నాకుఁ
గర మేధా పేక్షుండై
ధరఁ గణదశ నున్నయట్టి దహనునిభంగిన్.

ప్రథమ—వత్సా! ఈ సింగపుఁ బిల్లను వదలుము. నీ కొక యాట వస్తువు నిచ్చెదను.

* బలిర.

బాలు—అది యేదీ! దాని నిమ్ము. (అని చేయి జాచును.)

రాజు—చక్రవర్తిలక్షణముల ధరించియున్నాఁడే! కారణ మేమి?
ఇది నిజమే. ఇతనికి,

*చ. కడు స్పృహణీయవస్తువున గాటఁపు గూరిమిఁ జాపు చేయి తా
విడివడ కెంతయుఁ గలియు వ్రేళ్ళను సం దొకయింత లేనిదై
యడరెడు నిద్ధరక్తిమదళాంతరముల్ గనరాక క్రొత్తఁగాఁ
బొడము నుషస్సునన్ విరిసి పొల్పగు నేకకుశేశయంబునాన్.

ద్వితీయ—సువ్రతా! మాటమాత్రాన వీనిని మాన్పుట యసాధ్యము.
నీవుపోయి నా పర్ణశాలయందు ఋషికుమారుఁడైన మార్కండే
యుని రంగుల మట్టి నెమలియున్నది. దానినిఁదెచ్చి వీనికిమ్ము.

ప్రథమ—అట్లే (అని నిష్క్రమించును.)

బాల—అంతవఱకు దీనితోనే యాడుకొనియెదను.

(అని తాపసినిఁ జూచి నవ్వుచున్నాఁడు.)

రాజు—ధూర్తుఁడగు నీ బాలకుని యెడల నా కాశ పుట్టుచున్నది.

చ. నగుచు నహేతుకంబుగఁ గనన్ బలు మొగ్గ లొకించుకంత దోఁ
పఁగఁ దెలియంగరాని పగు వర్ణములన్ రమణీయ వాక్ప్రవృ
త్తి గలిగి, యంకమెక్కఁగ మదన్ గడు గోరెడు పుత్రులన్ వహిం
పఁగను దదంగపాంసువునఁ బంకిలు లౌదురు ధన్యు లిద్ధరన్.

తాపసి—కానిమ్ము! వీఁడు నన్ను లెక్కపెట్టుటలేదు. (అని పార్శ్వమునకుఁ
జూచుచున్నది.) ఋషికుమారులలో నెవరక్కడ? (రాజును
జూచి) భద్రముఖా! ఇటు రమ్ము. వీఁడు, పిల్లతనముచేఁ బట్టు
విడువకుండ బాధించుచున్న బాలమృగేంద్రమును విడిపింపుము.

రాజు—(సమీపించి చిఱునవ్వుతో) ఓయీ! ఋషికుమారా!

---

*మ. కడుఁగోరందగు తోయమందుఁ దమిఁ జక్కంజాపుచో హస్తమె
ప్పుడు జాలగ్రథితాంగుళీచయమునన్ స్నిగ్ధరాగంబుతో
నెడముల్ పత్రములందుఁ గానఁబడ కంతే నూతనోషస్సు చొ
ప్పడుకాలంబున నించుకే విరియు భాస్వన్ముఖ్యపద్మం బనన్,

గీ. ఇమ్మెయిని నాశ్రమ విరుద్ధవృత్తి నీవు
సత్త్వసంశ్రయ సుఖమైన సంయమంబు
జనన మాదిగ నేల దూష్య మ్మొనర్తు
పిల్లతాఁచది చందన వృక్ష మట్లు.

తాపసి—భద్రముఖా! వీఁడు ఋషికుమారుఁడు కాఁడు సుండీ!

రాజు—ఆకార సదృశమైన వీనిచేష్టితమే తెలుపుచున్నది. అయినను స్థానప్రత్యయమువలన మే మిట్టూహించితిమి. (తాపసి కోరినట్లేచేసి బాలుని స్పర్శ సుఖ మనుభవించి) (ఆత్మగతముగ)

గీ. ఎవ్వని కులాంకుర మొ యగు నితఁడు తాఁకు
నాదు గాత్రంబు లిట్టు లానంద మొందె
నే సుకృతియంకమునఁ బెంచె నితని వాని
* కీతఁ డెడఁ జేయు నానంద మెవఁ డెఱుంగు.

తాపసి—(ఇద్దఱను దేఱిచూచి) ఆశ్చర్య మాశ్చర్యము!

రాజు—అమ్మా! ఏల!

తాపసి—ఈ బాలకుని రూపమునకు నీ రూపమునకును బోలిక యున్నది యనియు, నపరిచితుఁడవైనను నీ కితఁ డనుకూలుఁ డయ్యె గదా యనియు నాశ్చర్యపడితిని.

రాజు—(బాలు నుపలాలించుచు) మునికుమారుఁడు కాని పక్షమున నీతనికుల మెయ్యది?

తాపసి—పురువంశము.

రాజు—(ఆత్మగతముగ) ఈతఁడు నాకు సగోత్రుఁ డెట్లయ్యెను? కావున నే యీ మానినియు నీతఁడు నన్నుఁ బోలియున్నాఁడని తలంచుచున్నది. పురువంశజు లగు రాజులకు (వంశక్రమాగతమై) యంత్యమున నీ వ్రత మున్నది.

గీ. తొలుత నెవ్వారు రసఁగావ వలచెదరు ర
సాధిక భవనవాసంబు నట్టివార

(పా) * కట్టె నిర్వృతి గూర్చునో యొద, నితండు.

లు నియతైక పతివ్రతలు గల యట్టి
వృక్షమూలంబులను వసియింతుర్ పిదప.

(ప్రకాశముగ) ఈ ప్రదేశము మనుష్యుల కాత్మశక్తిచే నగ
మ్యముకదా!

తాపసి—మీరు చెప్పినది నిజమే. అప్సరస్సంబంధముచే వీని తల్లి దేవ
గురు నాశ్రమమున వీనినిఁ బ్రసవించినది.

రాజు—(అపవారించి) అయ్యో! ఇది రెండవ యాశాజననము.

(ప్రకాశముగ) మఱి, యా సతీమణి యే నామధేయము గల
రాజర్షి పత్నియో?

తాపసి—ఆఁ! ధర్మపత్నినిఁ బరిత్యజించినవాని నామ సంకీర్తనము
నెవరు చేయుదురు?

రాజు—(స్వగతము) ఈ కథకుఁగూడ నేనే లక్ష్య మగు చున్నాను
గదా! ఇప్పుడీ బాలకుని తల్లిపే రడిగెద నేని? (ఆలోచించి) ఏల!
పరదారవ్యవహార మనార్యము.

తాపసి—(మట్టినెమలినిఁ జేతపట్టుకొని ప్రవేశించి) సర్వదమనా!
శకుంతలక్షణము గాంచుము.

బాలుఁడు—(దృష్టి సారించి) మాయమ్మ యెక్కడ?

ఉభయులు—నామసాదృశ్యముచేత మాతృవత్సలుఁ డగు నీ బాలుఁడు
మోసపోయినాఁడు.

ద్వితీయ— బాలకా! ఈ మృత్తికామయూరపులక్షణమును జూడ
మంటిని.

రాజు—(ఆత్మగతముగ) ఏమీ! వీని తల్లిపేరు శకుంతలయా! మఱియు
నామ సాదృశ్యములును గలవు? మృగతృష్ణవలె నామధేయ
మాత్ర ప్రసంగము నాకు విషాదమును గలిగించునా యేమి?

బాలు—అమ్మా! ఈ చక్కని నెమలి నాకు బాగుగ నున్నది.

(అని యాటవస్తువును దీసికొనుచున్నాఁడు.)

ప్రథమ—(బాలకుని వంకఁ జూచి భయముతో) అయ్యో! వీని మని కట్టునఁ దాయెతు కనఁబడుట లేదు.

రాజు—తొందరపడకుఁడు. సింగపుబిల్లను బీడించునపు డా వస్తువు క్రిందఁ బడినది. (అని దానిని దీయఁబోవును.)

ఉభయులు—దీనిని దాఁక వలదు. ఈ రాజు దీని నెట్లు తీసినాఁడో! (అని యుభయులు విస్మయముతో నురములపైఁ జేతుల నిడి యొండొరుల నవలోకించు చున్నారు.)

రాజు—మమ్ము నేల నివారించితిరి ?

ప్రథమ—మహారాజు లాలకింతురుగాక. ఇది యపరాజిత యను పేరు గల యోషధి. మారీచమహర్షి వీనికి జాతకర్మసమయమున నిచ్చిరి. తల్లిదండ్రులును దానును దప్ప తదితరుఁ డిది భూమిపైఁ బడినప్పుడు ముట్టఁజాలఁడు.

రాజు—ఒకవేళఁ దీసి నట్లయిన.

ప్రథమ—అంతట నది పామై వానిని గఱచును.

రాజు—అట్లు జరగుట ప్రత్యక్షముగ నెప్పుడైన మీరు చూచి యున్నారా ?

ఉభ—పలుమాఱు.

రాజు—(సహర్షముగ నాత్మగతముగ) మనోరథము సంపూర్ణముగ నెఱవేరినప్పుడు నే నెట్లభినందింపకుండెదను! (అని బాలుని నాలింగనముఁ జేసికొనుచున్నాఁడు.)

ద్వితీ—సువ్రతా! రమ్ము. నియమముఁ బూనియున్న శకుంతల కీ వృత్తాంతము నివేదింతము. (అని యిద్దఱును నిష్క్రమింతురు.)

బాలు—నన్ను వదలుము. నేను మా యమ్మ యొద్దకు నేఁగెదను.

రాజు—పుత్రకా! నాతోఁ గలిసియే నీ తల్లిని సంతోషపెట్టఁగలవు.

బాలు—నా తండ్రి దుష్యంతుఁడుకదా! నీవు కాదు.

రాజు—(చిఱునగవుతో) ఈ వివాదమే నాకు నమ్మకమును బుట్టించుచున్నది.

(అంతట నేకవేణీధర యగు శకుంతల ప్రవేశించుచున్నది.)

శకుంతల—వికృతిసమయమునందుఁగూడ సర్వదమనుని యోషధి ప్రకృతినే దాల్చుట వినియు నాకు నా యదృష్టవిషయమున నాశ కలుగకున్నది. ఒకవేళ సానుమతి చెప్పినట్లే సంభవించి యుండ నోపు.

రాజు—(శకుంతలను జూచి) ఆహా! పూజ్యురా లగు శకుంతల యిదిగో! ఈమె

గీ. చేలయుగ్మంబు మిగుల మాసినది గట్టి
మోము నియమములఁ గృశింపఁ బుణ్యశీల
యేకవేణిఁ దాల్చి దయావిహీను నన్నుఁ
గూర్చి చిరవిరహావ్రత మోర్చి సలుపు

శకుం—(పశ్చాత్తాపవివర్ణుఁ డైన రాజును జూచి) ఆర్యపుత్రునివలె లేఁడే! కృతరక్షామంగళుం డగు నా పుత్రుని నిప్పుడు గాత్రసంసర్గముచేత మైలగా నొనర్చుచున్న నీతఁ "డెవ్వఁ"డో!

బాలు—(తల్లిదగ్గరకుఁ బోయి) అమ్మా! ఈ పురుషుఁ డెవ్వఁడో పుత్రకా యని న న్నాలింగనముఁ జేసికొనుచున్నాఁడు.

రాజు—ప్రియసీ! నీ యందు నేఁ గనఁబఱచినది క్రౌర్యమే యైనను జివర కిది యనుకూలముగనే పరిణమించినది. ఇప్పుడు నన్ను నీవు గుఱుతించి నట్లు తోఁచుచున్నది.

శకుం—(ఆత్మగతముగ) హృదయమా! యూరడిల్లు మూరడిల్లుము. అసూయను వదలి దైవము న న్ననుగ్రహించెను. ఈతఁ డార్యపుత్రుఁడే సుమా!

రాజు—ప్రియసీ!

గీ. స్మృతిని నా మోహతమము నశించినంత
నెదుట * నిలిచితి సుముఖి యదృష్టవశత
గ్రహణ మవసానమును బొంద రాజుతోడ
యోగమబ్బిన రోహిణి యోజ నిపుడు.

* తోఁచితి

శకుం—ఆర్యపుత్రా! జయము. జయము. (అని సగము చెప్పి కన్నీటిచే గద్గదస్వరము పడి యూరకున్నది.)

రాజు—సుందరీ!

గీ. బాష్పరుద్ధమయ్యె జయ శబ్దంబు, నాకు
జయము సిద్ధించెఁ జుమ్మి సంస్కారరహిత
పాటలోష్ఠపుటమ్ము నీ వదన మద్ది
నేను గనుఁగొన్న కతమున మీనసయన.

బాలుఁడు—అమ్మా! ఈతఁ డెవఁడు?

శకుం—బిడ్డా! నీ యదృష్టము నడుగుము.

రాజు—(శకుంతల పాదములకు నమస్కరించి)

చ. అతివ! తొలంగుతన్ మది నిరాకరణాప్రియ మింక నీకు నా
మతి చెడఁగ్రాలె నప్పు డతిమాత్రపు మోహము, వృత్తు లిట్టివే
యతితమసావృతాత్ములకు నొగఁ, శుభంబులయందునన్ శిరో
ర్పితసుమదామ మంధుఁడు సరీసృపశంకఁ బరి♦త్యజించెడున్.

శకుం—ఆర్యపుత్రుఁడు లేచుగాక. ఆ దినములందు నా పుణ్యమునకుఁ బ్రతిబంధక మగు పురాకృతకర్మము నిశ్చయముగఁ బంటకు వచ్చియుండును. కాకున్న దయాళుఁ డయ్యు, నార్యపుత్రుఁడు నా యెడల నట్టు లేల విరసముగఁ బ్రవర్తించును?

రాజు—(లేచుచున్నాఁడు.)

శకుం—తరువాత నార్యపుత్రుని కీ దుఃఖభాగిని యెట్లు జ్ఞాపకమునకు వచ్చినది?

రాజు—విషాదశల్యముల నూడదీసికొని తరువాత చెప్పెదను.

చ. మునుప టుపేక్షఁ జేసితిని మోహముచేతను దావకాధరం
బును నొగిలించు బాష్పకణమున్ మఱి యీపదరాళపక్ష్మమం

♦ త్యజింపఁడే

దనువుగ నిల్చు దాని నిపుడైనను నశ్రువుఁ జక్కనొత్తి నే
ననుశయదుఃఖముఁ గడచినట్టిఁడ నయ్యెద సుందరీమణీ.

(అని యట్లు చేయుచున్నాఁడు.)

శకుం—(ఉంగరమును జూచి) ఆర్యపుత్రా! ఇదియే యా యుంగరము.

రాజు—ఈ యంగులీయ ప్రాప్తిచేతనే గదా (నీ విషయమై) జ్ఞప్తి
కలిగినది.

శకుం—దీనిచే నెట్టి కష్టము కలిగినది! ఆర్యపుత్రునికి విశ్వాసముఁ
గలిగింపఁ దలఁచుకొనిన కాలమున నిది దుర్లభ మయ్యెనుగదా?

రాజు—కావున ఋతుసంబంధ సూచకమైన కుసుమమును లతయే
ధరించుఁ గాక.

శకుం—నేను దానిని విశ్వసింపను. ఆర్యపుత్రుఁడే దానిని ధరింప
వలయును.

(అంతట మాతలి ప్రవేశించుచున్నాఁడు.)

మాతలి—అదృష్టవశమున నాయుష్మంతుఁడు ధర్మపత్నీ సమా
గమము చేతను, పుత్రముఖ దర్శనముచేతను వర్ధిల్లుచున్నాఁడు.

రాజు—నా మనోరథము స్వాదుఫలసంపన్నంబైనది. మాతలీ! ఈ
విషయ మాఖండలునికిఁ దెలిసి యుండదేమోకదా.

మాతలి—(చిఱునవ్వుతో) దేవతలకుఁ బరోక్ష మేమున్నది? మహాను
భావుఁ డగు మారీచుఁడు నీ కిపుడు దర్శన మొసఁగును.
ఆయుష్మంతుఁడు దయచేయవలెను.

రాజు—శకుంతలా! కుమారుని దీసికొనుము. నిన్నుఁ బురస్కరించు
కొని, నే నా మహానుభావునిఁ జూడఁ గోరుచున్నాను.

శకుం—ఆర్యపుత్రునితోఁ గూడ గురువుగారి సమీపమున కేగుటకు
సిగ్గుపడుచున్నాను.

రాజు—అయిన, నభ్యుదయకాలమునం దిది యాచరింపవలయును. రమ్ము
రమ్ము. (అందఱు వెళ్లుచున్నారు.)

(అంతట నదితికశ్యపు లేకాసనమునఁ గూర్చుండి ప్రవేశింతురు.)

మారీచుఁడు—(రాజును జూచి) దాక్షాయణీ !

గీ. ఇతఁడు నీ సుతు నని మొన నేఁగు ముందుఁ
బరగు దుష్యంతుఁ డన లోకభర్త యెవని
వింట నెల్ల పనులు నెఱవేరుచుంట
నాభరణ మయ్యె హరికి వజ్రాయుధంబు.

అదితి—ఈతని యాకృతి మన్ననకుఁ దగిన మహిమ గలిగి యున్నది.

మాతలి—ఆయుష్మంతుఁడా ! దేవగురు లిదె పుత్రప్రేమ సూచకము
లైన నేత్రములతోఁ దమవైపు చూచుచున్నారు. వారి సమీ
పమునకుఁ బొమ్ము.

రాజు—మాతలీ !

ఉ. ద్వాదశమూర్తి భాస్కరనిదానముగా మును లందు రేని, నిం
కే దల యజ్ఞభాగపతి నిమ్ములఁ గాంచెఁ ద్రిలోకనాథు, దా
మోదరుఁడౌ స్వయంభవుఁడు నుద్భవ మొందఁగ నాస్పదంబుగా
నేది యొనర్చె నొక్కతర మే యెడ బ్రహ్మకు దేని కల్లదే
గాదిలి ద్వంద్వ మియ్యది జగన్నుత దక్షమరీచిజాతముల్.

మాతలి—అవును.

రాజు—(సమీపించి) ఇంద్రుని యాజ్ఞానువర్తి యగు దుష్యంతుఁ డిదె
మీ కిరువురకు నమస్కరించు చున్నాఁడు.

మారీ—వత్సా ! చిరకాలము జీవింపుము. పృథివినిఁ బాలింపుము.

అదితి—వత్సా ! అప్రతిరథుఁడవు కమ్ము.

శకుం—కుమారునితోఁ గూడ మీ పాదములకు వందన మాచరించు
చున్నాను.

మారీ—కుమారీ !

గీ. భర్త దేవేంద్రునంతటివాఁడు నీకు
నల జయంతసముండు నీ యాత్మజుండు
అన్య మాశీస్సు నీకు యోగ్యమ్ముగాదు
తల్లి పౌలోమి యంతటి దాన వగుము.

అదితి—బిడ్డా, భర్తవలన మన్ననఁ బడయుము. తప్పక ఈ శిశువు దీర్ఘాయుష్మంతుఁడై యుభయకులములకుఁ బ్రమోదకారి యగును. కూర్చుండుఁడు.

(అందఱు ప్రజాపతినిఁ బరివేష్టించి కూరుచుందురు.)

మారీచు—(ప్రత్యేక మొక్కొకరి నుద్దేశించి)

క. ఈ సాధ్వియగా శకుంతల

యీ సదపత్యంబు నీ వదృష్టమున నిటుల్

భాసిలు త్రితయము గూడుట

వాసిగ శ్రద్ధాస్వవిధులు వరుసఁ గలియుటే.

రాజు—మహానుభావా! తమ దర్శనమునకుఁ బూర్వమే యభిమతార్థ సిద్ధి యయ్యెను గనుక మీ యనుగ్రహ మపూర్వ మైనది. ఎట్లంటే,

ఆ. వె. ముందు పూవుపుట్టుఁ బొడమును ఫల మంతె

మొదల మబ్బుపట్టు పిదప జలము

కార్యకారణముల క్రమ మిదైన భవత్ప్ర

సాదమునకు ముందు సంపద లగు.

మాతలి—ప్రజాపతు లిట్లే ప్రసన్ను లగుచుందురు.

రాజు—మహాత్మా! మీయాజ్ఞానువర్తిని యగు నీ శకుంతలను గాంధర్వ విధిచే వివాహ మాడి కొంతకాలమునకుఁ బిదప బంధుజనులు తోడితేర నా సమీపమునకు వచ్చిన యీమెను స్మృతిశైథిల్యమువలన నిరాకరించి మీ సగోత్రికుఁడైన కణ్వునికి నపచార మొనర్చితిని. అంగుళీయక దర్శనానంతరము నే నాతనిపుత్రినిఁ బరిణయ మైనట్లు తెలిసికొంటిని. ఇది చూడ వికృతి చిత్రముగఁ దోఁచుచున్నది.

ఆ. వె. ఎదుర గోచరింప నేనుఁగు కాదని

యదియుఁ జనఁగ సంశయము జనింప

నడుగుల గని నమ్మ నవల నా విధమయ్యె

నాకు విక్రృతి యది మనమ్మునందు.

మారీచు—వత్సా! ఆత్మాపరాధశంకను వదలుము. సమ్మోహము కూడ నీ యందు పపన్నము కాదు. వినుము.

రాజు—అవహితుఁడనై యున్నాను.

మారీచు—అప్సరస్తీర్థమునుండి మేనక దుఃఖవివశురా లగు శకుంతలను దీసికొని దాక్షాయణియొద్దకు వచ్చినపుడే 'దుర్వాసుని శాపమువలనఁ బాప మీ సహధర్మచారిణి నీచే నట్లు నిరాకరింపఁ బడినది కాని వేఱుకారణమునఁ గాదనియు, నంగుళీయకదర్శనముతో నీ శాపము తీఱు' ననియు ధ్యానమువలనఁ దెలిసికొంటిని.

రాజు—(నిట్టూర్పుతో) ఈ యపవాదమునుండి విముక్తుఁడ నైతిని.

శకుం—(స్వగతముగ) ఈశ్వరేచ్ఛ. ఆర్యపుత్రుఁడు నే ననుకొన్నట్లు నిర్నిమిత్తముగ నన్నుఁ బరిత్యజింప లేదు. నేను శపింపఁబడినట్లే నాకు జ్ఞప్తిలేదు. ఒకవేళ విరహముచే శూన్యహృదయ నగు నా కా శాప విషయమే తెలిసియుండక పోవచ్చును. కావుననే కాఁబోలు నా సఖు లిద్దఱును భర్తకంగుళీయకమును జూపించుమని నా కాజ్ఞాపించిరి.

మారీ—కుమారీ! కృతకృత్యురాల వైతివి. సహధర్మచరుని యెడ నీకుఁ గోపము సేయఁదగదు. చూడుము.

చ. పతి స్మృతిరోధరూక్షుఁ డగు పట్టున శాపవశంబునన్ దిర
స్కృత వయి తిప్పు డేగెఁ దమ మింక ప్రభుత్వము నీకెపో మలా
హతనిఖలప్రసాదముకురాంతర మందున ఛాయ గానరా
దతివిమలంబునం దయిన న య్యదియున్ సులభావకాశమా.

రాజు—తమరు సెలవిచ్చినట్లే.

మారీచు—వత్సా! నీ పుత్రుఁ డగు శాకుంతలేయునికి మేము జాతకర్మాదిక్రియలు విధ్యుక్తముగ నొనర్చితిమి. అది నీ కంగీకారమే కదా.

రాజు—మహానుభావా! ఇందేకదా మా వంశప్రతిష్ఠ.

మారీచు—అవును,వీనినే భావిచక్రవర్తిగాఁ దెలిసికొమ్ము. చూడుము.

సీ. మిట్టపల్లములు లేనట్టిపథంబున
స్తిమితగతిని బోవు తేరి నెక్కి
యప్రతిరథుఁ డౌచు నంభోనిధుల్ దాఁటి
యేడుదీవుల నొప్పు నీ వసుంధ
రను గెల్చు ముందు నాశ్రమ సత్త్వముల నెల్ల
బలిమి నిచ్చటఁ బట్టి బాధపెట్టు
చుండుట నీ బాలకుండు సర్వదమనుఁ
డను నామధేయాన నలరు నిప్పు

ఆ. వె. డవనిచక్రమెల్ల న్యాయంబుగాఁ బరి
పాలనంబుఁ జేసి లీలభూర
వాహకత్వగరిమ భరతుం డనెడు నాఖ్య
నితఁడు చెందు నవల నృపవరేణ్యా.

రాజు—త్రికాలజ్ఞు లగు తమచే నీ బాలుఁడు జాతకర్మాది సంస్కార
ములఁ నందియుండుట నట్టివాఁ డగు ననియే, మే మాశపడు
చున్నాము.

అదితి—స్వామీ, కణ్వునికి నతని పుత్రికాభీష్టసిద్ధిని గుఱించిన యీవ
ద్వృత్తాంతమును జెప్పి పంపుదము. పుత్రికావాత్సల్యము గల
మేనక యిచ్చటనే పరిచర్య చేయుచున్నది.

శకుం—(ఆత్మగతముగ) నా మనోరథము నీ మహానుభావురాలే చెప్పి
నది.

మారీచు—తపఃప్రభావమువలన నా మహానుభావునకు సర్వము ప్రత్య
క్షమే.

రాజు—కావుననే యమ్మహర్షి నన్నుఁ గోపింపఁ డయ్యెను.

మారీ—అయినను మన మాయనకుఁ బ్రియవార్తను దెలుపవలెను.
ఎవ రక్కడ ?

శిష్యు—(ప్రవేశించి) స్వామీ, ఇదె వచ్చితిని.

మారీ—గాలవా, ఇప్పుడే యాకాశమార్గమునఁ బోయి శాపముదీఱఁగా, స్మృతి గలిగిన దుష్యంతునిచేఁ బుత్రవతి యగు శకుంతల పరిగ్రహింపబడిన” దను సంతోషవార్తను గణ్వునితో నా మాటలుగఁ జెప్పుము.

శిష్యు—స్వామిగా రాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును)

మారీ—వత్సా! నీవుకూడ భార్యాపుత్రులతో నీ నెచ్చెలి యగు నిందుని రథం బెక్కి నీ రాజధానికిఁ దరలి పొమ్ము.

రాజు—దేవర యాజ్ఞాపించినట్లే.

మారీ—మఱియు,

చ. ధరణిపతీ, భవత్ప్రజకుఁ దా సురనాథుఁడు పూర్ణవృష్టియా
ధర వితతాధ్వరంబుల నొనర్పుచుఁ బ్రీతినిఁ గూర్పు మీవు నా
హరికిని, రెండులోకముల యభ్యుపపత్తిని శ్లాఘ్యమా పర
స్పరకృతులన్ మనుం డిటు శుభంబుగ నూర్ల యుగంబు లిర్వురున్.

రాజు—స్వామీ, యథాశక్తిగా శ్రేయస్సుఁగూర్పఁ బ్రయత్నించెదను.

మారీ—వత్సా! మఱియు నీ కింకేమి ప్రియ మాచరింతును.

రాజు—ఇంతకంటె నిష్ట మగునది నాకు మఱియేమి కలదు? అయినను దమరు నాకుఁ బ్రియము చేయఁగోరి యట్లు సెలవిచ్చితిరి. కావున నా యీ భరతవాక్య మగుఁ గాక.

చ. హితము ప్రజాళి కౌనటు మహీశుఁడు వర్తిలుచుండు గావుతన్
శ్రుతమహనీయ సత్కవులశోభన వాగ్ఝరి మించుతన్ బ్రసన్నత గనుచున్ బునర్భవము నాకును బాపునుగాత నీలలో
హితుఁడు స్వయంభువుండు పరమేశుఁడు శక్తియుతుండు శంభుఁడున్.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకము.

—♦ సర్వము సమాప్తము. ♦—

ఓ మి తి శి వ మ్.

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము

అధిపతి : పండితరాజ దంటు సుబ్బావధాని.

విద్యాశాఖ

## క వి తి ల క గ్రం థ మా ల

బె జ వా డ.

శ్రీమతి కవితిలక కవితావిశారద విద్వాన్ కాంచనపల్లి కనకాంబగారు రచియించిన పద్య గ్రంథములు

1. **శ్రీ జీ వ యా త్ర**

   ఇది శ్రీమాన్ అమృతానందనాథ మహాచార్యస్వామి వారు లోకసామాన్యమున కనుగ్రహించిన తత్త్వబోధ ములను ప్రకటించు నాంధ్రమహాకావ్యము. వేదాంత సార్వభౌమునిచే మధ్యమాధికారులకు నుత్తమ గ్రంథ ముగాఁ బరిగణింపబడినది. 2-8-0

2. **హం స వి జ య ము**

   ఆర్యవిజ్ఞానమును ప్రతిపాదించు మనోహరమగు నాటకము 1-8-0

3. **అ మృ త సా ర ము**

   పద్యకావ్యము, శ్రవణపేయమగు తత్త్వబోధ మిందు గలదు. 1-0-0

4. **ఆ నం ద సా ర ము**

   జీవన్ముక్తుల ప్రౌఢానుభూతి ఇందు వర్ణింపబడినది. 1-4-0

5. **అ భి జ్ఞా న శా కుం త ల ము**

   ఇయ్యది మహాకవి కాళిదాసు సంస్కృతనాటకమునకు మనోహర మగు నాంధ్రానువాదము. నాటకలక్షణము లను వివరించు నుపోద్ఘాతముతోఁ గూడినది. 1-0-0

# మధురాదర్శము

## మొదటి ప్రకరణము

పూర్వము కలశంబునం దుద్భవిల్లిన ద్రోణుండును పృషత పుత్రుండగు ద్రుపదుండును వేదధనుర్వేదాదుల నిష్ణాతులై యగ్నివేశునితోడ నభ్యసించిరి. కాలక్రమమున ద్రుపదుండు పాంచాలదేశంబునకు రాజయ్యె. పూర్వవాగ్దానమును బాల్యస్నేహమును బురస్కరించుకొని, భారద్వాజుండు ధనార్థియై యాతనికడకరిగి యవమానితుండై హస్తిపురికిం జని యచట కురుకుమారులకు నెల్ల శస్త్రాస్త్రవిద్య గఱపుచుండె.

ఇట్లు తనవలన విలువిద్యగఱచిన శిష్యులం జూచి "నాకవమానంబు చేసిన పాంచాలు నోడించి పట్టితెండు. ఇదియె నాకు గురుదక్షిణ" అని ద్రోణాచార్యుండు పలికె. వారును ద్రుపదుతోయుంబోయి వానిచేత నిర్జితులైరి. అర్జునుండు ద్రుపదునితోడ మహాయుద్ధంబు చేసి, వానిం బట్టుకొనివచ్చి, ద్రోణునకొప్పగించె. ద్రోణాచార్యుండు దయాంతఃకరణుండై యుల్లభంబులగు [illegible] బొమ్మని ద్రుపదుని విడిచిపెట్టె.

కాని ద్రుపదుని హృదయమున మాత్రము [illegible] పెద్దయలిగి "నన్నవమానించిన ద్రోణుని [illegible] [illegible] [illegible]" [illegible]